# మన వేమన

(శ్రీ తల్లం పుల్లన్నగుప్త ధర్మనిధి ఉపన్యాసాలూ మరికొన్ని వ్యాసాలూ)

రచన

డా॥ ఆరుద్ర



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి

## ధర్మనిధి సంస్థాపకులు

శ్రీ తల్లం పుల్లన్నగుప్త గారు కడపజిల్లా ప్రొద్దుటూరు పట్టణంలో 29-5-1917న జన్మించారు తండ్రి వీరయ్యశ్రేష్ఠి గారు, తల్లి సుబ్బమ్మ గారు తల్లిదండ్రులు దాన తత్పరులు ఆ గుణం పుత్రులయిన శ్రీ పుల్లన్న గుప్త గారిలో నిండుగా కన్పిస్తుంది శ్రీ పుల్లన్నగుప్త గారు మూడు దశాబ్దాలుగా వ్యాపార నిమిత్తం మద్రాసులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు అనేక సంస్థలకు, ఆస్పత్రులకు, దేవాలయాలకు భూరి విరాళాలను ఇచ్చినారు శ్రీ కన్యకాపరమేశ్వరి ధర్మ సంస్థలో సభ్యులుగా, ఆ సంస్థ నిర్వహించే విద్యాలయాలకు ప్రధాన కార్య నిర్వహకులుగా శ్రీ పుల్లన్నగుప్త గారు చేస్తున్న సేవ గణనీయమైంది

1981లో ఆరుద్రగారి చేత వేమనగారిపై రెండు ఉపన్యాసాలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఇప్పించారు ఆ సందర్భంలోనే వేమన గారికిపై మరికొన్ని వ్యాసాలుకూడా ప్రచురించవలసినవి ఉన్నాయని ఆరుద్ర గారు చెప్పగా అన్నిటినీ కలిపి ఒకేగ్రంథంగా ప్రచురించే ప్రయత్నానికి శ్రీ గుప్తగారు తోడ్పడుతా మన్నారు

ఇప్పుడు ఈ గ్రంథ ప్రచురణ సానుకూలమైంది

# విషయసూచిక

# మన వేమన
## ప్రచారం సంచారం

అప్పటికి ఆంధ్రులకున్న ఒకే ఒక్క విశ్వవిద్యాలయం, యాభై మూడు సంవత్సరాల కిందట, ఒక ధర్మనిధి కార్యక్రమంలో వేమనగారి మీద ఆరున్నొక్క ఉపన్యాసాలను ధారాళంగా ఇప్పించింది ఇప్పుడు ఆంధ్రులకున్న ఆరున్నొక్క విశ్వవిద్యాలయాలలో ఒకటి ముందుకు వచ్చి ఇంకో ధర్మనిధి కార్యక్రమంలో వేమనగారి మీద రెండు ఉపన్యాసాలను ఇప్పిస్తూంది చాల సంతోషం

ఈ యాభైమూడు సంవత్సరాల కాలంలో ఎన్నెన్నో వంతెనల కింద, ఎంతెంతో గంగ పారింది బ్రౌను దొరగారు వేమనగారి ప్రభావాన్ని గుర్తించి పద్యసంకలనాలు వివిధ ప్రదేశాలనుండి తెప్పించి పాఠభేదాలు గుర్తించి మొట్టమొదట ఒక పుస్తక రూపంలో అచ్చువేసిన నూరేళ్లకుగాని ఆంధ్రవిశ్వవిద్యాలయం వేమనగారిపై ఉపన్యాసాలను ఇప్పించలేదు [1] ఆ లెక్కను చూస్తే యాభై మూడేళ్ళకు మలితడవ ఉపన్యాసాల కార్యక్రమం కొంచెం తొందరగానే జరిగిందని జమకట్టుకోవాలి అనంతకాలంలో ఒక అర్ధశతాబ్దం రెప్పపాటు కాలంగానే చెప్పుకోవాలి

వేమనగారు యోగి వేమనగా ప్రసిద్ధులు వారిని కవిగా కట్టమంచి వారే తొలుత గుర్తించారు కవిత్వతత్త్వవిచారం మొదటి ప్రకరణంలోనే వేమనగారు, 'మహాకవులలో జేరిన వాడని చెప్పుటకై, సామాన్యముగ శుష్క పండితులుదప్ప నింకెవరును సందియపడరు' అని చెప్పారు [2] వేమనగారి గొప్పతనం గురించి కట్టమంచివారు చెప్పిన 24 అంశాలను నేను బేరీజు వేశాను వాటిని వివరించాలంటే వారు రాసిన పెద్ద పేరా గ్రాపునంతా చదవాలి కట్టమంచివారు సూత్రప్రాయంగా చెప్పిన చిన్న వాక్యానికి పెద్దవ్యాఖ్యానం ఉదాహరణలలో వ్రాస్తే అదే ఒక విపుల పరి

---

1 బ్రౌను మొదటి సంకలనం ప్రచురణ 1829 రాళ్ళపల్లివారి ఉపన్యాసాలిచ్చిన సంవత్సరం 1928 వీటిని పుస్తకరూపంలో ప్రచురణ చేసిన సంవత్సరం 1929

2 కవిత్వతత్త్వ విచారంలోని భావాలు 1899లో చిన్న వ్యాసరూపంలోనూ 1914లో పెద్ద పుస్తకరూపంలోనూ రామలింగారెడ్డిగారు రాశారు

శోధనా గ్రంథం అయిపోతుంది అది చేయదగ్గ సత్కార్యమేకాని ఈ ఉప న్యాసం ఉద్దేశం వేరుకాబట్టి కట్టమంచివారికి మొట్టమొదట నమస్కారం చేసి నా ఉపన్యాసాన్ని ప్రారంభిస్తున్నాను

నన్నయభట్టుగారికి నారాయణభట్టులాగ కట్టమంచివారికి రాళ్ళపల్లి వారు కవిత్వతత్త్వవిచార రచనలో చేదోడువాదోడుగా ఉండబట్టి 'కార్యము నెరవేరింది.' ఈ సంగతి అవతారికలో రామలింగారెడ్డిగారే చెప్పారు స్వయంగా ప్రతిభావంతమైన రాళ్ళపల్లివారి విమర్శనాదృష్టి కట్టమంచివారి సాహచర్యంవల్ల పదను తేరింది అందుకే అనంతకృష్ణశర్మగారు, వేమన గారిపై ఇచ్చిన ఉపన్యాసాలు అంత 'సార్వభౌమంగా' రూపొందాయి [3] శర్మగారు ఆ ఉపన్యాసాలు ఇచ్చేనాటికి తెలుగులోనేకాక ఇతరభాషలలో కూడా కలుపుకొని 43 వేమన పద్య సంకలనాలు అచ్చుపడ్డాయి 1919లో వావిళ్ళవారు ప్రచురించిన వేమనపద్యములు (ఆంధ్ర తాత్పర్య సహితము) అనే పుస్తకానికి రాళ్ళపల్లివారు విపులమైన పీఠికను కూడా రాశారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు తాత్పర్యాలు రాశారు వావిళ్ళ వారి ప్రచురణకి పీఠికరాసిన తర్వాత, పదేళ్ళలోపున అనంతకృష్ణశర్మగారు వేమనగారిపై రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి దర్మనిధి ఉపన్యాసా లను ఇచ్చారు

రాళ్ళపల్లివారి ఉపన్యాసాలకు ఆరేళ్లు ముందుగానే వేమనగారి జీవిత చరిత్రను వంగూరి సుబ్బారావుగారు రాసి ప్రకటించారు మరో రెండేళ్లకు దిగవల్లి వెంకటశివరావుగారు 'పోతన వేమనలయుగం' మీద వ్యాసంరాసి బహుమానం పొందారు రాళ్ళపల్లివారి ఉపన్యాసాల తరవాత మరో యాభై వేమన పద్య సంకలనాలుకాని, అనువాదాలుకాని, వ్యాఖ్యానాలుకాని వచ్చాయి వ్యాసాలు, జీవితచరిత్రలు పుంఖాను పుంఖాలుగా వెలువడ్డాయి వేమనగారిపై పరిశోధనలుచేసి విశ్వవిద్యాలయాలలో డాక్టరేటు పట్టాలను పొందిన వాళ్లున్నారు కేంద్ర సాహిత్య అకాడెమీ, 'భారత సాహిత్య నిర్మా తలు అనే పరంపరలో వేమనగారిపై ఒక గ్రంథాన్ని ప్రచురించింది ఆంధ్రప్రభుత్వం 'యోగివేమన తెలుగు విజ్ఞాన కేంద్రం' అనే ఒక సంస్థను నెలకొల్పింది 1839లో బ్రౌను దొర ప్రకటించిన వేమన పద్యాల సంకల నాన్ని ఈ సంస్థ ఇటీవల ప్రచురించింది కొన్ని ఊళ్ళలో వేమనగారి పేరిట

---

[3] ఈ 'సార్వభౌమం' అన్నమాట రాళ్ళపల్లి వారికి ఇష్టమైన మాట నా సమగ్ర ఆంధ్రసాహిత్యం 8వ సంపుటి పీఠికలో వారు నా రచనకు ఈ విశేషణం వాడారు.

గ్రంథాలయాలు చాలాకాలం కిందటనుంచీ ఉన్నాయి. వివిధ సాహిత్య సాంస్కృతిక సంస్థలు వేమనగారి కవిత్వంపై సభలు, సమావేశాలు, చర్చలు జరుపుతూనే ఉన్నాయి

అదిలోనే అందరూ వేమనగారిని సంఘసంస్కారిగా గుర్తించారు వీరిని తొలి అభ్యుదయకవిగా, మొదట దిగంబరకవిగా, ప్రథమ విప్లవ కవిగా అధునికులు గుర్తిస్తున్నారు వేమనగారి పద్యాలలో అదిమ శాస్త్రీయ సామ్యవాద బీజాలనూ, ఈనాటి అతివాద నగ్సలైటు సిద్ధాంతాల వేళ్ళనూ నేను గుర్తించి నా 'వేమనవేదం' గ్రంథాన్ని వ్రాశాను ఉస్మానియా విశ్వ విద్యాలయంలో డాక్టరేటు పట్టాను పొందిన చిరంజీవి ఎన్ గోపి 'వేమన వాదం' అనే గ్రంథంలో కూడా వేమనగారి ప్రస్ఫుట ప్రగతి శీలత్వానికి అద్దం పట్టాడు

వేమనగారి మీద ఇప్పటికి పెద్ద పెట్టున పరిశోధనలు జరిగినట్టు కనబడుతుంది కాని అదిలో రాళ్ళపల్లివారు చేసిన ప్రాధమిక పరిశోధనలో విషయాలన్నీ విపులంగా చర్చించి ఆ కూలంకుష విమర్శలో తేల్చిన విష యాలు మూడేమూడని నేను ఒక వ్యాసంలో పేర్కొన్నాను అవి

1 వేమన కాలదేశములు నిశ్చయముగ చెప్పవీలులేదు

2 అతని సిద్ధాంతములు వివరముగ వేర్పరుప వీలుకాదు

3 (వేమన పద్యాల) అచ్చుప్రతులందలి పాఠములుగూడ నింకను విమర్శింప వలసియున్నది

ఈ మూడు విషయాలలో మొదటిది ఇంకా చిక్కుప్రశ్నగానే మిగిలి పోవాలా ? వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, బండారు తమ్మయ్యగారి వంటి ఉద్దండపండితులు వేమనగారి కాలనిర్ణయం గురించి చాలా పరిశ్రమ చేశారు వాదోపవాదాలు చెలరేగాయి మన పరిశోధక పండితులు వేమన గారి కాలనిర్ణయం గురించి తలొకరు తలొకవిధంగా అంచనా వేశారని నా సమగ్ర ఆంధ్రసాహిత్యం పన్నెండవ సంపుటంలో ఒక జాబితాను ఇచ్చాను (పుట 67) దాని వివరాలు ఇవి

---

4 **అనంతరాగం (రాళ్ళపల్లి అభినందన గ్రంథం)**లో వేమన-రాళ్ళపల్లి అనే వ్యాసం-పుటలు 176-180

1 వంగూరి సుబ్బారావుగారు 1412-1480 శతక కవుల చరిత్ర
పుట 108

2 శేషాద్రిరమణకవులు 1460-1600 వావిళ్ల ప్రచురణ
పుట 68

3 వేదం వెంకటకృష్ణశర్మగారు 1565-1625 శతకవాఙ్మయసర్వస్వం
పుట 141

4 వేటూరి ప్రభాకరశాస్త్రీగారు — 1650 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక
1926

5 బండారు తమ్మయ్యగారు 1652-1725 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక
1925

6 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 1700—? వేమన పుట 40

వేమనగారు 1600-1752 మధ్య ఎప్పుడో ఉన్నట్టు సురవరం ప్రతాపరెడ్డిగారు రాశారని ఇటీవల నాకు తెలిసింది

వేమన పద్యాలను దేశం నాలుగు మూలలనుంచి సేకరించిన బ్రౌను దొరగారు ఎంతో పరిశోధించారు తాము రాయించి పెట్టుకున్న సంపుటాలలో వేమనగారు 1652లో జన్మించినట్టు 1725లో సిద్ధిపొందినట్టు నోటు చేసుకొన్నారు నేను బ్రౌను దొరగారి నోట్సు ఆధారంగా వేమనగారు 1650 ప్రాంతాలలో జన్మించారని సమగ్ర ఆంధ్రసాహిత్యంలో పేర్కొన్నాను [6] కాలనిర్ణయ సమస్యలో అప్పుడు లోతుకు వెళ్ళలేదు ఇటీవల చేసిన మౌలిక పరిశోధనలవల్ల వేమనగారి కాలాన్ని ఇతమిద్ధం అని నిర్ణయించడానికి నాకు ఆధారాలు దొరికాయి వాటిని ఒకటి తరువాత ఒకటి మనవి చేస్తాను చిత్తగించండి

మన ఉద్దండ పండితులందరూ ఈ విషయంలో ఏకాభిప్రాయానికి రాకపోవడంలో వింతలేదు మా గురువుగారు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

---

5 ఒ లై డి 1773 వేమన పద్యాలు 1వ భాగంలో మరణ కాలం, నాలుగవ సంపుటంలో జననకాలం నోటు చేశారు

6 సమగ్ర ఆంధ్రసాహిత్యం - పన్నెండవ సంపుటి- పుట 60

చెప్పినట్టు మన సాహితీ సమరాంగణంలో ఒక్కొక్క వేత్తకొక కుందేలు – ఎన్నిమారులు లెక్కించినా, – దానికి మూడేకాళ్లు" అది కుంటుపడినా కుప్పింపులు మానదు కొందరి కుందేళ్లకు మూడుకాళ్లేకావు ఒక కొమ్ము కూడా వుంటుంది ఆ కొమ్ము కుమ్ముతుంది అయితే స్వకీయమైన వాదం పట్లకాక సత్యంపట్ల అభిమానం ఉన్నవాళ్లు మాత్రం తమ విశ్వాసాలను గుడ్డిగా అంటిపెట్టుకోరు అందుకే ఏంతో చర్చచేశాక బండారు తమ్మయ్య గారు 'మహాశయులారా! వేమన కాల నిర్ణయమునకు దగు మార్గము లన్నియు నయోమయములుగ నున్నవి నా యభిప్రాయములు సరియైనవె యని నే చెప్పజాలను" అని స్పష్టపరిచారు [7]

వేమన గారి కాలనిర్ణయంలో మార్గాలన్నీ అయోమయాలు కావడానికి కారణం ఏమిటి? సాధారణంగా మన పరిశోధకులు ఒక కవి కాలనిర్ణయానికి ఆ కవి తన కావ్యంలో పేర్కొన్న సుప్రసిద్ధ చారిత్రక వ్యక్తుల కాలాన్ని గాని, వర్ణించిన చారిత్రక సంఘటన లనుగాని ఆధారంగా తీసుకుంటారు వేమనగారు 'గజపతులింట్లనున్న గవ్వలు వెల్లదా?' అని ఒక పద్యంలో అన్నారు కాబట్టి వారు గజపతులకాలంవారని ఒక అంచనా రాయని బాచనమీద, గుంటుపల్లి ముత్తన్నమీద భట్రాజులెందరో ఎన్నో పద్యాలు చెప్పారు కానీ వేమనగారుకూడా ఈ ప్రసిద్దుల మీద చెరోపద్యం చెప్పారు కాబట్టి వాళ్ళ కాలానికి చెందినవారని మరొకవాదన [8] ఈ కాల నిర్ణయ సూత్రంలో మరికొన్ని బీటముళ్ళు పడ డానికి రాయని బాచన్నలు

---

7 వేమన కాలం – ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1924 అని 'ప్రజాకవి వేమన'లో డా॥ గోపి ఉదహరించిన వాక్యాలు ఇవి (పుట 131)

8 ఆ రాయని బాచనపై పద్యం

పరగ రాయనికుల బాచని ధనమెల్ల
భటుల పాలు కవుల పాలు తలుప
నొనర హీన జనుని ధనము దాయాదుల
పాలు జార కాంతపాలు వేమ

(బ్రౌను (1839) పుట 104, పద్యం 288)

8 ఆ గుంటుపల్లి ముత్తయ్యపై పద్యం
ప్రాకటముగ నిట్టి లోకములో గుంటు
పల్లి ముత్తు డెన్న పరమ గురుడు
అన్న దానమునను హరు పూజ చేతను
హరునిలోన గలిసె యరుదు వేమ

(బ్రౌను (1839) పుట 104 పద్యం 289)

అయిదుగురు ఉన్నారు క్రీ శ 14వ శతాబ్ది నుంచి 17వ శతాబ్దిదాకా నాలుగు వందల ఏళ్ళ నడిమికాలంలో ఏబాచన్న కాలానికైనా వేమనగారిని చేర్చడానికి పరిశోధకులు, తమ వాదం నిలుపు కొందికీ తాపత్రయపడ్డారు ఇంతకూ రాయని బాచన్న మీద కాని, గుంటుపల్లి ముత్తన్న మీదకాని చెప్పిన పద్యాలు దీర్ఘ మకుటమున్న మూడుపాదాల ఆటవెలదులుకావు 'వేమ' అన్న హ్రస్వ మకుటమున్న చతుష్పాదాలు మంత్రి మానాటి కట్టు బాట్లను కల్పించిన రాయని భాస్కరుడే గుంటుపల్లి ముత్తయ్యకు సమకాలీ కుడు (ముత్తయ్య 1623లో చనిపోయాడు) ఈ బాచన్న కొడుకు పేరు కొండయ్య ఇతని మీద కూడా వాలామంది భట్రాజులు పద్యాలు చెప్పారు

బాచన కొండయ్య మీద చెప్పిన పద్యాలు ఒకటికాదు నాలుగు దొరుకుతున్నాయి ఈ పద్యం వినండి

పడుచు నిడిన వానిఁ బద్యమిచ్చిన వాని
గడుపు కిడిన వాని నడుపవలయు
నడుపలేనివాని నయవిదులెంతురా
భువిని భాస్కరేంద్రపుత్ర ! కొండ !

ఇది వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంకలనం చేసిన చాటుపద్య మణి మంజరి ప్రథమ భాగంలోనే ఉంది (పుట 87) అయితే ఈ పద్యమే మకుటభేదంలో వేమనగారి పద్యంలాగ చెలామణి అయికొన్ని ప్రతులలోనికి ఎక్కింది. మూడోపాదంలో మోటుదనం కూడా ఉంది చిత్తగించండి

పడుచు నొసగువాని పద్యమొసగువాని [8] ఇ
గడుపు చల్లచేసి గౌరవమున
నడపలేనివాడు నా లంజెకొడుకురా
విశ్వదాభిరామ వినురవేమ

—వేమన సూక్తి సుధాకరం

ప సం 2375

మూడవపాదంలోని మోటుదనం ఈ పాఠంలో కొంచెం ఘాటు తగ్గేఉంది బ్రౌన్ దొరగారు 1839లో ప్రచురించిన సంకలనంలో ఇది

---

[8] ఇ 'పడుచు నిచ్చిన వారి భత్స మిచ్చిన వాని అన్న పాఠాంతరం ఉంది (వే సూ ర 2313)

అచ్చుపడలేదు గాని వ్రాత ప్రతులలో కొంచెం పచ్చిగానే ఉంది[9] అందుకే 'అశ్లీల పర్వం' అనే ఒక విభాగంలో బ్రౌన్ దొరగారు బూతుల బుంగలో చేర్చవలసిన 'వేమనపద్యాల'ను వింగడించి తాత్పర్యాన్ని ఇంగ్లీషులో కాక లాటిన్‌లో వ్రాసారు (ఇది రామప్పంతులు చెప్పినట్టు వేరేకథ) ఇంతకీ బాచని కొండయ్య మీద ఎవరో భట్టు చెప్పిన పద్యం వేమన గారి పద్యం కింద చెలామణి అవుతున్నదా లేక వేమనగారి పద్యాన్నే ఒక భట్రాజు కైంకర్యం చేసాడా? ఏది ఏదయినా ఈ పద్యంలోని భావం మాత్రం ప్రాచీనమే పడుచు నిడిన వానిని, కడుపు నిడిన వానిని అగౌరవపరచ కూడదని పూర్వులే ఇలా చెప్పారు

అన్న మిచ్చిన వాని
ఆలి నిచ్చిన వాని
అపహసించుట హాని
ఓ కూనలమ్మా

ఈ కూనలమ్మ పదంలో పద్యమిచ్చిన వాని ప్రశక్తి లేదు పద్య మిచ్చాక బహుమానం ఇవ్వని వాడిని ఏ పురాతన కూచిమంచి జగ్గకవి లాంటి వాడో తిట్టిన తిట్టులాగే ఇది కనబడుతుంది వేమనగారు ఏ కావ్యమూ వ్రాయనూలేదు ఎవరికీ అంకితం ఇవ్వనూలేదు రాయని బాచన మీదా, అతని కొడుకుమీదా వేమనగారు పద్యాలు చెప్పారనడం వారిని కేవలం భట్రాజును చేయడం మాత్రమే అవుతుంది వేమనగారి సుప్రసిద్ధ పద్యాలు ఇతరుల పేరు మీదుగానో, లేక ఇతరుల ప్రఖ్యాత చాటువులు వేమనగారి ముద్ర అతికించడంతోనో ప్రచారకమవుతున్నాయని ఒక డజను ఉదాహరణలను చూపించగలను

"అనువుకాని చోట నధికుల మనరాదు
కొంచెముండు టెల్ల కొదువకాదు
కొండ యద్దమందు కొంచమై ఉండదా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర - 128)

9 పడుచు నిచ్చువాని పద్యమిచ్చిన వాని
కడుపు చల్లచేసి ఘనత జేసి
నడువ నేరనోడు నా బుల్ల గుడువనా
విశ్వదాభిరామ వినురవేమ (డి 1774)

ఇది సుప్రసిద్ధమే ఈ పద్యంలోని మొదటి పాదాన్ని యథాతథంగా తీసుకొని ఇంకో పద్యం వేమనగారి ముద్రతో అచ్చుకెక్కింది దాన్ని వినండి

అనువుగాని చోట నధికుల మనరాదు
కాల మొక్కరీతి గడుప వలయు
విజయుడిమ్ము తప్పి విరటుని కొల్వడా
విశ్వదాభిరామ వినురవేమ

ఇది ప్రక్షిప్తం కాబట్టి ఈ పద్యం బ్రౌను దొరగారి ముద్రిత ప్రతిలో కాని, వావిళ్ళ ప్రతిలోకాని, అదే కారణం వల్ల ఇటీవల బాలసరస్వతి బుక్ డిపో వారు వేసిన ప్రతిలోగాని కనబడదు అయితే ఈ పద్యం ఎక్కడ నుండి వచ్చింది ? కొంత పరిశీలన వల్ల ఆధారంగా దొరికింది దీని అసలు పాఠం ఇది

అనువుగాని వేళ నదికుల మనరాదు
కాలమెరిగి రీతి గడుపవలయు
విశ్వమేలు నకులు డశ్వ శిక్షకుడాయె
ఏమి చేయవచ్చు నీశ్వరాజ్ఞ

(చాటుపద్య మణిమంజరి 1 పుట 213)

ఈ పద్యంలోని నకులుడు అర్జునుడయ్యాడు 'ఏమిచేయవచ్చు నీశ్వరాజ్ఞ' అనే మకుటం 'విశ్వదాభిరామ వినురవేమ' అయింది వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'చాటుపద్య మణిమంజరి'లో 'ఏమి చేయవచ్చు నీశ్వరాజ్ఞ !' అన్న మకుటంతో అయిదు పద్యాలు ఉన్నాయి అందులో మరొకటి కూడా వేమనగారి పద్యంగానే అచ్చు ప్రతులు కెక్కింది

కర్మ మెవరికైన గడ ద్రోవగారాదు
ధర్మరాజు దెచ్చి తగనిచోట
గంకు భట్టు జేసె గటకటా దైవంబు
ఏమి చేయవచ్చు నీశ్వరాజ్ఞ

(చాటుపద్య మణిమంజరి – 1 పుట 213)

ఇదే పద్యం చాలా చిన్న పాఠబేధాలతో వేమనగారి పద్యంలాగ అచ్చు కెక్కింది

కర్మ-మధికమైన గడచిపోవగరాదు
ధర్మరాజు గూర్చె తగనిచోట
గంగు భట్టునంగ కటకటా యేమన
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 948)

ఈ పద్యం కూడా బ్రౌను దొరగారి ప్రతిలో లేదు వావిళ్ల ప్రతిలోనూ డిటో అయితే రెంటాలవారి శతక రత్నావళిలో ఉంది (పద్య సంఖ్య 67) 'విజయుడిమ్ము దప్పి విరటుని గొల్వడా' అనే మూడో పాదంలో ఒకటికాదు రెండు పద్యాలు రెంటాలవారి ప్రతిలో ఉన్నాయి (పద్య సంఖ్యలు 65, 66) రెంటాల వారికి బందరువారి వేమన సూక్తిరత్నాకరం మూలమై ఉండవచ్చు

'ఏమి చేయవచ్చు నీశ్వరాజ్ఞ' అనే మకుటంతో పంచపాండవుల మీద, పాంచాలి మీదా కలిసి ఆరు పద్యాలు ఎవరో చెప్పినట్టుంది సహదేవుడి మీద చెప్పిన పద్యం నష్టమైంది కాబోలు వేటూరివారు చాటుపద్య మణిమంజరిలో దానిని ఇవ్వలేదు ఇతరుల పద్యాలు వేమనగారి పద్యాల పేరుతో చెలామణి అవుతున్నాయనడానికి ఈ ఉదాహరణలేకాక ఇంక చాలా ఉన్నాయి

కల్లు నీళ్ళు తాగి కడుపెద్ద వారితో
చీర విడిచి తిరుగు సిద్ధురాలు
పనులు తీరు వెనుక పాతలు గట్టురా
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) – పుట 93 పద్యం 233)

తాంత్రికుల భైరవి చక్రంలోని పంచ 'మ' కారాలను సూచిస్తూ వేమనగారు ఈ పద్యం చెప్పారు ఇది వారి పద్యమే అనడానికి ఎటువంటి సందేహం లేదు కాగా, ఇటువంటిదే ఇంకో పద్యం ఉంది

చీరగట్టి రాత్రి సిగ్గున యొదిగుండు
పగలు విరవిడుచు పనుల యెడల
చేడె గాదుర యిది చేవాడి కత్తెర
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) – పుట 128 ప 436)

రాత్రి మండలంలో చీరలు విడిచే సిద్దురాలి మీద పద్యం చెప్పినట్టే పనికత్తె మీద వేమనగారు పద్యం చెప్పినట్టు కనబడుతుంది గాని, ఇది బ్రౌన్ దొరగారి ప్రతిలోవున్నా వెమనగారి పద్యం కాదు ఇదొక పొడుపు కద దీని అసలు పారం ఇది

చీరగట్టి రాత్రి సిగ్గున నొదిగుండు
పగలు చీరవిడిచి పనులు సెయు
చేయి వాడికత్తె చేడియగాదురా
సమ్మెటాంక భీమ జాణరాయ

దీనిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ చాటుపద్య మణిమంజరిలో 'పొడుపు పద్యాల' శీర్షిక కింద ప్రచురించారు (పుట 187) ఈ పొడుపుకు విడుపు ఏమిటంటే పగడసాల కాయలు రాత్రి మూటగట్టి పగలు వాటిని విప్పుతారు 'సమ్మెటాంక భీమ జాణరాయ' అనే మకుటంతో మరో రెండు పద్యాలు కూడ ఉన్నాయి [10] దీని భావమేమి తిరుమలేశ!' మకుటంలో ఒకటి ఆ శీర్షిక లోనే ఉంది [11] వింతలో వింత పొడుపు పద్యంగా వేమనగారి పద్యాన్నే ప్రభాకర శాస్త్రిగారు ఆ శీర్షికలోనే ఉదాహరించారు.

వ్రేలిమీదయుండు వెండుంగరముగాదు
వ్రేలిమీద నుండి నేలజూచు

---

ఆ పద్యాలు రెండూఇవి

10. ఆడబోవు చోట ఆయిండ్ల వారెల్ల
సారె సారె కొట్టి చంపిరనుచు
పుట్టినిల్లు జేరు పోలతి తా గాదయా
సమ్మెటాంక భీమ జాణరాయ

మ్రాను నందు పుట్టి మక్కువ కాయలై
యింటిలోన పెరిగి పండ్లు నవును
తీపు రసములేదు తినరాదు చెప్పుమా
సమ్మెటాంక భీమ జాణరాయ

11 బ్రౌను దొరగారు 1839 ప్రతిలోనే 'దీని భావమేమి తెలుపు వేమ' అనే నాలుగో పాదంలో ఒక పద్యం ఉంది. పుట్ట 41 పద్యం 275 అకాడిమీ ప్రతిలో 'వృక్షాగ్రవాసి నచ పక్షిరాజా' అనే పొడుపు కథకు నాసిరకం అనువాదం నాలుగు పాదాలలో హ్రోస్వ మకుటంతో ఒకటి ఉంది (పుట 91)

అంబరమున తిరుగు నది యేమిచోద్యమో
విశ్వధాభిరామ వినుర వేమ

(చాటుపద్య మణిమంజరి– 1 పుట 157)

దీని భావం ఏ తిరుమలేశుడో చెప్పాలనిపించవచ్చు వేటూరివారు విడుపు ఏమిటో చెప్పలేదుగాని బహుశా డేగ కావచ్చు ఈపద్యం ముద్రిత ప్రతులలో ఎక్కడా నాకు కనబడలేదు ఏతాళపత్ర గ్రంథంలో వుందో పరిశోధించాలి

కొన్ని ముద్రిత ప్రతులలో ఉన్న ఈ పద్యం వినండి

విత్తమొకరికిచ్చి వితరణగుణమున
చిత్తమొకరికిచ్చి చెరచినాడు
బ్రహ్మచేతలన్ని పాడైన చేతలు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర – 3498)

ఈ పద్యం బ్రౌను దొరగారి 1839 ప్రతిలో లేదు ఇది వేరొకరి చాటువు కావచ్చును లోభిని గూర్చి తిటు పద్యాలనేకం ఉన్నాయని అందులో ఒకటి రావూరు దొరసామిశర్మగారు ఉదహరించారు[12] వినండి .

విత్త మొకనికిచ్చి వితరణభరణంపు
చిత్త మొకనికిచ్చి చెరచినాడు
బ్రహ్మ యాలిత్రాడు బండిరేవున ద్రెంచ
రెండు నొకనికీక బండు చేసె

ఇది ఎవరు చెప్పిందో తెలియదు బ్రహ్మయాలిత్రాడు బండిరేవున తెంపడం వేమన గారికీ ఇష్టమే అయితే అది వేరే సందర్భంలో చెప్పారు

ఆడువారిగన్న అర్ధంబు పొడగన్న
బమ్మకైన పుట్టు రిమ్మతెగులు
బ్రహ్మయాలి త్రాడు బండిరేవున ద్రెంప
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ రి 232)

---

[12] తెలుగులో తిట్టు కవిత్వము–పుట 68

బ్రౌను దొరగారి ప్రతిలో మొదటి పాదంలో పాఠభేదం లేదుగాని మిగతా రెండుపాదాలు వేరే విధంగా ఉన్నాయి

ఆడువారిగన్న నర్థంబు పొడగన్న
సారమైన రుచుల చవులుగన్న
నయ్యగాండ్లకైన నాశలు పుట్టవా?
విశ్వదాభిరామ వినురవేమ (బ్రౌను (1839)-420)

ఆడవాళ్ళను చూసినా, అర్థాన్ని చూసినా అప్పుడేకాదు ఇప్పుడూ, ఆ మాట కొస్తే ఎప్పుడూ ఆశలు తప్పవు ఈషణత్రయాలలో ధనేషణ ముఖ్యం ఒకడు పెట్టేవాడు ఇంకొకడు చేయిపట్టేవాడు అన్న సమాజంలో పెట్టగలిగీ పెట్టని వాడిని తిట్టడం సహజమే పామరుడు నోటికొచ్చినట్టు తిడతాడు పండితుడు పద్యం కట్టి తిడతాడు అదే తేడా వేమనగారి కాలంనాటికే

తోటకూరకైన దొగ్గలికైనను
తవుటి కుడుముకైన తవుటికైన
గావ్యములును జెప్ప గాండ్రాలు మనమైరి

(వే సూ ర 1986)

ఇలాంటి వాళ్లు ఇస్తే దాతను ఆకాశానికి ఎత్తెయ్యడానికి ఇవ్వకపోతే పాతాళంలో పాతెయ్యడానికి పద్యాల్లోనే ప్రయత్నిస్తారు కవి చౌడప్ప 'ఈవిగలవాడె దేవుడు' అన్నాడు 'ఇయ్యా ఇప్పించంగల అయ్యలకే గాని మీాస మన్యులకేలా?' అని అడిగాడు 'అతిలుబ్ధు వేడబోయిన' ఎలా ఉంటుందో చెప్పాడు వేమనగారు కూడ లోభులమీద చాలా పద్యాలు చెప్పారు ఈ పద్యం వినండి

దాతకానివాని తరచుగా వేడిన
వాడు దాతయగునె వసుధలోన
అవురు దర్భయౌనె యబ్ధిలో ముంచిన
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 74 పద్యం 78)

ఈ ప్రతిలోని పద్యాన్నే ప్రమాణంగా చూపెడుతూ 'అవురు' అంటె జొరుగడ్డి అనీ అర్థాన్ని సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఇచ్చారు (బ్రౌణ్యం

అనుబంధంలో అవురు – జౌరుగడ్డి, గడ్డి అనే మాటలున్న ప్రయోగాలు కనబడతాయి) అయితే ఇటువంటిదే ఒకచాటువు కూడా ప్రచారంలో ఉంది వినండి

దాతగానివాని దాతని వేడిన
దాతయౌనెవాడు ధాత్రిలోన
ఆతుగొంచ బోయి యబ్ధిలో ముంచిన
దర్భయౌనె యజ్ఞ తంత్రములకు

ఈ చాటువును దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తమ చాటుపద్య రత్నాకరంలో ఉదహరించారు (పుట 275) ఈ పద్యాన్ని ముందుగా వేమనగారు చెప్పారో, చాటుకవి చెప్పాడో తేల్చడం కష్టం ఇన్ని ఉదాహరణలు గమనించాక కొన్ని చాటుపద్యాలు వేమనగారి పద్యాలుగా చెలామణి అవుతున్నాయని గట్టిగా నమ్మవచ్చు అందుచేత ముద్రిత ప్రతులలో కనబడే చారిత్రక వ్యక్తుల పెర్లను బట్టి వేమనగారి కాలనిర్ణయం చేయాలనిపూనుకుంటే మార్గాలన్నీ అయోమయంగానే ఉండక తప్పదు వేమనగారి కాలనిర్ణయానికి వేరేమార్గాలు అన్వేషించాలి

తారీఖులూ, దస్తావేజులూ చరిత్రకు పరమార్థం కాకపోవచ్చు గాని చరిత్రక్రమాన్ని తెలుసుకొనడానికి అర్థం చేసుకొనడానికి అవి తోడ్పడతాయి పాశ్చాత్యులు మనదేశంగురించి మన ఆచార వ్యవహారాల గురించి మనకవుల గురించి వ్రాసిన గ్రంథాలలో కొన్ని తారీఖులు కనబడతాయి కొన్ని కాలనిర్ణయ సూచనలు కనబడతాయి విదేశీయులకూ, ముఖ్యంగా ఇంగ్లీషు వారికి అబేదుబాయ్ రచించిన 'హిందువుల ఆచారాలు' అనే గ్రంథం వల్లనే వేమనగారి గురించి కొద్దిగానైనా మొదట తెలిసింది ఈ ఫరాసు పాదిరీ 1792 నుండి 1823 దాకా దక్షిణ భారతంలో ముఖ్యంగా కర్నాటకంలో మతబోధ చెశాడు తెలుగు తమిళ కన్నడ భాషలూ సంస్కృత జ్ఞానం బాగా వచ్చినవాడు ఈయనను ప్రజలు 'దొడ్డస్వామయవారు' అని పిల్చేవారు 'హిందువుల ఆచారాలు' అనే గ్రంథాన్ని దుబాయ్ పాదిరీ 1806 నాటికి పూర్తి చేశాడు ఫ్రెంచి భాషలో ఉన్న ఈ పుస్తకాన్ని తూర్పు ఇండియా కంపెనీ వాళ్ళు కొని ఆంగ్లంలోకి అనువదింప చేశారు 1806లో తన గ్రంథాన్ని వ్రాస్తూ దుబాయ్ పాదిరీ వెమనగారు 'గడిచిన నూట యాభై సంవత్సరాల మధ్య' ఉండేవారని నిర్ధారణమైనట్టు వ్రాశాడు అంటే క్రీ శ 1656 ప్రాంతాలలో వేమనగారు జీవించారని ఈ పాదిరీ చేసిన కాలనిర్ణయం ఇది వినికిడి వల్ల చెప్పిన మాట కనుక ఊహాగానం

కావచ్చని కొందరైనా సందేహించవచ్చు అయితే ఈ కాలనిర్ణయం వాస్త వానికి దరిదాపుల్లోనే ఉందని సులభంగా నిరూపించవచ్చు

అబేదుబాయ్ పరాసు పాదరీ, కేతలిక్కు వాస్తవానికి తెలుగుదేశంలో ఫ్రాంసు దేశపు జెసూటు పాదరీలు క్రైస్తవ మతప్రచారం ప్రారంభిం చారు 'సొసైటీ ఆఫ్ జీసస్' అనే సంస్థకు చెందిన ప్రబోధకులను జెసూట్లు అంటారు పోర్చుగీసు జెసూట్లు భారతదేశంలో ప్రచారం చేసిన మొదటి క్రైస్తవ ప్రబోధకులు జెసూట్లు తాము రోమాపురి బ్రాహ్మణులమని చెప్పు కొనేవారు 1610 లో మధురలో మిషను స్థాపించిన రాబర్టు డి' నోబిలీ తత్వబోధస్వామి అనే పేరుపెట్టుకొని తెలుగు, తమిళ, సంస్కృత భాషలలో ప్రావీణ్యం సంపాదించి గ్రంథాలు వ్రాశాడు ఇతర జెసూట్లకు ఆదర్శ ప్రాయుడయ్యాడు ఫ్రాంసు దేశపు జెసూట్లు ఈయననే అనుసరించారు

సయాం దేశంలో మతప్రచారం చేద్దామనుకొన్న పరాసు పాదిరీలు ఆ దేశంలోని విప్లవ పరిస్థితుల మూలంగా 1689లో పుదుచ్చేరి వచ్చారు కర్ణాటకం మిషను స్థాపించారు మాడ్వీట్ పాదిరి, లేనెజ్ పాదిరి, చెంజి మండలంలో ప్రచారం మొదలుపెట్టారు తర్వాత మాడ్విట్ పాదిరితో డిలాపాంటైన్ అనే పాదిరి కలిశాడు ఈ ఇద్దరే తెలుగు గడ్డ మీద క్రైస్త వాన్ని పాదుకొల్పారు డిలాపాంటైన్ పాదిరి జ్ఞానబోధస్వాములవారు అనే పేరు పెట్టుకొన్నాడు 1701 నాటికి చిత్తూరుజిల్లా పుంగనూరులో చర్చి కట్టారు 1707 నాటికి శిరాసుబాలోని చిన్నబళ్ళపురంలో చర్చిని నిర్మిం చారు 1718లో అనంతపురంజిల్లా ధర్మవరంతాలూకా కృష్ణాపురంలో చర్చిని స్థాపించారు

కృష్ణాపురంలో లీ–గాక్ పాదిరి సంజీవనాథస్వామి అనే పేరు పెట్టు కొని ప్రచారం చేశాడు మదిగుబ్బలోని తుమ్మావారు మోతుబర్లయిన రెడ్లు వీరు 1715లో క్రైస్తవంలో చేరారు సంజీవనాథస్వామి 1733 దాకా తెలుగు ప్రాంతాలలో ఉన్నాడు 1737లో పుదుచ్చేరిలో మిషన్ అధిపతి అయ్యాడు ఆమరుసటి సంవత్సరం కృష్ణాపురం తిరిగివచ్చి అక్కడె అరవై ఏడు సంవత్సరాల వయస్సులో మరణించాడు

ఫ్రాంసు దేశపు రాజుగారి గ్రంథాలయానికి ప్రాచ్యదేశపు పుస్త కాలు కావాలని గ్రంథాలయాధికారి ప్రెంచి - తూర్పు ఇండియా కంపెనీ ఏజంట్లకు తాఖీదు పంపాడు దానిని పుదుచ్చేరి ఏజంటు జెసూట్లందరికీ తెలియపరిచాడు సంజీవనాథస్వామి కూడా ఈసంగతి తెలుసుకుని కృష్ణా

పురంలో తాను సేకరించిన తెలుగు గ్రంథాలను కొన్ని ఫ్రాన్సు దేశం పంపించాడు ఈ గ్రంథాలలో వేమన పద్యాలు, రుక్మాంగద చరిత్ర, విక్రమార్కుని కథలు (బొమ్మ-రాజు సింహాసనం కథలు)కూడా ఉన్నాయి ఒక ఫ్రెంచి తెలుగు నిఘంటువు, సంస్కృతాంధ్ర నిఘంటువు కూడా లీగాక్ పాదిరి పారిస్ నగరానికి పంపించాడు ఈ గ్రంథాలను ఈయన 1730 అక్టోబరులో రవాణా చేశాడు 1731 జూలైలో ఫ్రాన్సుదేశం చేరుకొన్నాయి [13]

సంజీవనాథస్వామి 1730 నాటికే వేమన పద్యాల ప్రతిని సేకరించాడు కాబట్టి వేమనగారు అప్పటికే సుప్రసిద్ధులు అని చెప్పవచ్చు 1780కి ఎంతటిపూర్వులో నిర్ణయించడానికి మరికొంత పరిశోధన అవసరం ఫ్రెంచి రాజుగారి గ్రంథాలయాధికారి జెనూటు పాదరీలకు ఒక ఆశక్తికరమైన సూచన చేసాడు భారతదేశంలో మతాంతరులైన హిందువుల దగ్గర తాళపత్ర గ్రంథాలు తప్పక ఉంటాయి మతం మారిన తర్వాత ఆపుస్తకాలు వాళ్ళచేతుల్లో ఉండడం ఎందుకు ? అందుచేత వాటిని పుచ్చుకొని ఫ్రాన్సు దేశం పంపమన్నాడు సంజీవనాథస్వామి తుమ్మావారి దగ్గర ఇతర గ్రంథాలతోపాటు వేమన పద్యాల ప్రతిని కూడా సేకరించడానికి అస్కారాలు ఉన్నాయి తుమ్మావారు 1715లో క్రైస్తవులయ్యారు వేమన పద్యాలను అంతకుముందే గ్రంథస్థం చేశారేమో!

తుమ్మావారికి వేమనగారిమీద చాలా భక్తి ఉండి ఉండాలి ఈ వంశంలోనివారు సంజీవనాథస్వామి ఇచ్చిన ఒక వచన గ్రంథాన్ని పింగళి ఎల్లన్న అనే బ్రాహ్మణ కవిచేత పద్యకావ్యంగా చెప్పించారు దీనిపేరు సర్వేశ్వర మహాత్మ్యం లేక తోభ్య చరిత్ర ఈ గ్రంథంలో ఎల్లన్న ఇతర కవులతోపాటు వేమనగారిని నుతించాడు వేమనగారిని పూర్తి పేరు పెట్టి కీర్తించిన తెలుగు కావ్యాలలో ఇదే మొదటిది మిగతవాటిలో 'వేము' అనే పొడిమాటే కనబడుతుంది పింగళి ఎల్లన్న వీరశైవుడు కాబట్టి వేమనగారిని తనంతట తాను నుతించినా నుతించవచ్చు లేక తుమ్మావారి ప్రీతికోసం చేసినా చేయవచ్చు

పింగళి ఎల్లన్న కాలాన్ని 1590-1620గా కవుల చరిత్ర చెప్తున్నట్టు డాక్టర్ గోపీ తన గ్రంథంలో పేర్కొన్నాడు [14] వీరేశలింగంగారు కవి

---

13 జర్నల్ ఆఫ్ బొంబె హిస్టారికల్ సొసైటీ- 4 వ సంపుటి (1941) పుటలు 85-88 (87వ పుటలో వేమన పద్యాల పేరు 8వ నెంబరు గ్రంథంగా వుంది )

14 ప్రజాకవి వేమన - పుట 118

పదునేడవ శతాబ్ది మధ్యమునందున్నట్లేర్పడుచున్నది' అని రాశారు [15] అప్పటికి తెలుగు జిల్లాలలో క్రైస్తవమతమే లేదు పురం లేదు అంతఃపుర మన్నట్లు మతమే లేదు మత కావ్యం ఎలా పుడుతుంది ? తుమ్మావారు 1715లో క్రైస్తవులయినా 1752లో గుంటూరుజిల్లా ఫ్రెంచివారి వశమయ్యాక అక్కడకు వలసవెళ్లి కొండవీటికి దగ్గరలో ఉన్న భక్తవాడలో స్థిరపడ్డారు ఈ భక్తవాడనే నేడు తుమ్మవాడ అంటారు పింగళి ఎల్లన్న ఈ తోభ్య చరిత్రను 1760 తర్వాత ఎప్పుడో రచించి ఉంటాడు

పింగళి ఎల్లన్న వేమనగారిని విమలమతి అని కీర్తించడమే కాక కొన్ని ఆట వెలదులు కూడా కావ్యంలో వ్రాశాడు కథాకథన భాగంలోని పద్యాలు కనుక వాటిమీద పూర్తిగా వేమనగారి ప్రభావం కనబడదు కాని కథలోనే ముక్తకంలాగ కేటాయించ దగ్గ పద్యం ఒకటి వేమనగారి ధోరణిలో లేక పోలేదు వినండి

సుతుడె తోడునీడ చుట్టంబు చెలికాడు
సుతుడె యేడుకడయు సుతుడె ధనము
సుత విహీన మైన బ్రతుకేటి బ్రతుకది
జగములో నుండు జనులకెల్ల (తోభ్య 3—37)

ఈ మొట్టమొదటి క్రైస్తవ కావ్యాంలోనే కాక ద్వితీయ కావ్యంలో కూడా వేమనగారి ప్రభావం కనబడుతుంది మంగళగిరి ఆనందయ్య అనే ఒక బ్రాహ్మణ కవి 'వేదాంత రసాయనం' అనే క్రైస్తవకావ్యాన్ని రాశాడు ఇందులో వేమన గారిని పూర్వకవిగా నుతించలేదు గాని వారి ప్రసిద్ధ పద్యంలో భావాన్ని ఆటవెలదిలోనే అనుకరించాడు

'పదుగురాడు మాట పాటించిజూతురు
జగతినెంత చదువు చదివికొనిన
నొకని మాట రచ్చలకు రాదు గావున
సమయ సముచితోక్తి జరుపుమయ్య
(వేదాంత– 1—32)

ఇది 'పదుగురాడు మాట పాటియై ధరజెల్లు' అనే వేమనగారి ప్రసిద్ధ పద్యానికి ప్రతిధ్వని మంగళగిరి ఆనందయ్య ఈ గ్రంధాన్ని రచిం

---

[15] ఆంధ్ర కవుల చరిత్ర మూడవ భాగం - పుట 178

చిన కాలం బ్రౌనుదొరగారు 1720 అని స్పష్టంగా రాశారు [16] ఈ నిర్ణయంలో పొరపాటు ఉంది ఆనందయ్య కూడా తెలుగు క్రైస్తవులు గుంటూరు సీమకు వచ్చాకనే కావ్యం రాశాడు అంటే 1752 తర్వాతనే అని చెప్పాలి 1790లో మరణించిన ఒక వ్యక్తిని కావ్యంలో సజీవుడుగా కవి పేర్కొనడం వల్ల 'వేదాంత రసాయనం' అంతకుముందు ఒక పదేళ్ల కాలంలో రచించి ఉండవచ్చు

క్రైస్తవ మత ప్రబోధకులూ, క్రైస్తవ కావ్యకర్తలు తప్ప మరెవరూ వేమనగారిని పట్టించుకోనట్లు కనబడుతుంది ఆదిలో ఉత్సాహపూరితులై వేమనను కొనియాడి వారు హిందూ పండితులు కాక క్రైస్తవ విద్వాంసులు–అందులోనూ ప్రొటెస్టెంటులే! అని నార్లవారు రాశారట [17] "తెలుగు సాహిత్య చరిత్రకారుల్లో ప్రథములైన వీరేశలింగంగారూ, గురజాడ శ్రీరామమూర్తిగారు వేమన చరిత్ర రాయలేదు కావలిరామస్వామి తన ఆంగ్ల గ్రంథంలోనూ వేమనగారిని పేర్కొనలేదు [18] ఈ సంగతులను చెప్తూ నార్లగారు "ఇట్టిమూగకుట్ర– ఒక మహావ్యక్తి పేరైనను ఉచ్చరించక మరుగుపరిచిన మౌన కుతంత్రము ప్రపంచ భాషా చరిత్రలం దెచ్చటను కానము ఇది ఒక పెద్ద విస్మయము!" అని తప్పులెన్నారు

కవుల చరిత్రలో రాయక పోయినా వీరేశలింగంగారికి వేమనగారి పట్ల చిన్నచూపు లేదు ఇతర రచనలో కొన్ని పద్యాలను ఉదహరించారు [19] గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కంలో వేమనగారి ప్రసక్తి ప్రశస్తి విరివిగానే ప్రదర్శించారు [20] నిజానికి ఎ మాత్రము సంస్కారమున్న

---

16 ఒ లై డి 2210 లో గ్రంథాదిని దొరగారు ఇంగ్లీషులో రాశారు

17 Vemana through Western Eyes (Ed ) V R Narla నార్ల వారు సంకలనం చేసిన గ్రంథాన్ని మరుపూరు l కోదండరామరెడ్డి 'వేమన–పాశ్చాత్యులు' అనే పేరుతో అనువదించారు ఈ వ్యాసంలో రెడ్డిగారి అనువాద వాక్యాలనే ఉదహరిస్తున్నాను పుట 9.

18 అదే గ్రంథంలో పుట-7

19 కందుకూరి వీరేశలింగం డైరీలు - లేఖలు - సంకలనకర్త- అక్కిరాజు రమాపతి రావుగారి పద్యాన్ని ఉదహరించాను (పు 187) 1872వ సంవత్సరంలో వీరేశలింగంగారు 'తప్పులెన్నువారు తండోపతండంబు

20 చూ॥ గురజాడ సంస్మరణ సంచిక దక్షిణ ఢిల్లీ ఆంధ్రసంఘం గురజాడపై నోట్సు–ఆరుద్ర పుటలు 42-43

సాహితీపరుడైనా వేమనగారి వంటి ప్రథమశ్రేణి ప్రతిభావంతులను విస్మరించలేడు అందుకే 1897లోనే హెన్రీబ్యూచాంప్ కొన్ని దురభిప్రాయాలను ఖండించాడు దుబాయ్‌పాదిరీ పుస్తకానికి విపులానువాదం ప్రచురిస్తూ ఇలా అన్నాడు

"(వేమనగారివంటి) కవులను, బాగా చదువుకుని, సంస్కారము గలిగిన బ్రాహ్మణులు చాలామంది ఎక్కువగా గౌరవించి, ఆ రచనలను ఆసక్తితో చదువుతున్నారు ఇట్టి వారిని పురోహితవర్గమునకు ఆచార్య పీఠములకు సంబంధించినవారి నుండి వేరు చేయవలెను ఈ తెగవారి అభిప్రాయము మాత్రము యావ్రాతలను ఎవరుగాని చదువకుండా ఉండవలయుననుటయే [21]

హెన్రీ బ్యూ చాంప్ పందొమ్మిదవ శతాబ్దపు సహృదయుల గురించి ఈ మాటలు చెప్పారు వాస్తవానికి పద్దెనిమిదో శతాబ్దంలో కూడా సుప్రసిద్ధ కవులు వేమనగారిని గుర్తించారు అనుకరణ ఉత్తమ ప్రశంస కనుక వేమనగారిని చాలా ప్రముఖ కవులే అనుసరించారు, అనుకరించారు

వ్రాత వెంటగాని వరమీదు దైవంబు
సేత కొలదిగాని వ్రాతకాదు
వ్రాత కజుడు కర్త సేతకు దా కర్త
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను 1839-పుట 160–ప 205)

ఇది వేమన గారి సుప్రసిద్ధ పద్యం దీనిని కనుపర్తి అబ్బయ్య అనుకరించాడు ఉష కలలోకన్న చిన్నవాడెవడో తేల్చుకొనడానికి చిత్రలేఖ వివిధ రాకుమారుల చిత్ర పటాలు గీస్తుంది ఆ సందర్భంలో వేమనగారి పద్యాన్నే తీసుకొని చమత్కరిస్తూ అబ్బయ్య అనిరుద్ధ చరిత్రలో ఇలా పద్యంచెప్పాడు

"వ్రాతకజుడు గర్త సేతకు దా గర్త
యనుటకిది విరోధమైననేమి
సేత కజుడు కర్త వ్రాతకు దా గర్త
యంచు చిత్రలేఖ దనగవచ్చు (అనిరుద్ధ—2—98)

---

21 'వేమన - పాశ్చాత్యులు' - పుట 12లో ఈ అనువాదం ఉంది Hindu Manners (3rd Ed ) P 275

ఈపద్యాన్ని చూశాక అబ్బయ్య కాలానికే వేమనగారి పద్యం చాలా విపుల ప్రచారంలో ఉందని చెప్పవచ్చు కనుపర్తి అబ్బయ్య 1745 నాటికి అనిరుద్ధ చరిత్ర రాసి ఉంటాడని చరిత్రకారుల నిర్ణయం 22 ఒక్క అని రుద్ధ చరిత్రలోనే కాదు కవిరాజ మనోరంజనం అనే 'పురూరవ చరిత్ర'లో కూడా అబ్బయ్య వేమనగారి నడకని అక్కడక్కడ అనుసరించాడు

సుదతి వ్రతము చెడిన సుఖము దక్కగవలె
నన్నమాట దలచు కొన్నదేమొ?
కాపురంబు జేసె గలికి ముచ్చటదీర
మగని విడిచి తేరమగని యింట

(కవిరాజ-2-7)

కనుపర్తి అబ్బయ్య ప్రౌఢ కవులలో ప్రసిద్ధుడు కూచిమంచి జగ్గన్న ఇంకొకరకంగా ప్రసిద్ధుడు ఇతడు కూడా వేమనగారిని అనుసరించినవాడే వేశ్యలమీద వేమనగారు ఎన్నో పద్యాలు చెప్పారు వాటిలో బాగా ప్రచారంలో ఉన్నది వినండి

లంజె లంజెకాని లావెల్ల కొనియాడు
లంజె తల్లి వాని లజ్జ కడుగు
తల్లి గలుగు లంజె తగులుట దోషంబు
విశ్వధాభిరామ వినురవేమ.

(బ్రౌను (అకాడెమీ ప్రతి) 355)

ఈ పద్యంలోని భావాన్నే కూచిమంచి జగ్గన్న చంద్రరేఖా విలాపంలో ఇలా చెప్పాడు

పెల్లు కల్లలల్లి బొల్లి మాటలు జల్లి
మెల్ల మెల్ల నిల్లు గుల్ల జేయు
తల్లి గలుగు లంజె సల్లోలమతి జేరు
పల్లవులకు సౌఖ్యమిల్ల జగతి

(చంద్రరేఖ—2—30)

కూచిమంచి జగకవి కాలం కూడా కనుపర్తి అబ్బయ్య కాలానికి దగ్గర్లోనే ఉంది జగ్గన్న అన్నగారు కూచిమంచి తిమ్మయ్యగారు సుప్రసిద్ధులు కవిసార్వభౌమ బిరుదాంకితులు. లాక్షణికులు బహుకావ్యకర్తలు ఆయన 1715 నాటికే రుక్మిణీపరిణయం అనే కావ్యం మొదలుపెట్టారు

22 సమగ్ర ఆంధ్ర సాహిత్యం 12వ సంపుటం-పుట 196

1720 ప్రాంతాలలో రాజశేఖర విలాసం అనే కావ్యం చెప్పారు అందులో వేమన గారిని ఒకటి కాదు రెండు పద్యాలలో అనుకరించారు 'కామిగాక మోక్ష గామిగాడు' అన్న పద్యపాదం వేమనగారి పద్యాలలో బాగా ప్రాచుర్యం పొందింది దీనిని కూచిమంచి తిమ్మయ్యగారు ఎలాగ వాడు కొన్నదీ చూడండి

కోరి యాచార్యు భామిని గూడినట్టి
కైరవాప్తుడు మిక్కిలి కామిగాడె
కామి గాకున్న యట్టి యస్ఖలితుడెవడు ?
కామిగాడేని నిర్వాణ కామి యగునె ?

(రాజశేఖర – 3-110)

ఈ పద్యం ఆటవెలదిలో కాక తేటగీతిలో చెప్పడం గమనించదగ్గ విషయం అయినే కూచిమంచి తిమ్మయ్యగారు ఆటవెలదిలోకూడా వేమనగారి భావాలను అనుకరించకపోలేదు రాజశేఖర విలాసంలోనే ఈ పద్యం వినండి

ధనము గల్గియుండ ధర్మంబు సేయక
యెన్ననదియు బరులకొరదవుగాదె
తేటులెల్ల గూడి తేనియ గూర్చిన
నొరుల కబ్బినట్లు లెరుగు కొనిన

(రాజశేఖర - 1-87)

ఇందులోని భావాలేకాక కొన్ని మాటలు కూడా వేమనగారి పద్యం లోనివే కావడం గమనార్హం

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెస్స దాచు గాక
తేనె నీగ కూర్చి తెరువరి కీయదా
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 19 పద్యం 129)

వేమనగారి పద్యంలో పొదుపు ఉంటుంది అదే భావాన్ని ఇతరులు నాలుగు పాదాలోనికి సాగదీయాలి కూచిమంచితిమ్మయ్యగారు అదే చేశారు

ఏది ఏమైనా 1720 నాటికే రాజశేఖర చరిత్ర రచించిన కూచిమంచి తిమ్మయ్యగారి కాలానికి వేమనగారి పద్యాలు చాలా ప్రచారంలో ఉన్నాయంటే 1730లో సంజీవనాథస్వామి (లీగాక్ పాదిరి) పారిస్ నగరానికి వేమనపద్య సంకలనాన్ని పంపగలగడంలో విడ్డూరమేమీ ఉండదు వేమనగారు క్రీ శ 1700 నాటికే సుప్రసిద్ధులని నిరూపించడం ఇలాగ జరిగింది గాని ఆయన కచ్చితంగా ఏఏ సంవత్సరాలలో జీవించారో పరిశోధించాలి ఇదికూడా కొంతశ్రమపడితేసాధ్యమే మరికొన్ని ఆకారాలను పరిశీలించుదాం

వేమనగారి పద్యాలు ఎంత బహుళ ప్రచారం పొందాయో, వారి చిత్రపటం కూడా ఒకటి అంత ప్రాచుర్యం పొందింది తంజావూరు రాచనగరంలో ఉండే ఒక తైలవర్ణ చిత్రం నుండి ఫోటోలూ రేఖాచిత్రాలు రూపొంది వేమనగారి జీవితచరిత్రలలో, పద్య సంకనాలలో ప్రచురితమయ్యాయి తంజావూరు రాచనగరులోని చిత్రాన్ని కట్టమంచి రామలింగారెడ్డి గారు చూశారు నేను 1955లో 'సరస్వతీ మహాలు' మీద పరిశోధనా వ్యాసం రాయడానికి తంజావూరు వెళ్ళాను రాచనగరు అంతా చూశాను ఆ రాజవంశంలో అప్పటికి సజీవులుగా ఉన్నవారిని కలుసుకొన్నాను మహారాష్ట్రుల దర్బారు హాలులో ఉన్న 'ఏకోజీ–శాహజీ–శరభోజీ' రాజుల తైలవర్ణ చిత్రం (ఒక పెద్ద గోడంత సైజులో ఉన్నది) ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్టుగా ఇమ్మడి ఉంది శరభోజి తైలవర్ణ చిత్రంకూడా మరపురానిదే ఎటొచ్చీవేమనగారి చిత్రాన్ని చూచాయగా చూపినట్టు జ్ఞాపకం అంతకుముందే వావిళ్ళవారి ప్రతులలో ఆ చిత్రం ఫోటోని చూడడంచేత ఆ పటాన్ని రాచనగరులో చూసినప్పుడు అట్టే పట్టించుకొని ఉండను

తంజావూరులో ఉన్నది వేమనగారి చిత్రమేనా ? ఆ నగరానికీ వారికీ ఏమిటి సంబంధం ? వేమనగారు దక్షిణ ప్రాంతాలలో కూడా సంచారం చేసి శిష్యవర్గాన్ని చేర్చుకొన్నటు జనం చెప్పుకుంటారు తంజావూరు సరస్వతీ మహాలులో వేమన పద్యాల తాళపత్రప్రతులు నాలుగు ఉన్నాయి [23] నాగరలిపిలో కాగితాలమీద రాసిన ప్రతి ఇంకొకటి ఉంది [24]

నాగరలిపిలో రాసిన ప్రతి మహారాష్ట్ర రాజులకోసం తయారుచేసినదే కావచ్చు తాళపత్ర గ్రంథాలు తెలుగు లిపిలోనే రాశారు కన్నాకు మీద

23 తంజావూరు కేటలాగు ప్రథమ సంపుటిలో డి 411 నుండి డి 414 దాకా ఉన్న ప్రతులు

24 తం డి 415

కాదుగాని నాలుగు ప్రతుల కట్టలమీద ఒక చిన్నాకుపై' నళనామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమీ భానువారం' అనే తారీఖు కనబడుతుంది ఇది క్రీ శ 1676 మార్చి అయిదవ తేదికి సరిగ్గా సరిపోతుంది తాళపత్రాలు బాలా ప్రాచీనంగానే కనబడతాయి ఒకటి శిథిలమై పోతూంది క్రీ శ 1676 తంజావూరులో మహారాష్ట్ర రాజుల రాజ్యారంభ సంవత్సరం అప్పటికి వేమన గారు సుప్రసిద్ధులు కావచ్చును గాని ఆ తాళపత్రగ్రంధాలు ఆ సంవత్సరం లిఖించినవి కాకపోవచ్చును శతాబ్దం, మాసం, తిథి, వారం సరిగ్గా సరిపోతున్నా సంశయించడానికి వేరే కారణాలు ఉన్నాయి వాటిని తర్వాత విశదం చేస్తాను ప్రస్తుతం తంజావూరికీ వేమనగారికి ఉన్న సంబంధం ఏమిటో తేల్చుకోవాలి

మహారాష్ట్ర రాజులు గద్దె ఎక్కడానికి ముందు నాయక రాజుల అవసాన కాలంలో వీరవైష్ణవం రాజులకు అభిమతమైన మతం అయింది భోసల రాజులు రాగానే అద్వైతం దానితోపాటు ఇతర మతాలు తిరిగి తలఎత్తుకున్నాయి 1684 నుండి 1710 దాకా పాలించిన శాహజీకాలంలో భాసురానందనాధుడనే దీక్షపరమశివేంద్రసరస్వతులు, కృష్ణానందులు అద్వైతాన్ని ప్రబోధించారు 'మానస సంచరరే' వంటి కీర్తనలు రాసిన సదాశివబ్రహ్మేంద్రులవారు ఈ పరమశివేంద్ర సరస్వతుల శిష్యులే శ్రీధరవెంకటేశ దీక్షితులు, బోధేంద్రయతీ నామసిద్ధాంతాన్ని, భజన పద్ధతినీ ప్రవేశపెట్టారు తంజావూరు రాజ్యంలో ఆధ్యాత్మిక చింతన ఎక్కువైంది

శాహజీ కేవలం షణ్మతాలకూ, షడ్దర్శనాలకూ మాత్రమే ప్రోత్సాహం ఇవ్వలేదు గంగాధరవాజపేయి ఆధ్వర్యంలో 'అవైదిక దర్శన సంగ్రహం' అనే గ్రంధాన్ని సంకలనం చేయించాడు నాస్తిక దర్శనాలను కూడా అవగాహన చేసుకోవాలనే సహృదయత ఆ రాజ్యంలో ఉంది రామభద్ర దీక్షితులనూ మరో ఆరుగురునీ షడ్దర్శన సిద్ధాంత సంగ్రహం' సంకలనం చేయమని శాహజి నియమించాడు అప్పటికే తెలుగులో వేదాంత శతకాలు చెప్పిన దత్తాత్రేయ యోగి, పరమానంద తీర్థులు తంజావూరు రాజ్యంలోని మన్నారు గుడిలో ఉన్నవారే

ఇటువంటి వాతావరణంలో, యతులు, పరమహంసలు, యోగులు, చర్చలూ, సాధనా చేస్తున్న కాలంలో వేమనగారు తంజావూరు విచ్చేసి కొన్నాళ్లు అక్కడ ఉన్నా ఉండవచ్చు మహారాష్ట్ర రాజుల మాతృదేశం కొంకణం తంజావూరులోవారు కొంకణేశ్వరునికి ఆలయం కట్టారు భోసల రాజులలో ఆఖరివాడైన శివాజీ (1832-1855) తన 'అన్నపూర్ణా పరిణయం' అనే

నాటకంలో 'కొంకణేశ్వర అన్నపూర్ణల పూర్వోదంతము వారి పరిణయం' వర్ణించాడు[25] వేమనగారి కాలంలో మహారాష్ట్రాన్ని కొంకణమనే పిల్చేవారు కాబోలు వారు చెప్పిన రెండు పద్యాలలో కొంకణం ప్రసక్తి కనబడుతుంది.

మొరుగు రాజ్యమెల్ల మ్రొక్కఁ బోవును కొంత
రామనాథమేగి రట్టు పడును
వినని వింతలెల్ల వినును కొంకణమందు
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (అకాడెమీ ప్రతి) 819)

ఈ పద్యం మొదటి పాదంలోని మొదటి మాట 'మొరుగు' అనేది అసాధు పాఠం మొరకు రాజ్యం అని వేమనగారు ఉద్దేశించారేమో బ్రౌను దొరగారి 1839 ప్రతి పునర్ముద్రణ పీఠికలో ఈ పద్యాన్నే ఉటంకించి బంగోరె 'మొరసు రాజ్యం' అనే పాఠాన్ని ఇచ్చాడు మైసూరు రాష్ట్రంలోని కోలారు ప్రాంతాలను 'మొరసునాడు' అంటారు ఇది ఒక మండలంలోని నాడేగాని ప్రత్యేకంగా రాజ్యం కాకపోవచ్చు బ్రౌను దొరగారు ఈ పద్యాను వాదంలో 'పూల్సు' అనే మాట వాడారు కనుక సాధుపాఠం 'మొరకు'కావచ్చు. శాహజీ పరిపాలనా కాలంలో ఛత్రపతి శివాజి కుమారుడు రాజారాం చెంజి కోటలో ఉండేవాడు మొగలాయి సైన్యాలు చెంజిని 1691 నుండి 1697 దాకా ముట్టడించాయి రాజారాం సహాయార్థంశాహజీ సేనలను పంపించవలసిన తరుణంలోనే సేతుపతి తన రాజ్యాన్నిమధురనాయక రాజులు కల్లోలపరుస్తు న్నారని మొరపెట్టుకుంటూ సహాయంఅర్థించాడు శాహజీతనసేనలను చెంజికి పంపించకుండా రామనాథానికి పంపాడు అ సేనలు పగవాళ్ళను ఓడించి సేతుపతి రాజ్యాన్ని నిలబెట్టాయి[26] రామనాథానికి వెళ్లి రట్టు పడినవాళ్లు మధురనాయకరాజు 'మొరకు' అన్నదే వేమనగారి పాఠం అయితే ఈ చారి త్రక విషయాలు ఈ పద్యానికి నప్పుతాయి చెంజికోట మొగలాయి ముట్ట డిని తట్టుకొంది కొంకణంలో ఈ వార్త వింతగానే వినబడి ఉండవచ్చు

ఇది వేమనగారి పద్యమే అయితే ఆయన తంజావూరులో 1697 లోపున ఉండడానికి ఆస్కారం ఉంది వేద ప్రామాణ్యాన్ని యజ్ఞయాగా దులనూ, బ్రాహ్మణాధిక్యతనూ, విగ్రహారాధననూ, అంగీకరించకపోయినా

25 తంజావూరు స మ కేటలాగు ప్రథమ భాగం డి 499

26 శ్రీధర వెంకటేశుల శాహాజీ విలాసం పంచమస్సర్గ - 47-55 శ్లోకాలు షష్ఠ స్సర్గ 60 నుండి 73 దాకా ఉన్నశ్లోకాలు

వేమనగారు తత్త్వభోధన చేస్తూ సంసారయోగాన్ని పదేశించారు తంజావూరు రాచనగరంలో వారి పటం ఉండడానికి వారిప్రభావం భోసరాలజుల మీద ప్రగాఢంగా ఉండితీరాలి శాహజీ, శరభోజి తుళజాజీలు ముగ్గురూ సంస్కృతాంధ్ర మహారాష్ట్ర భాషలలో సాహిత్య రచనలు చేసినవాళ్లే శాహాజీ కాలంలో యక్షగానాలు, శృంగార పదాలు విరివిగా కవులు చెప్తున్నా ఈ రాజు మాత్రం వైరాగ్యనీతిపద్యాలు త్యాగేశ ముద్రతో విరచించాడు ఈపదాలలో వేమనగారి ప్రభావం ఏమైనా ఉందేమో చూడాలి

తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా
విశ్వధాభిరామ వినుర వేమ

(బ్రౌను (9381 పుట 12 పద్యం 74)

ఇది వేమనగారి సుప్రసిద్ధ పద్యం దీని ఛాయలు శాహాజీ ముఖారి రాగంలో చెప్పిన ఒక పద్యంలో ఉన్నాయి [27]

పుట్టినప్పుడే కీర్తి పుణ్యమార్జించే వాని
పుట్టుక సఫలము హోనే
అట్టు శాయనివాని పుట్టుక యాలనే
పుట్టలో చీమలు పుట్టలేదటమే

వేమనగారి పద్యంలోని చెదలు శాహాజీ పదంలో చీమలయ్యాయి తంజావూరు భోసలరాజులు చెప్పిన నీతి వైరాగ్య పదాల మీద కొద్దిగానైనా పరిశోధనలు ప్రారంభంకాలేదు సరస్వతీ మహలు గ్రంథాలయంలోని తెలుగు పండితులు ఎన్ విశ్వనాధంగారి సంపాదకత్వంలో శాహాజీ మరాటీలో చెప్పిన త్యాగేశ పదాల సంకలనం ఇటీవల నాగర లిపిలో వెలువడింది ఈ మరాటీపదాలను తెలుగు లిపిలోనే మొదట రాశారు శాహాజీ చెప్పిన తెలుగు పదాలను కొన్నింటిని విశ్వనాధంగారు నోటుచేసుకున్నారు కాంబోదిరాగంలో చెప్పిన 'చదివితేనే జ్ఞాని ఆయనా?' అనే పదం డి 443 ప్రతిలోనిదే ఇది కాకర్ల త్యాగరాజస్వామి వారి రచనగా పరిశోధకులు పొరపడ్డారు [28]

---

27 తం మ స కేటలాగు ప్రథమ సంపుటి డి 344

28 'ప్రజాకవి వేమన' - డాక్టర్ ఎన్ గోపి పుట 402

ఆంధ్ర ప్రభుత్వంవారి సీరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్ వారు 'శృంగార పదములు' (పాటలు – పద్యములు) ప్రాచీన అజ్ఞాన కవికృతము అనే గ్రంథం ఒకటి 1972లో ప్రచురించారు నిజానికి ఇవి అజ్ఞాన కవికృతాలు కావు ఇవి తుళజాజీ కొడుకు ఏకోజీ చెప్పిన పదాలు పెదతండ్రులు శాహజి, శరభోజీలమీద తండ్రి తుక్కోజీ మీద ఏకోజీ చాలా శృంగార పదాలు చెప్పాడు నీతి పదాలు కూడా చెప్పాడు భోసల రాజులలో తుళజాజికి ఆధ్యాత్మిక విద్య మీద చాలా ఆసక్తి ఉంది అందులో కృషి చేసాడు శృంగార పదాలలో కూడా 'ఘనకీర్తి శాలివాడు, ఘనయోగశాలివాడు' అని ఏకోజి నాయికచేత చెప్పించాడు [29] మరో పదంలో 'ఘనశివభక్తుడవు ఘనయోగశీలివీవు' అని నాయిక చెప్తుంది [30]

ఏకోజి చెప్పినట్లె తుళజాజీ యోగశీలి ఈ రాజు 'రాజరంపన విద్యా విలాసం' 'శివకామసుందరీ పరిణయం' అనే రెండు యక్షగాన నాట్య ప్రబంధాలు రాశాడు ఈ రెండింటిలో ఇతివృత్తాలు ఆధ్యాత్మికాలే రాజం రంజన విద్యావిలాసంలో వేమనగారి సంసారయోగాన్నే తుళజాజి ప్రశ సించి ప్రబోధించాడు ఈ నాటకంలో జీవుడు 'ఈ తనువు నీటి బుగ్గ' అంటే పరమేశ్వరుడు 'తనువు ముఖ్యసాధనము మోక్షమునకు జీవరాజ !' అని చెప్తాడు వేమనగారు దేహవాదులు ఆ భావాల ప్రభావం ఇక్కడ కనబడుతుంది జీవుడు 'సంసారము మరి నిస్సారమెంచి చూడ దేవదేవ', అంటే పరమేశ్వరుడు 'సారము సుమ్మి సంసారమిన్నింటిలోన జీవరాజ' ! అని ప్రబోధిస్తాడు [31]

ముక్తి

నిమ్మన్నలేదు నీకీ యాశ్రమమున
నెమ్మి గృహస్థులై నిఖిల ధర్మములు
సాధించి యా మీద సత్సంగమాది
సాధనంబుల ముక్తి సాదింతువు

(రాజరంజన – పుటలు 28 - 29)

---

29 శృంగార పదములు - పుట23

30 అందులోనే – పుట 7

31 రాజరంజన విద్యా విలాస నాటకం తుళజాజీ రచన తంజావూరు సరస్వ మహల్ ప్రచురణ పుట 31

అని జీవరాజుకు మోహనయోగి మొదటే చెప్తాడు

వేమనగారు తమ పద్యాలలో సంసారయోగాన్ని చాలా పద్యాలలో ఘనంగా చాటారు

వెతల తీర్చువాడు వేదాంతవేద్యుడు
రతుల నేలువాడు రసికుడౌను
సతిని పెనగు వాడు సంసార యోగిరా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3593)

మ్రానులోన నగ్ని మదియుండగావచ్చు
నగ్నినుండ మ్రాను కలవికాదు
మ్రానులోని యగ్ని మర్యాద సంసారి
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 34 ప 226)

రద్దిమాని మనసు రాపాడి ధ్వని జూసి
ముద్దుగులుకు నాత్మ మూలమంది
సద్దు సేయకున్న సంసారయోగియే
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3280)

వేమనగారు ఇలాగ సంసార యోగాన్ని ప్రశస్తయోగంగా ప్రబోధించడం వల్లనే తుళజాజీ రాజరంజన విద్యావిలాసంలో గృహస్థాశ్రమాన్ని పాటిస్తూనే మోక్షం సంపాదించవచ్చని కచ్చితంగా చెప్పాడు

సకల ధర్మంబులు సకల కామ్యములు
సకల పుణ్యములు మోక్షము వీలుగాన
నార్జింతు రీ గృహస్థాశ్రంబునను
వర్జించి పాపాది వర్గంబు నెపుడు

(రాజరంజన–పుట 33

మోక్షం బ్రహ్మజ్ఞానం వల్లనే వస్తుంది వేమనగారు ఇలా చెప్పారు:

బ్రహ్మమనగవేరె పరదేశమునలేదు
బ్రహ్మమనగ తానె బట్టబయలు
తన్నుదా నెరిగిన తానెపో బ్రహ్మంబు
విశ్వధాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 47 పద్యం 313)

తుళజాజి కూడా సరిగ్గా ఈ మాటనే రాజరంజన విద్యావిలాసంలో 'దండిగా తాను తెలియ తానెపో బ్రహ్మ' మన్నాడు [32]

తుళజాజి క్రీ శ 1729 నుండి 1792 దాకా తంజావూరును పాలించాడు తెలుగు దేశంలో కూచిమంచి తిమ్మయ్యగారి మీదా వారి తమ్ముడు జగ్గన్నమీదా వేమనగారి ప్రభావం కనిపించినది కూడా ఈ కాలమే దక్షిణ భారతంలో వివిధ ప్రాంతాలలో సరిసమానంగా ఏక కాలంలోనే వేమనగారి కీర్తి వ్యాపించి ఉంటుంది చాటుపద్యాలు చెప్పేవారి కవిత వారి జీవిత కాలంలోనే త్వరిత ప్రచారం పొందుతుంది క్షేత్రయ్య పదాలు అలాగే ప్రసిద్ధమయ్యాయి క్షేత్రయ్యలాగే వేమనగారు కూడా రాయలసీమలో జన్మించి అక్కడ పెరిగి పెద్దవారైనా, తమ జీవితం కాలంలో కొంతకాలం తంజావూరు రాజ్యంలో ఉన్నారని నిస్సందేహంగా చెప్పవచ్చు

క్షేత్రయ్య తంజావూరు రాజ్యంలో పదాలు చెప్పాక ఆయన్ని అనుసరిస్తూ ఎందరో పదాలు చెప్పారు వేమనగారిని అనుసరిస్తూ ఇతర కవులు పద్యాలు చెప్పారా లేదా అని పరిశోధించాలి నాయక రాజుల కాలంలోనూ భోసల రాజుల కాలంలోనూ యక్షగాన రచనలే ఎక్కువగా జరిగాయి యక్షగానాలలో ద్విపదలు, కందాలు, విరివిగా ఉంటాయి గాని ఇతర ఛందాలు చాలా అరుదు అయినా వేమనగారి ప్రభావం వల్లనే బోసలరాజుల కాలంలోని యక్షగానాలలో ఆటవెలదులు ప్రవేశించాయి బాలకవి సుబ్బన్న 'పంచకన్యా పరిణయం'లో చల్లా సూరయ్య 'వివేక విజయం'లో అక్కయ్య 'భీమసేన విజయం'లోనూ శ్రీకృష్ణ లీలావిలాసంలోనూ ఆటవెలదులు కొన్ని చెప్పారు మాతృభూతయ్య 'పారిజాతాపహరణం'లో ఒక ఆటవెలది చెప్పాడు. ఈ యక్షగానాలన్నీ అచ్చుపడ్డాయి ఆంధ్ర విశ్వ[illegible]వారు కొన్ని సంపుటాలలో ప్రచురించారు

---

32 రాజరంజన విద్యావిలాస నాటకం–పుట 33

భోసల రాజుల కాలంనాటి సుప్రసిద్ధ ప్రబంధకవులు వెలిదండ్ల వెంకటపతి, ముద్దుపళని మొదలైనవారు వెంకటపతి 'రాధామాధవ సంవాదం' రచించాడు (ఇతని కొడుకు వీణా అయ్యన్న దీక్షితుడు అద్వైత జ్ఞానవేత్త 'వ్యాస తాత్పర్య నిర్ణయం' అనే గ్రంథం రాశాడు నామసిద్ధాంతం, భజన పద్ధతులను ప్రచారం చేసిన శ్రీధరవెంకటేశుల శిష్యుడు శాహజీ కాలంలో ప్రముఖుడు) వెలిదండ్ల వెంకటపతి రాధామాధవ సంవాదంలో ఆరు ఆటవెలదులు రాశాడు నడకలో, విరుపులలో ఇవి వేమన గారి బాణిలోనే ఉన్నాయి [33] ఈ కవి 1700 ప్రాంతాలవాడు ఇంకొంచెం ముందువాడు కావచ్చు

భోసలరాజులలో ప్రతాపసింహుడుకూడా ప్రసిద్ధుడే ఇతడు 1739 నుండి 1763 దాకా తంజావూరు పాలించాడు ఇతని ఆదరణలోనే ముద్దుపళని ఉండేది ఈమె 'రాధికా సాంత్వనం' అనే కావ్యంలో 14 ఆటవెలదులు రాసింది బాణీ వేమనగారిదే

> సొమ్ము నియ్యవచ్చు సమ్మంద మియవచ్చు
> నియ్యరాని ప్రాణ మియ్యవచ్చు
> దనదు విభుని వేరు తరుణి చేతికినిచ్చి
> తాళవశమె యెట్టి దానికైన'
>
> (రాధికా సాంత్యనం 1 - 74)

ఈ కావ్యంలోని మిగతా ఆటవెలది పద్యాలు కూడా ఇంతసాఫీగా నడుస్తాయి వేమనగారి ఆటవెలదులు తెలుగు సాహిత్యంలో ప్రవేశించాక ఏ కవి చెప్పినవైనా ఆ విరుపులు, ఆ సొంపులూ సంతరించుకోక తప్పదు

తంజావూరు సీమలో ప్రబంధ యక్షగాన కవులేకాక, పదకవులు కూడా వేమనగారి ప్రయోగాలను అనుకరించారు 1860 ప్రాంతాలలో ప్రసిద్ధి పొందిన మూవనల్లూరు సభాపతయ్య కాంభోజిరాగంలో చెప్పిన "అన్యాయముగ 'నే నపదూరు పాలైతి" అన్న పదం రెండవ చరణంలో

> సూటిగాను వానిజూచి నవ్వే యలవాటు చేసినందుకా
> ఏటికే యీ గేలి ఏ పాప మెరుగనే తాటికిందపాలు తగిన చందాన

---

34 రాధామాధవ సంవాదంలోని ప్రథమాశ్వాసంలోని 19, 41 90 నెంబరు పద్యాలూ ద్వితీయాశ్వాసంలోని 51, 26, 92 నెంబరు పద్యాలు ఆటవెలదులు

అనే ప్రయోగం వేమనగారికి ఫక్తు అనుకరణే [25అ]

ఇప్పటిదాకా చూసిన సాక్ష్యాలవల్ల వేమనగారి కాలనిర్ణయం సుఖాసుఖాల తేలిపోయినట్టే లెక్క. క్రీశ 1650 నుండి 1700 దాకా వారు దేశంలో సంచారం చేసి ఉంటారు ఈ విషయంలో నాకుగాని ఈ రుజువులు గమనించిన మీకుగాని ఈషణ్మాత్రం అనుమానం సైతం లేక పోవచ్చును, అయితే వేమనగారిమీద పరిశోధనలు చేసి పట్టాపొందిన విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉన్నవారు వేరే ప్రతిపాదనలు చేస్తే వాటిని పరిశీలించక తప్పదు ఇటీవల బాలసరస్వతి బుక్ డిపోవారు 'వేమన పద్య రత్నాకరము' అనే సంకలనం ప్రచురించారు (1976) ఇందులో 2504 పద్యాలున్నాయి వీటికి బులుసు వెంకటరమణయ్యగారు తాత్పర్యకర్త డాక్టరు గంధం అప్పారావుగారు పీఠిక వ్రాశారు అందులో వేమనగారి గురించి కవిచౌడప్ప చెప్పిన పద్యంగా ఒకటి ఉదహరించారు

వానను దడియని వారును
పూనక వేమన్న చేత బొరయనివారున్
నానా దిక్కులు వెదికిన
గానమురా నెంతవాని కవిచౌడప్పా

ఈ పద్యం ఇప్పటిదాకా ఏ పరిశోధకుడి కంటా పడలేదు దీనిని చూసి ఉంటే పరిశోధకులకు శ్రమ తప్పేది కవిచౌడప్ప కాలం అందరికీ తెలిసినదే మట్ల అనంతరాజుగారి మీద తంజావూరు రఘునాయకుడి మీదా చౌడప్ప పద్యాలు చెప్పాడు మట్ల అనంతరాజు కొలువులోనే చౌడప్ప ఉండేవాడు ఈరాజు 1598 1600 సంవత్సరాల మధ్య కకుత్స్థ విజయం అనే కావ్యం వ్రాశాడు [34] కవి చౌడప్ప అప్పటివాడే అవు తాడు ఇతడు పొగిడినందువల్ల వేమనగారు ఏ 1550 ప్రాంతాలవారో అవుతారు

గందం అప్పారావుగారు ఈ చౌడప్ప పద్యాన్ని ఏ తాళపత్ర ప్రతిలో చూశారో, అది ఎక్కడ ఉందో, దాని నెంబరేమిటో అందులోని

---

25 అ ఈ పదాన్ని బాలాంత్రపు రజనీకాంతరావుగారు తమ 'ఆంధ్ర వాగ్గేయ కార చరిత్రము' లో సొంతం ఉదహరించారు (పుటలు 363 364 సభాపతయ్య బహుశా ఇంకొంచం ప్రాచీనుడు కావచ్చు 1680 ప్రాంతం వాడేమో

34 సమగ్ర ఆంధ్ర సాహిత్యం – తొమ్మిదో సంపుటం పుట 150

పద్య సంఖ్య ఏమిటో మొదలైన వివరాలేం చెప్పలేదు ఇటువంటి రుజువులూ, సాక్ష్యాలూ చూపించడం సాహిత్య పరిశోధక మర్యాద డాక్టరు గంధం అప్పారావుగారు ఉదాహరించారు కనుక దీనిని పూర్తిగా కొట్టిపారెయ్యడానికి లేదని నా దగ్గరున్న కవి చౌడప్ప శతకాల వివిధ ముద్రిత ప్రతులుగాలించాను ఎక్కడా ఈ గంధంవారు పేర్కొన్న కందం నాకు కనబడలేదు.

నా నీతి వినని వానిని
భానుని కిరణములు మీద బారని వానిన్
వానమ దడియని వానిని
గానురా కుందవరపు కవి చౌడప్పా

(రెంటాలవారి శతకరత్నావళి పుట 398 పద్యం 24)

చౌడప్ప తన స్వంత కీర్తిని పొగుడుకున్నాడేగాని వేమనగారిని ప్రస్తుతించలేదు గంధం అప్పారావుగారికి ఈ పద్యం ఎక్కడ దొరికింది ? బ్రౌను ప్రతులను గాలిస్తే ఈ పద్యం లభించింది వినండి

వానను దడియని వారును
పూమక వేమన్న సేత బొరయనివారు
న్నానా దిక్కుల వెతకిన
గానము వానెంతగాని గానము వేమా

(బ్రౌను (1839) పుట 98, పద్యం 215)

ఈ పద్యంలో 'గానము వేమా' అనే మాటల బదులు 'కవి చౌడప్ప' అనే మకుటాన్ని గంధం అప్పారావుగారు ఇచ్చిన పద్యంలో ఎవరో తగిలించారు వేమన సూక్తి రత్నాకరంలో ఈ పద్యం కొంచెం పాఠభేదాలతో ఇలా ఉంది

వానను దడియని వారును
బూనిక వేమన్న బోధ బొరయని వారున్
నానా దిక్కుల వెదికిన
గానబడగలేరు తెలియగదరా వేమా

(వే సూ ర 3460

బందరువారి పాఠాన్నే తీసుకొని నేదునూరు గంగాధరంగారు తమ 'వేమన పద్యములు' అనే సంకలనంలో పొందుపరిచారు[35] అందులో ఈ పద్య సంఖ్య 4322 'కవి చౌడప్పా, వేమన ఒక త్రాటిమీద నడిచిన వారే' అని పద్యంకింద నేదునూరి వారు ఒకచిన్న వ్యాఖ్యానం చేశారు ఈ వ్యాఖ్యానం పొరపాటుకు దారి తీసిందా ?

బ్రౌను దొరగారి కాలంనుంచి ఇటీవల పరిశోధకులదాకా ఎవరికీ లభించని కవి చౌడప్ప పద్యం గంధంవారికి ఎలా దొరికిందో తెలియదు కనుక, వారు చెప్పలేదు కనుక ఇది ఇంకా సాగదీయకుండా ఈ కాలనిర్ణయ సమస్యను 'కుప్పుస్వామియ్యర్ మేడ్ డిఫికల్టు' చేసుకోవక్కరలేదు[36]

తంజావూరులో ఉన్న తాళపత్ర ప్రతులమీద ఉన్న తారీఖు విషయంలో ఇంతకుముందు కొంత అనుమానం వెలిబుచ్చాను దానికి కారణాలు తర్వాత చర్చిస్తానని కూడా చెప్పాను. ఆ ప్రతుల కట్టలమీద ఒక చిన్నాకు మీద ఇలా కొన్ని వాక్యాలు ఉన్నాయి.

"నళనామ సంవత్సరం చైత్రశుద్ధ ౧ భానువారం మధ్యస్తులు సేవా దురంధర శ్రీరామయ్య వరహప్పయ్య దీక్షితుల వారి అధికారమందు వేమన పద్యములు తెలుగు లిపి ఆకులు 23 అపూర్తి రుజు"

(ఎం 406 - డి 411)

"నళనామ సంవత్సరం చైత్రశుద్ధ ౧ భానువారం మధ్యస్తులు సేవా దురంధరరాజు శ్రీరామయ్య వరహప్పయ్య దీక్షితులవారి ఆజ్ఞ ప్రకారం నానా చిల్లర పద్యాలు 106 అపూర్తి" (ఎం 457 – డి 407)

ఇందులో ఇచ్చిన శాకాబ్ద మాస తిథివారాలు 1676 మార్చి అయిదో తేదీకి సరిపోయినా అప్పుడు వరహప్పయ్య దీక్షితులు అనే వ్యక్తి ఉన్నాడని

---

[35] 'వేమన పద్యములు' సంకలనం - నేదునూరి గంగాధరం - ప్రకాశకులు - అద్దేపల్లి అండ్‌కో - రాజమహేంద్రవరం

[36] టేకుమళ్ల కామేశ్వరరావు వ్రాసిన 'పూర్వాంధ్రకవులు' మొదటిభాగం (క్రీ శ 630 - 945) అనే గ్రంథంలో 38వ పుటలో ఈ పద్యం ఉంది డాక్టర్ అప్పారావుగారు తమ సిద్ధాంత గ్రంథం 'వేమన – సర్వజ్ఞులు తులనాత్మక పరిశీలన' అనే దానిలో 'టేకుమళ్లవారి 'రిఫరెన్సు' ఇచ్చారు - టేకుమళ్లవారి ప్రకారం వేమనగారి కాలం – క్రీ శ 800 ! ! !

చెప్పలేం బోసల రాజులలో కడపటి వాడైన శివాజికాలంలో వరహప్పయ్య ఉన్నాడు

'గాన విద్యలలోన ఘనుడైనవాడు
సేనాదురంధర శ్రీగల్గువాడు
వరయోగశాలియూ వరహేంద్రఘనుడు
పరిపూర్ణ విద్యల ప్రబలినవాడు
యిటువంటి మిత్రులు యిరువంక గొలువ
పటువుగా విలసిల్లు భాగ్యముస్వాంగ
శ్రీ శివాజేంద్రుండు చెలగు సద్విభుడు

(తంజావూరు డి 499)

ఈ ద్విపద పంక్తులు శివాజీ రచించిన 'అన్నపూర్ణా పరిణయం' లోనివి వరహేంద్రుడికి సేనాదురంధర అనే బిరుదు ఈ ద్విపద పాఠాలలోను చిన్నాకుమీద కనబడే వ్రాతలోనూ సమానంగా ఉంది చిన్నాకు మీద చెప్పిన నళనామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి భానువారం 1676 మార్చి అయిదవ తేదికేకాక 1856వ సంవత్సరం ఏప్రిల్ ఆరోతేదీ ఆది వారానికి కూడా సరిగా సరిపోతుంది ఎటొచ్చీ ఇది తంజావూరులో మహారాష్ట్ర రాజ్యం అంతరించిన మరుసటి సంవత్సరం 1855 దాకానే శివాజీ పాలించాడు

డి 414 ప్రతిపైన ఉన్న చిన్నాకులో చివర 'రుజు' అనే ఒక మాట ఉంది డి 407 ప్రతిపైన చిన్నాకులో ఈ మాటలేదు అంటే డి 411 ప్రతినే ఇంకొకదానితో తైపారు చేసి పాఠాల వివరం, పద్యసంఖ్యా నిర్ణయించారన్నమాట డి 407 ప్రతికి అటువంటిదేం జరగలేదు (ఇందులో గజేంద్రమోక్షం, వెంకటేశ శతకం కూడా ఉన్నాయి) వరహప్పయ్య కాలంలో గ్రంథాలయంలోని పుస్తకాల జాబితా ఇంకొకసారి తయారయిందనే ఈ చిన్నాకు తెలియచేస్తోందనుకోవాలి శరభోజి కాలంలో 1807లో ఒక 'జాప్తా పరిష్కారంబున కలుగజేసినట్టు దాఖలాలు ఉన్నాయి [37]

"శరభోజి మహారాజువారికి పట్టమయ్యేందుకు మునుపు ఈ సరస్వతి మహల్ పుస్తకాలకు వివరమైన జాప్తాలేదు 1720 కాళయుక్తి సంవత్సర

[37] ఈయాదస్తు Dr Brunell No Palm leaf Ms I 15024, 15461 అనే పుస్తకంలో ఉందని సరస్వతీ మహలు తెలుగు పండితులు శ్రీ విశ్వనాథంగారు చెప్పారు

శరభోజి మహారాజువారి పట్టమయ్యే మన్యంభట్లు యనే గంగాధరభట్టు సదా శివభట్లకు దానాధికారం ఇచ్చినపిమ్మట ఈ సరస్వతీ మహల్ కాగితాల పుస్త కాలు, తాట్యాకుల పుస్తకాలును తగుమైన వార్లనె నియమించి పెరీనీలును జాప్తారాసి శాలివాహన శక సంవత్సరము 1722 ఇంగ్లీషు సంవత్సరములు 1801లో జాప్తా పరిష్కారముగా గలుగజేసినది రౌద్రినామ సంవత్సరము ”

సరస్వతీ మహలులో ఉన్న తాళపత్ర గ్రంథాల లేఖన కాలం తెలి యక పోయినా బ్రౌనుదొరగారు సేకరించిన వాటిలో డి 1733 అనే ప్రతి చాలా ప్రాచీన ప్రతి అని డాక్టర్ గోపి గుర్తించారు [38] అయితే కేటలాగులో ఇచ్చిన తిథికీ గోపి నోటు చేసుకున్న తిథికీ తేడాఉంది డాక్టర్ గోపి తాళ పత్ర ప్రతిని చూసి కేటలాగులోని తిథిని దిద్దుకొన్నారేమో ప్రజోత్పత్తి సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమీ శుక్రవారమే డి 1733 లిఖించిన తేది అయితే అది 1691 ఏప్రిల్ 24 కాకపోవచ్చు నేను చూసినంతమట్టుకూ డి 1742 నెంబరు ప్రతి చాలా ప్రాచీనం వ్యయ ఆశ్వయుజ శుద్ధ నవమి ఆదివారానికి సరైన 12-10 1766 ఆ ప్రతి లేఖన కాలం

తంజావూరు వ్రాతప్రతుల తారీఖు చర్చ కేవలం పరిశోధనా కుతూ హలం కోసమే కాదు కాల నిర్ణయ సమస్యను పరిష్కరించడానికి అవసరం ఏది ఏమైనా 1730 నాటికే జెసూటు పాదిరీలు పారిస్ నగరానికి వేమనగారి పద్యసంకలనం పంపారు కాబట్టి వేమనగారు అప్పటికి ముందువారు 1691 – 1697 సంవత్సరాల మధ్య జరిగిన మొగలాయీల చెంచి ముట్టడికాలంలో రామనాథపురం కల్లోలాన్ని ఒక పద్యంలో వేమనగారు సూచించారు కనుక ఆయన ఆ కాలంలోనివారే అప్పటికి వారి వయస్సు ఎంతయి ఉంటుందన్న ప్రశ్న తేల్చడానికి కొంత పరిశోధన అవసరం ఈ విశేషం ప్రస్తుతానికి సశేషం

---

38 ‘ప్రజాకవి వేమన’ పుట 69

# కాలనిర్ణయంలో సశేషాలూ విశేషాలూ

మొదటి వ్యాసంలో వేమనగారి కాలాన్ని ఒక రకంగా తేల్చాను గానీ పూర్వపరిశోధకుల వాదనలన్నీంటినీ కూలంకషంగా చర్చించి, వాటి లోని లోపాలనుగానీ, సుగుణాలనుకానీ సమీక్షించడం సందేహాలకు ఆస్కారం లేకుండా పాతసిద్ధాంతాలను పూర్వపక్షం చేయడం అవసరం అసందిగ్ధంగా ఒక కవికాలాన్ని నిర్ణయిస్తేనే తప్ప సాహిత్యచరిత్రలో అతని స్థానం, ప్రభావాల పూర్వాపరాలూ తేల్చడానికి వీలులేదు

వేమనగారి మీద ప్రత్యేకంగా ఒక పుస్తకమే 1922 లో రచించిన వారు శ్రీవంగూరు సుబ్బారావుగారు "వేమన (సంపూర్ణ జీవితచరిత్రము బోధనలు)" అన్న వీరిగ్రంథమే వేమనగారిపై వచ్చిన పరిశోధనా వాఙ్మయంలో ప్రప్రథమగ్రంథం దీని తృతీయ ముద్రణ 1951లో వెలువడింది వంగూరివారు తమ శతకకవుల చరిత్రలో వేమనగారు క్రీశ 1412లో పుట్టి 1480 లో సిద్ధి పొందారని తేల్చారు (పుట 108)

వంగూరివారి లెక్క ప్రకారం వేమనగారు శ్రీకృష్ణ దేవరాయల వారికి పూర్వులై ఉండాలి ఎందుకంటే ఎడపాటి ఎర్రన్న అనేకవి మల్హణ చరిత్ర అనే మూడాశ్వాసాల కావ్యాన్నిరాశాడు పూర్వకవులలో వేమనగారిని కూడా చేర్చి స్తుతించాడు ఈకృతిని ఎర్రన్న చుండికాళయ్య అనే కరణానికి అంకితం ఇచ్చాడు మల్హణ చరిత్రను కృష్ణరాయ జనకాంతునికీయక కాళయ్యకు ఇచ్చినట్టు ఎర్రన్న కృత్యాదిని చెప్పాడు (1-19) వంగూరివారు ఈ కృష్ణరాయ జనకాంతుడు సుప్రసిద్ధులైన శ్రీకృష్ణదేవరాయ వారే అని భావించినందువల్ల వేమనగారు అంతకుముందు వారనే నిర్ణయానికి వచ్చారు ఎర్రన్న చేసిన పూర్వకవిస్తుతి పద్యం పాఠం ఇది

> వినుతు లొనర్తునాంధ్ర కవి ప్రభు నన్నయభట్టు తిక్కయ
> జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన, నాచనాసోము, సర్వదే
> వుని, భవదూరు, వేమనల పోతన బిల్లలమర్రి వీరభ
> ద్రుని, శరభాంకు, వీరకవి, దూర్జటి భట్టబాణునిన్

(మలహణ చరిత్ర 1-19)

ఈ పద్యంలోని ధూర్జటి సుప్రసిద్ధుడు ఇతడు రాయలవారి తర్వాత కాలంవాడు రాయలవారి రాజ్యాంత కాలానికిగానీ ధూర్జటీ, తెనాలి రామకృష్ణుడూ యువకవులై రాణించలేదు అష్టదిగ్గజాలలో ఉన్నారనుకొని భ్రమపడే ఈ ప్రసిద్ధులే కృష్ణదేవరాయల వారికి తమ గ్రంథాలను అంకితమిచ్చే అవకాశం లేదు మహాగజాలకే దిక్కులేకపోతే మరొక రకం వారికి రాయలవారి ప్రాపు చిక్కుతుందా ? ఎఱ్ఱన్న పేర్కొన్న 'కృష్ణరాయ జనకాంతుడు' రాయలవారు కాక మరొక రాజై వుంటాడని పరిశోధకులు భావిస్తున్నారు

ఆంధ్ర సాహిత్య చరిత్రలో నంధ్యాల కృష్ణంరాజు కవిపోషకుడు ఈయన అరవీటి వంశంలోనివాడు రాయలవారి అల్లుడైన అళియరామ రాయల బంధువు పింగళి సూరపరాజుగారి కళాపూర్ణోదయాన్ని అంకితం పుచ్చుకొన్నారు ఇది క్రీ శ 1558 ప్రాంతాల జరిగింది [1] ఎడపాటి ఎఱ్ఱన్న నంధ్యాల కృష్ణంరాజునే 'కృష్ణరాయ జనకాంతుడు' అని ఉద్దేశిస్తే కవి కాలం రాయలవారికి ఒక తరం అర్వాచీనం కావాలి

మల్హణ చరిత్రను బందరు శృంగార కావ్యమండలివారు 1940లో ముద్రించారు దీనికి చోడవరపు జానకిరామయ్యగారు పీఠికరాస్తూ ఈ కావ్యాన్ని అంకితం పుచ్చుకొన్న "చుండికాళుడు పదునారవ శతాబ్దానికి చెందినవాడు మాత్రముకాదు 17వ శతాబ్దమున నుండి యుండవచ్చును" అని రాశారు (పుటలు 12-13) ఈ ఊహను సమర్ధించే ఉపపత్తులు వారు చూపెట్టలేదు అయితే ఊహ కరక్టే! ఉపపత్తులు మనం సేకరించాలి

చుండి కాళయను పొగిడి తన కావ్యాన్ని అంకితమిస్తూ ఎఱ్ఱన్న చెప్పిన పద్యం ఇది

> ఇట్టి మహాప్రధాన పరమేశ్వరమూర్తివి గాన నీవు చే
> పట్టితి ! మేలు ! చుండి పురపాలక ! కాళన మంత్రిచంద్ర ! మున్
> గట్టిగ గృష్ణరాయ జనకాంతుని కీయక దాచినట్టి యా
> రట్టడియైన యెఱ్ఱకవిరాజిత మల్హణ కావ్య కన్యకన్
>
> (మల్హణ1-19)

ఈ పద్యంలో చాలా అనుమానాలకు ఆస్కారముంది ఎఱ్ఱకవికి 'రట్టడి' అనే విశేషణ ప్రాసస్థానంలో ఎందుకు వాడినట్టు ? రట్టడి పదం

1 సమగ్ర ఆంధ్ర సాహిత్యం – నవాబులయుగం – పుట 203

గ్రామాధికారనే అర్థంలోనే వాడినట్టా ? కావ్యకర్త ఎఱ్రన్న ఎడపాటి పురాధిపుడన్నది వాస్తవమే (మలహణ 1 16) అయితే రట్టడి పదానికి ముందు తచ్ఛబ్దార్థకమైన 'ఆ' అనే అక్షరాన్ని ఎందుకు వాడినట్టు ? కృష్ణరాయజన కాంతునికీయక దాచిన రట్టడి ఇంకొక ఎఱ్రన్నా ?

ప్రసిద్ధులైన పూర్వకవుల కావ్యాలను రెండుమూడుతరాలు పోయాక అతని సంతతివారుగానీ, తదితరులుగానీ, వేరొక పోషకునికి అంకిత మివ్వడంకొత్తగాదు తెనాలి రామకృష్ణుని ఘటికాచలక్షేత్ర మాహాత్మ్యాన్ని అతని మనుమడు తంజావూరులోని శ్రీమంతుడైన బండోజీకి అంకితం పేర విక్రయించాడు దర్భా వెంకటగిరి అనే కవి సదరు గ్రంధానికి అవతారిక రచించాడు[2] మల్హణ చరిత్ర విషయంలో కూడా ఇలాగేజరిగిందా? ఇది బావి పరిశోధనలవల్ల తేలాలి అయితేపైపద్యంలోని కృష్ణరాయ జనకాంతుకు డెవరై వుంటాడన్న విషయంపై ఇప్పటికే కొన్ని పరిశోధనలు జరిగాయి

"ఎడపాటి ఎఱ్రన్న చెప్పిన కృష్ణరాయలు శ్రీకృష్ణదేవరాయలు కాదు చుండి వేజళ్ళ, తెట్టు సంస్థానాదీశ్వరులలోని కృష్ణరాయలు ఈ వివరాలు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు 'కవి జీవితముల'లో వెన్నెల కంటి వెంకటాచలం కవియొక్క చరిత్రలో రాశారు" అంటూ పాతసంగతి నొకదాన్ని శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారు ఇటీవల జ్ఞాపకం చేశారు[3]

కవి జీవితాలలో గురజాడ శ్రీరామమూర్తిగారు విష్ణుపురాణాన్ని ఆంధ్రీకరించిన వెన్నలకంటి సూరన్నగారి మునిమనవడి యొక్క మునిమనవడని వెంకటాచలాన్ని గుర్తించారు గురజాడ వారిలెక్క ప్రకారం ఈ వెంకటాచలం క్రీ శ 1678 నుండి 1728 ప్రాంతాల మధ్య ఉన్నవాడు[4] ఇతడు కృష్ణవిలాసమనె కావ్యాన్ని చెప్పాడు ఇందులో సంస్థానాధీశ్వరులైన వేజళ్లవారి ప్రస్తావన ఉంది వేజెళ్ళ వారి వంశంలో ఇద్దరు కృష్ణమ రాజులు ఉన్నారు

వీళ్లలో మొదటి కృష్ణమరాజు క్రీ శ 1600 నుండి 1630 దాకా పాలించాడు ఇతని మనుమడు కృష్ణమరాజు క్రీ శ 1678 నుండి 1693 దాకా పాలించాడు[5]

---

2 సమగ్ర ఆంధ్ర సాహిత్యం -కడపటి రాజుల యుగం - పుట - 155

3 భారతి - జనవరి 1982 పుట 43

4 గురజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములు (5వముద్రణ) పుట 692.

5 చూ॥ ఆచార్య తూమాటి దొణప్పగారి 'ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణ' పుట 173

ఈ తెట్టు కృష్ణమరాజులలో ఏ ఒక్కరితోనైనా ఎడపాటి ఎర్రన్నకు సంబంధమున్నట్టు గురజాడవారు ఎక్కడా చెప్పలేదు నిడదవోలు సుందరేశ్వరరావుగారు మరే విధమైన సమాచారాన్నీ భారతి వ్యాసంలో ఎర్రన్న గురించి చెప్పలేదు ఇతర వ్యాసాలలో చెప్పినట్టయితే ఆ విషయాన్ని అధోజ్ఞాపికలో కూడా సూచించలేదు ఎర్రన్నకూ ఈ తెట్టు సంస్థానాధీశులకూ ఏదైనా బాదరాయణ సంబంధాన్ని మనమే ఊహించుకోవాలి

తెటు పక్షపు-లో మొదటి కృష్ణమరాజు రాజ్యానికి వచ్చినప్పుడు అతని ఈడు పదారు మూడు సంవత్సరాల ముక్కుపచ్చ లారని వయస్సు ఇతణ్ణి వెంట పెట్టుకొని ఇతని మంత్రి వరం కందుకూరులో లష్కరుతో పాటు ఉంటున్న ఫౌజుదారును దర్శించుకొంది అప్పుడా ఫౌజుదారు కృష్ణమరాజు బాలుడనే కారణం వల్ల గుడ్లూరు పరగణా మాత్రమే అతనికిచ్చి ఏడువందల వరహాలు పేష్కస్సు నిర్ణయించి తతిమ్మా పరగణాలు సర్కారులో దాఖలు చేసుకొన్నాడు తర్వాత కృష్ణమరాజు గుడ్లూరులో కోట కట్టుకొని నలభై రెండేళ్లు రాజ్యం చేశాడు [6]

ఎడపాటి ఎర్రన్న మల్హణ చరిత్ర రచనా కాలం బహుశా ఈ కృష్ణమరాజు రాజ్యారంభంగానీ లేక రాజ్యాంతకాలంగానీ అయివుంటుంది రాజు ముక్కుపచ్చ లారని వాడు కాబట్టి 'కృష్ణరాయ జనకాంతుని కీయక' తన కావ్యాన్ని దాచిపెట్టుకొనడానికి అస్కారముంది లేక రాజ్యాంతకాలం అయితే కృతి ఇద్దామని కావ్యం రాసి అనుమతి పుచ్చుకొని కృత్యాది పద్యాలు రాసేలోపున రాజు మరణించి వుంటాడు ఎడపాటి ఎర్రన్న రెండో కృష్ణమరాజు కాలంవాడైతే క్రీ శ 1678-1693 సంవత్సరాల వాడవుతాడు మల్హణ చరిత్ర కావ్యాన్ని కూలంకషంగా పరిశీలిస్తే రెండో కృష్ణంరాజు రాజ్యాంత కాలంవాడని నిరూపించవచ్చు

పూర్వకవి స్తుతిలో వేమనగారిని నుతించిన కావ్యకర్త మీద వేమనగారి ప్రభావంగాని ఆటవెలదుల మీద అభిమానంగాని ఉండి తీరుతుంది మల్హణ చరిత్ర ప్రథమాశ్వాసంలో మచ్చుకైనా ఒక్క ఆటవెలదీలేదు సీసపద్యాల ఎత్తుగీతిలోనైనా కనీసం ఒక్క ఆటవెలదీ ప్రథమా శ్వాసంలోలేదు ద్వితీయాశ్వాసంలో మాత్రం అయిదు ఆటవెలదులు విడిగానూ మూడుసీసాల ఎత్తు గీతి స్థానాలలోనూ కనబడతాయి తృతీయా శ్వాసంలో పదహారు ఆటవెలదులు ఉన్నాయి ఇవి వేమనగారి బాణీలోనే ఉన్నాయి మచ్చుకు రెండు చూడండి

---

6 గురజాడ కవి జీవితములు - పుట 689

సౌఖ్య మనుభవింప సంతతి పుణ్యంబు
బోవు మూలధనము పోయినట్టు
వరుస పుణ్య ధనము వర్ధిల్లునట్టుగా
నిత్యసౌఖ్య మంద నేర్చు టురవు

(మల్హణ 3-45

కన్ను విచ్చినపుడు కన్పింతు మనసున
కన్ను మూయ నెదుట కదలకుందు
పట్ట జిక్కు పడవు, ప్రాణేశ్వరీ యింత
యింద్రజాలవిద్య యెరిగి తెట్లు

(మల్హణ 3-97

ఎర్రన్నకు వేమనగారి మీదిభక్తి మూడో ఆశ్వాసం రాస్తున్నప్పుడు బాగా ముదిరింది అందుకే దాచినట్టి ఈ కావ్యానికి కృతిపతి దొరికాక, కృత్యాది పద్యాలు రాస్తూ పూర్వకవి స్తుతిలో వేమనగారిని నుతించాడు ఈ ప్రగాఢ భక్తికి కారణం ఇద్దరూ శైవులు కావడమే ఒకప్పుడు వేమనగారు వీర శైవాన్ని ఉద్ధోలంగా ప్రబోధించారు

పెదపాటి జగ్గన్న అనే సంకలన కర్త తన ప్రబంధ రత్నాకరంలో మల్హణచరిత్రలో తొలిరెండు ఆశ్వాసాలలోంచే మూడు పద్యాలను ఉద హరించాడు మూడో ఆశ్వాసం జోలికి పోలేదు కారణం బహుశా చాలా కాలందాకా మల్హణచరిత్ర రెండుశ్వాసాల దాచినట్టి కావ్యం కావచ్చు జగ్గన్న సంకలన గ్రంథం కూడా అసమగ్రం అయిదాశ్వాసాల కావ్యమని తెలిసినా మూడాశ్వాసాలు మాత్రమే దొరుకుతున్నాయి లభ్యమైన ఆకరాలను బట్టి సంకలనకర్త కాలం క్రీ శ 1580-90 అయివుంటుందని నేను పూర్వం నిర్ణయించాను [7] జగ్గన్న సంకలనంలోని మిగతా మూడు శ్వాసాలూ దొరికితే అతని కాలాన్ని మరో రెండు తరాలు అర్వాచీనం చేయవచ్చు ఇందుకు బోలెడన్ని సబువులు ఉన్నాయి

ఎర్రన్న ఒక్క మల్హణ చరిత్రనే కాదు 'కుమార నైషధం' అనే కావ్యాన్ని కూడా రచించాడు ఇందులోంచి ఒకటి కాదు రెండు కాదు పదిహేడు పద్యాలను పెదపాటి జగ్గన్న తన సంకలన గ్రంథం ప్రబంధ రత్నాకరంలో వాడుకొన్నాడు మల్హణచరిత్ర మూడు ఆశ్వాసాలకావ్యమైనా

---

7 సమగ్ర ఆంధ్ర సాహిత్యం-అరవీటిరాజుల యుగం పుట 49 92

తొలిరెండు ఆశ్వాసాలలోంచి మూడంటే మూడు పద్యాలనే స్వీకరించారు పెదపాటి జగ్గన్న తన సంకలనంలో మల్హణచరిత్ర కావ్యకర్తను పెద పాటి ఎఱ్ఱాప్రెగడ అని పేర్కొన్నాడు ఇందువల్ల సంకలనకర్త ఇంటి పేరూ, కావ్యకర్త ఇంటి పేరూ ఒకటే అనిపించవచ్చు, గానీ ఇది వాస్తవం కాదు జగ్గన్న ఇంటిపేరు రామాప్రెగడవారు ఎఱ్ఱన్న ఇంటిపేరు ఎడ పాటివారు ఈ 'ఎరపాటి' అనే ఇంటిపేరు కూడా తప్పని, దీనిలోని ద్వితీయాక్షరం రేఫ అనీ నెల్లూరు పరిశోధకులు విద్వాన్ నవులూరి మాలె కొండయ్యగారు సవరించారు[8] చుండీ, ఎరపాడూ దగ్గర దగ్గర గ్రామాలు కృతిభర్త చుండి కాళయ్య, కర్త ఎరపాటి ఎఱ్ఱన్నా బంధువులు తెట్టుప్రభువు కృష్ణమరాజుకు సమకాలికులు, సంకలకర్తకూడా బహుశా సమ కాలికుడే

'వేమనగారిని పూర్వకవులలో చేర్చి స్తుతించిన ఇంకొకకవి నిమ్మల లక్ష్మన్న ఇతడు కంచి ఏకామ్రలింగ శతకాన్ని చెప్పాడు దీని తాళపత్ర ప్రతి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వుంది (D 1481) శతకకవుల చరిత్రలో ఇతని గురించి రాస్తూ "ఈతడు 15, 16 శతాబ్దములవాడని వినబడుచున్నది సాక్ష్యము లేదు" అన్నారు వంగూరివారు చూడలేదో చూడదలుచుకోలేదోగానీ నిమ్మల లచ్చన్న చాలా అర్వాచీనుడని చెప్పడానికి అతని శతకంలోనే అంతస్సాక్ష్యం ఉంది వంగూరివారి 'శతక కవుల చరిత్రము' ద్వితీయ ముద్రణ అనుబంధంలో నిడదవోలు వెంకటరావుగారు దీన్ని చూపెట్టి లోకానికి చాటారు, (పుట 765) ఏకామ్రనాథ శతకంలో

> మొగలాయి దెబ్బలకె ముగిసె నీ కథ లెల్ల
> తగ పార్థు దెబ్బకు తాళితెట్లు ?

అనే ఎత్తిపొడుపు ఉంది అంచేత కవి 1680 ప్రాంతాలవాడని నిడదవోలు వారి అంచనా ఇది సబువే

1680 లో ఛత్రపతి శివాజీ మరణించాడు 1686 లో అక్కన్న మాదన్నల హత్య జరిగింది ఆ తర్వాతనే మొగలాయి దెబ్బలు తెలుగు దేశానికి కూడా తగిలాయి తిరుపతి, కంచి తీవ్రమైన దాడికి గురైనాయి అంచేత ఈ కవిని నేను సమగ్ర ఆంధ్రసాహిత్యం కడపటి రాజుల యుగంలో చేర్చాను (పుట 313) నిమ్మల లచ్చన్న పదిహేడో శతాబ్దపు చివరిరోజులలో వాడు కాబట్టి ఇతడు స్తుతించిన వేమనగారు మనవేమనగారే

---

8 విక్రమ సింహపురి మండల సర్వస్వంలో ప్రాచీనాంధ్రకవులు పుట 235

వేమనగారిని పూర్వకవిగా స్తుతించిన కవులలో 'అన్యవాద కోలాహలం' అనే సీసశతకాన్ని 'ఉపన్యసించిన' సోమేశ్వరాచార్యులు కూడా ఉన్నాడు ఈ శతకాన్ని ఏకామ్రలింగనాథుడు రచించాడని వావిళ్లవారు పొరబడ్డారు తాళపత్ర ప్రతులలో కర్త పేరు లేదు (D 1470, D 1471) మకుటంలో 'ఏకామ్రగురు చిత్త నలిన భృంగ! సోమనాథ లింగ!' అనే మాటలు ఉండడంవల్ల ఏకామ్రగురుడో, అతని శిష్యుడో గ్రంథకర్తలని ప్రాచ్య లిఖిత గ్రంథాలయ పండితులు భావించారు కర్త ఎవరైనా కావ్యం క్రీ శ 1750 కి పూర్వపుది కావచ్చునని వంగూరి సుబ్బారావుగారు శతక కవుల చరిత్రలో రాశారు (పుట 425) ఈ కవిని నేను సమగ్ర ఆంధ్ర సాహిత్యం కడపటిరాజుల యుగంలో చేర్చాను (పుట 314) ఇతడు వేమనగారి భావాలను చాలాచోట్ల అనుసరించాడు

ప్రాసుచుట్టు తిరుగ మంచిదని నుతింప
   గానుగ యెద్దేమి గనియె తిరిగి
స్నానము శుచి చేయునేని యే శుచియయ్యె
   నిత్యమ్ము గున్నంగి నీళ్ళ కాకి
తలబోడి యైనను తత్త్వజ్ఞ డేనియు
   తలబోడి పడుచు తత్త్వజ్ఞురాలె
సతి గూడమియె బ్రహ్మచర్యమేని శిఖండి
   సతిగూడ డన బ్రహ్మచారియగునె

యేమి చెప్ప భక్తిహీనవ్రతంబులు
బుగ్గిలోన నెయ్యి పోసినట్లు
యెన్న నేల యింక నేకామ్రగురు చిత్త
నలిన భృంగ! సోమనాథలింగ!

(అన్యవాద – పద్యం 33

ఈ సీస పద్యములోని రెండవపాదంలోని భావం వేమనగారి భావానికి అనుసరణే

నీళ్ళమునుగువాడు నిర్మలాత్ముడు కాడు
పూర్ణమైన ముక్తి బొందలేడు
నీరు కోడి యెపుడు నీళ్ళను మునగదా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2281

ఈ సీస పద్యంలోని 'తలబోడీ' పదం వేమనగారు చెప్పిన 'తలలు బోడులైన తలపులు బోడులా (వే సూ ర 3659) అన్న పాదంలోని మాట లకు ప్రతిధ్వని – 'తలలు బోడులైన' అన్న మాటలను వేమనగారు మరికొన్ని సార్లు కూడా వాడారు

వేమనగారిని పూర్వకవిగా నుతించిన ఎరపాటి ఎర్రన్న, నిమ్మల లక్ష్మన, సోమేశ్వరాచార్యులూ వేమనగారికి సమీపకాలంలోని అర్వాచీను లని అంత స్సాక్ష్యాలను బట్టి చూశాం అయితే సాక్ష్యాల జోలికి పోకుండా పూర్వ పరిశోధకులు బండారు తమ్మయ్యగారు, వారిని కోట్ చేస్తూ ఆధుని కుడు డాక్టర్ గోపి "ఈ వేమన మన వేమనకాడు" అని అభిప్రాయపడారు [9] ఈ ముగ్గురు కవులేకాక మరిద్దరకు (జంటకవులు) కూడ వేమనగారిని పూర్వకవిగా నుతించారు వాళ్ళు తురగారాజకవీ, అయ్యంకి బాల సరస్వతీ

ఈ జంట కవులు నాగరఖండాన్ని తెనిగించి పెందోటపురానికి అధి పతి అయిన ధవళేశ్వరం మార్కండేయుడనే శ్రీమంతునికి అంకితమిచ్చారు కృతిపతి "మహమ్మదు కుతుపశాహచంద్రునికి కుడిభుజ" మని కవులు పొగిడారు (నాగర ఖండం 1-18) 1580 నుంచి 1657 దాకా గోల్కొం డను పాలించిన కుతుబ్‌షానే కవులు పేర్కొన్నారని చాగంటి శేషయ్యగారు భావించారు [10] ఈ కుతుబ్‌షా రాజ్యానికి వచ్చినపుడు 15 సంవత్సరాల ప్రాయంవాడు 1617 నుండి 1626 దాకా సుల్తాన్ మహమ్మదుకుతుబ్‌షా అనే ఇంకొక పాలకుడు కూడా ఉన్నాడు ఇందులో ఎవరికి మార్కండే యుడు కుడిభుజం? ఎవరికీకాదు కుతుబ్‌షాకి కుడిభుజమైనవాడు పెందోటకు కరణంగా ఎందుకుంటాడు? "ఈ పద్యములో నత్యుక్తి విశేషంగా నున్నట్లు తోచుచున్నది" అని చాగంటి శేషయ్యగారే సంశయించారు [11]

గ్రంథాంతాన గద్య తర్వాత ఒక పద్యంలో గ్రంథ రచనా కాలాన్ని చెప్తున్న పద్యం ఒకటి శేషయ్యగారు ఉదహరించారు నేను చూసిన ఏప్రతి లోనూ ఈపద్యం లేదు ఇది ప్రక్షిప్తమది శేషయ్యగారి అనుమానం ఈ పద్యంలో "కుతుబ్‌షాహీ నిజాం' కుతలనాథు ప్రాభవవేళ" అనే మాట లున్నాయి ఇది కవులు రాసిన పద్యమే అయితే వాళ్ళు పదహారో శతాబ్దం వాళ్లుకాదు 18వ శతాబ్దంవారు కుతుబ్‌షాహీలకు నిజాం అనే బిరుదు ఉన్నట్లు

9 'ప్రజాకవి వేమన -' డాక్టర్ ఎన్ గోపి - పుటలు 117, 118

10 ఆంధ్రకవి తరంగణి - పదకొండవ సంపుటం - పుట 60

11 అదే గ్రంథంలో పుట 61

కనబడదు అసఫ్‌జా వంశంలోని వాళ్ళకి 'నిజాం' అన్న బిరుదు నికరంగా ఉంది ఈ వంశం వాళ్ళు 1713 తర్వాతనే రాజ్యానికి వచ్చారు

కుతుబ్‌షాహీ ప్రాభవవేళలో కాకపోయినా వేమనగారి ప్రాభవ వేళలో నాగరఖండ రచన ఆరంభమైనదని చెప్పవచ్చు నాగరఖండంలో అన్ని ఆటవెలదులూ ఏ పాదానికి కాపాదం విడిపోకపోయినా, యతిస్థానం ముందర పదం అంతకాకపోయినా చతుర్థాశ్వాసంలో వేమనగారి నడకను అనుసరించడం కనబడుతుంది

దివిజ విశ్వకర్మ దేవుండు స్థావర
జంగములకును జనకుడయ్యె
తాతయయ్యె సకల దైవత కోటికి
వెలయ పదిభుజముల విశ్వకర్మ

[నాగరఖండం - R 312 పుట 111

ఎరపాటి ఎఱ్ఱన్న తన మల్హణ చరిత్ర మూడో ఆశ్వాసం దగ్గర్నుంచీ వేమనగారి ప్రభావంలో పడ్డట్లు ఈ జంటకవులు తమ నాలుగో ఆశ్వాసం దగ్గర్నుంచీ వేమనగారిని తెలుసుకొని ఉండవచ్చు

క్రీ శ 1691 - 97 సంవత్సరాల మధ్య మధుర సైన్యాలు రామనాధ పురానికి వెళ్ళి రట్టు పడ్డ సంగతిని ఒక పద్యంలో చెప్పడం వల్ల వేమనగారు 1697 దాకా సజీవులని భావించడంలో తప్పులేదు ఇక వారెప్పుడు పుట్టారు ? ఎప్పుడు సిద్ధి పొందారన్న ప్రశ్నలు మిగిలి ఉన్నాయి

బ్రౌను దొరగారు తాము వ్రాసిపెట్టుకొన్న సంపుటాలలో వేమన గారు 1652లో జన్మించారనీ 1725లో సిద్ధిపొందారనీ నోటు చేశారు (మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంధాలయంలోని D - 1773 వేమన పద్యాలు 1వ భాగంలో మరణ కాలాన్నీ నాలుగో భాగంలో జననకాలాన్నీ రాసిపెట్టారు) జెసూటు పాదరీలు 1730 నాటికే వేమన పద్యాల సంకలనాన్ని పారిస్ నగరానికి పంపారు అంటే వేమనగారు సిద్ధి పొందిన తర్వాత అయిదేళ్ళకన్నమాట వేమనగారి జన్మ సంవత్సరాన్ని సూచిస్తున్నదని భావించే పద్య మొకటి ప్రచారంలో వుంది

నందన సంవత్సరమున
పొందుగ కార్తీక శుద్ధ పుష్యమినాడున్
వింధ్యాద్రి సేతుబంధన
సందున నొక వీరు డేలు బాటర!! వేమా!

ఈ కంద పద్యం బ్రౌను దొరగారు కాగితాల మీద రాయించిన సంకలనాలలో కనీసం మూడు ప్రతులలో కనబడుతుంది –(D-1725 - సంఖ్య 52, D 7123 - సంఖ్య 586, D 1779 - సంఖ్య 822)[12] ఈ పద్యాన్ని బ్రౌన్ దొరగారు క్రీ శ 1824లోనే గుర్తించి 'మై డిస్కవరీ ఆఫ్ వేమన' అనే శీర్షికతో నోట్సు రాసుకొన్నారు క్రీ శ 1652 నాటి నందన సంవత్సరం వేమనగారి జన్మ సంవత్సరమై ఉంటుందన్నీ నిర్ణయానికి వచ్చారు అయితే ఈ పద్యం పట్ల అంతగా నమ్మకం కుదరలేదో ఏమో దీనిని తను తొలి ముద్రణ (1829) ప్రతిలోగానీ మలి ముద్రణ (1839) ప్రతిలోగాని వారు చేర్చలేదు

ఈ పద్యంలో 'సందున' అనే పెళుసుమాట ఉన్నది కాబట్టి ఇది వేమనగారి పద్యంకాదని డాక్టర్ గోపి అంటున్నారు[13] మధ్యన అనే అర్థంలో సందున అనే పదాన్ని ప్రాచీనులు వాడడం పరిపాటే "నీనా సందొడబాటు మాట వినుమా ?" అని ధూర్జటి కాళహస్తీశ్వర శతకంలో ప్రయోగించాడు ఇప్పటి ముద్రిత ప్రతులలోనే కనీసం పదిసారులు 'సందున' అనే పద ప్రయోగాన్ని వేమనగారు చేసినట్లు చూడవచ్చు ఇది పెళుసు మాటకాదు అయినా ఇది వేమనగారి పద్యంకాదు ఆయన కాలంలోనే ఎవరో రాసి ఆయన పేరు పెట్టారేమో "ఇట్టి పద్యములు గూర్చి చర్చించి ఫలము లేదు" అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారన్నమాట మంచి సలహా

వేమనగారు ఎప్పుడు పుట్టారో వారి పద్యాలవల్ల తెలియకపోయినా ఎంతకాలం దాకా జీవించారో కొన్ని పద్యాలు చెప్తాయేమో చూడాలి జెసూట్ పాదిరీల సంకలనంలో కొన్ని దాఖలాలున్నాయి

బాల వృద్ధత్వంబు పరగంగ బొందిది
సప్త దశకంబుల సరణి సుమ్ము
జూచి వేదాంత మెరుగుడీ
విశ్వధాభిరామ వినురవేమ

పారిస్‌ప్రతి – నెం 299

ఈ పద్యంలో గణభంగాలున్నాయి దీనిని కింది విధంగా పరిష్కరించవచ్చు

12 ప్రజాకవి వేమన - డాక్టర్ ఎన్ గోపి - పుట 92

13. అందులోనే - పుట 122

బాల్య వార్ధకములు పరగంగ బొందిది
సప్త దశకమనెడు సరణిసుమ్ము
(వివర మెంచి) జూచి వేదాంతమెరుగడీ
విశ్వధాభిరామ వినురవేమ

ఈ పద్యం పారిస్ ప్రతిలోనేగాని బందరువారి వేమన సూక్తి రత్నాకరంలో లేదు నేదుమాటివారి సంకలనంలో కూడా లేదు ఈ పద్యంలో డెబ్బయి సంవత్సరాల పరిమితిని సూచించారు ఇంకో పద్యంలో పండు ముసలితనాన్ని చెప్పారు

అంగమెల్ల వొంగి అటుదంతములు వీడి
తనువు జరయుచేత తరచు వణికి
ముప్పు తిప్పలు బడ మోహంబు లూడవో
విశ్వధాభిరామ వినురవేమ

[పారిస్ ప్రతి - నెం 116.

నడుము వంగిపోయి, పళ్ళు ఊడిపోయి ఒళ్లు వణకుతున్న వార్ధక్యాన్ని ఈ పద్యం సూచిస్తోంది ఇందులో వేమనగారు స్వీయ ప్రాయాన్నే వర్ణించుకొన్నారా? ఆయన క్రీ శ 1697లో డెబ్బయ్యోఏట తంజావూరులో వుండి 'మొరకురాజ్యం' పద్యం చెప్పారనుకొంటే 1627 ప్రాంతాలలో జన్మించారని ఊహించవచ్చు వేమనగారు ఎప్పుడు కాలం చేశారో చెప్పలేము ఆయన పోయినా ఆయన పద్యాల భావాలూ, ప్రభావాలూ, శాశ్వతంగా ఇప్పటికీ ఉన్నాయి ఎప్పటికీ ఉంటాయి

ఏడు మతములాన యెవ్వడైనాగాని
మత మెరింగినట్టి మర్మి లేడు
మతము మూలమెరుగ మరణమే లేదయా
విశ్వధాభిరామ వినురవేమ [14]

[పారిస్ ప్రతి – నెం 316

---

14 క్రీ శ 1710 నాటి లేఖన పద్ధతి నుంచి ఊహించి నేను పరిష్కరించిన పద్యమిది పారిస్‌ప్రతి సాంతం జెరాక్సు నకళ్ళు గల నంకలాన్ని నాకు అప్యాయంగా ప్రెజంటుచేసిన చిరంజీవి డాక్టర్ ఎన్ గోపికి నాధాంక్సు

# భావాలు : ప్రభావాలు

ప్రపంచాన్ని ప్రజల కళ్ళకు కట్టేటట్టు చేయడమే కవితా లక్షణం. దీనికి భావనాశక్తి కావాలి అందులోనూ స్వతంత్ర భావనాశక్తి అవసరం ఈ సుగుణం తెలుగు కర్తలందరిలో ఒక్క వేమనగారిలోనే కొట్టవచ్చినట్టు కనబడుతుంది ఆయన తమ సమకాలిక జీవితాన్ని, సాంఘిక న్యాయాలను, మతాలను, అభిమతాలను – అంచెలంచెలుగా అయినప్పటికీ – సంపూర్ణంగా పరిశీలించారు సమగ్రమైన అవగాహన ఏర్పరుచుకొన్నారు తాము తెలుసుకొన్న సత్యాన్ని ప్రజలందరికీ ప్రబోధించారు

వేమనగారు గొప్ప తత్త్వవేత్తలే, ఆదర్శవంతమైన దార్శనికులే. విచారణ శక్తిగల విజ్ఞానులే అయితే తత్త్వవేత్తా, దార్శనికుడూ, విజ్ఞానీ సంఘజీవులే ఏ మానవుడికైనా సంఘంలో అతనికుండే ఉనికినిబట్టే అతని చైతన్యం ఉద్భవిస్తుంది గాని అతని చైతన్యాన్ని బట్టి ఉనికి ఉద్భవించదు చైతన్యవంతులైన దార్శనికులు ప్రపంచాన్ని వ్యాఖ్యానిస్తారు ప్రవక్తలు మాత్రమే ప్రపంచాన్ని మార్చడానికి ప్రయత్నిస్తారు కొంతవరకూ కృతకృత్యులవుతారు. వేమనగారు అభ్యుదయ ప్రవక్తలు

తమ దేశకాల పరిస్థితులవల్లా, తమ తనువులో పుట్టిన తత్త్వంవల్లా వేమనగారు ఎన్నో ఆచారాలు, వ్యవహారాలు, కర్మకాండలూ, ధర్మశాస్త్రాలు చూసి, కాచి వడపోసి, ఒక సిద్ధాంతానికి వచ్చారు దాన్ని సంసార యోగ మన్నారు అదే 'పనికట్టుకొని' ప్రచారం చేసారు ఇదుంటే స్వర్గం అక్కరలేదన్నారు

> "సుగుణవంతురాలు సుదతియై యుండిన
> బుద్ధి మంతులగుచు పుత్రులొప్ప
> స్వర్గ మేటికయ్య సంసారి కింకను
> విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3903)

భార్య అనుకూలవతి అయితే కొడుకులు గుణవంతులైతే ఇంటిని మించిన స్వర్గంలేదు

"పోల్కిజూచి తెలిసి పూర్వాపరంబులు
తడుపు గుడుపు నడుపు తత్త్వమెరిగి
నడువ నేర్చినట్టి నరుడు గృహస్థుడు
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను అకాడెమీ ప్రతి పుట 79 పద్యం 294)

సమాజ జీవనంలో చాలా సామ్యాలున్నాయి ఆ పోలికలను గుర్తించి సమన్వయం చేసుకొని జ్ఞానం యొక్క పూర్వాపరాలనూ, స్నానాదికాలైన శుచిశుభ్రతలూ, భోజనాదికాలైన ఆహార నియమాలనూ, ఆచార వ్యవహారాదికాలైన జీవనప్రవర్తనల తత్త్వాన్నీ తెలుసుకొని బతుకనేర్చినపుడే గృహస్థుడు

జాతి నీతి వేరు జన్మమ్ము లొకటి
అరయ తిళ్లు వేరె ఆకలొకటి
దర్శనములు వేరు దైవం బదొక్కటె
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1585

భూమిమీద మనుష్యులంతా ఒకలాగే పుడతారు జన్మలొక్కటే అయినా జనులు ఏ జాతిలో పుడితే ఆ జాతివారైపోతారు జాతికో రకం నీతి ఉంటుంది కూటి విషయంలో కులాచారాలు పాటించాలి అందరికీ ఆకలొకటే అయినా ఆహార పదార్థాలలో విభేదాలుంటాయి ఆచారాన్ని అతిక్రమించిన వాడికి కులం పోతుంది కులం పోతే కూడు పుట్టదు కొన్ని కొన్ని కులాలు కొన్ని మతాలను అనుసరిస్తాయి కొన్నిదైవాలనే పూజిస్తాయి మత ధర్మాలను, తత్త్వ రహస్యాలనూ దర్శనాలు బోధిస్తాయి హిందువుల లెక్క ప్రకారం ఆరు దర్శనాలున్నాయి ఇన్ని దర్శనాలున్నా దైవం ఒక్కటే జన్మలొక్కటే, ఆకలొక్కటే, దైవం ఒక్కటే అయినప్పుడు జనులంతా ఒక్కటిగా జీవించాలని వేమనగారి ఆకాంక్ష దీనికి ఆహారం అడ్డం రాకూడదు

"ఉర్వివారి కెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తుగుడిపి కులము పొలయ చేసి
తలను చేయిబెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 546)

లోకమంతా ఒకటే కుటుంబం లోకులంతా ఒక కుటుంబంలోని వ్యక్తులే ఎవ్వరూ పంక్తి బాహ్యులు కారు అందరూ ఒక్క కంచాన తింటే అన్ని అనర్ధాలకూ హేతువైన కులభేదం రూపుమాసిపోతుంది సఖ్యత ఉంటుంది సమానత్వం ఏర్పడుతుంది ఇది ఆరు దర్శనాలనుండీ, ఆరు మతాలనుండీ, అన్ని శాస్త్రాలనుండీ వేమనగారు పిండినసారం

మనకు ఆరు ఆస్తిక దర్శనాలూ, ఆరు నాస్తిక దర్శనాలూ ఉన్నాయి వేదప్రామాణ్యాన్ని ఆస్తికదర్శనాలు అంగీకరిస్తాయి నాస్తిక దర్శనాలు ఎంత మాత్రం ఒప్పుకోవు

| ఆస్తిక దర్శనాలు | | నాస్తిక దర్శనాలు | |
|---|---|---|---|
| 1 | న్యాయము | 1 | చార్వాకము |
| 2 | వైశేషికము | 2 | సౌత్రాంతికము |
| 3 | వేదాంతము | 3 | వైభాషికము |
| 4 | మీమాంస | 4 | యోగాచారము |
| 5 | సాంఖ్యము | 5 | మాధ్యమికము |
| 6 | యోగము | 6 | అర్హమతము |

ఆస్తిక దర్శనాలను అవలంబించి ఆరు మతాలు వర్ధిల్లాయి 1 శైవం 2 వైష్ణవం 3 శాక్తం 4 గాణాపత్యం 5 సౌరం 6 కాపాలికం అనే ఆరూ దేశంలో ఇప్పటికీ అంతో ఇంతో ప్రచారంలో ఉన్నవే నాస్తిక దర్శనాలను ఆరు పేర్లతో పిలిచినా నిజానికి అవి మూడే సౌత్రాంతికం, వైభాషికం, యోగాచారం, మాధ్యమికం అనేవి బౌద్ధమతంలోని విభేదాలు బౌద్ధాన్ని సౌగత్యం అనికూడా పిలుస్తారు అర్హమతమంటే జైనమన్నమాట నాస్తిక దర్శనాలలో చార్వాకం, బౌద్ధం, జైనం ఈ మూడే ఉన్నాయి వేమనగారు ఆస్తిక నాస్తిక దర్శనాలన్ని పరిశీలించారు ఈ పరిశీలనకు తగినంతా ఆయన చదువుకొన్నారా ?

కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రకారం వేమనగారికి పుస్తక జ్ఞానం ఇంచుమించు సున్న వ్యాకరణము, చందస్సు, అలంకార శాస్త్రము మొదలగు వానిలో నీతనికి శక్తి యెంత తక్కువో భక్తియు నంత తక్కువ[1] రాళ్ళ పల్లివారి అంచనాను బట్టి "వేమన సామాన్యముగ వ్రాత చదువులు చక్కగా

1 కవిత్వతత్త్వ విచారము - పుట 5

వచ్చువరకు కొన్నాళ్లు బడిపంతుల బెత్తపు దెబ్బలు తిని, తరువాత భారతము, రామాయణము, బసవపురాణము, శివపురాణము మొదలగు గ్రంథములు పలుమారులు తండ్రిగారికి చదివి వినిపించి యుండును పురాణములందలి కథలలో సామాన్యముగ నందరు నెరుగని కథల నీతడెరిగినట్లు అనేక పద్యములు తెల్పును"[2] వేమనగారిది శ్రుత పాండిత్యమని రాళ్లపల్లి వారు నమ్ముతారు "వేమన చిన్ననాటినుండి తమ యింటికి వచ్చిపోవుచుండు చదువరుల, కవుల సహవాసమున సంస్కారమును బొందినవాడు" అని శర్మగారు చెప్పారు[3] వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులవారు చెప్పిన మాటలు వేరు "వేమనకు వేదములయు, ఉపనిషత్తులవేయు జ్ఞానముగాని తుదకు సంస్కృత భాషా జ్ఞానముగాని లేదని కొందరు వచింతురు వేమన పద్యములలో నుపనిషచ్ఛాయలు పెక్కు గోచరములగును కావున ఈతనికి సంస్కృతభాషా జ్ఞానముండెనని యంగీకరింపకతప్పదు" అని వారంటారు[4] ఒక్క ఉపనిషత్తులేకాదు యోగశాస్త్రం, తంత్రశాస్త్రం మొదలైన గుప్తవిద్యల లోని శ్లోకాల భావాలు కూడా వేమనగారికి తెలుసునని 'స్వాతి' పత్రికలో నేను రాసిన వేమనవేదం వ్యాఖ్యానంలో చాలాచోట్ల మూలశ్లోకాలను ఉదహరిస్తూ చెప్పాను

రాళ్ళపల్లివారు చెప్పినట్టు వేమనగారు బళ్ళోచదువుకొని ఉండవచ్చు విలియం హోవర్డు క్యాంబెల్ చెప్పినట్టు వేమనగారు చదువుకొన్న వీధిబడిలో బ్రాహ్మణుడో, భట్రాజో అయ్యవారుగా ఉంటాడు[5] క్యాంబెల్ ఈ సంగతి చెప్తూ హిందూ దేశములో ఒకటి రెండు శతాబ్దముల కాలము ప్రజల ఆచార వ్యవహారములలో గుర్తించ తగినంత మార్పును చూపించజాలదు[6] అన్నారు వేమనగారి స్వస్థలా లనుకొన్న ప్రాంతాలలో పర్యటన చేస్తూ క్యాంబెల్ చూసిన వీధిబళ్ళలో భట్రాజులు కూడా అయ్యవార్లుగా ఉండి ఉంటారు వేమనగారు భట్రాజుల దగ్గర చదువుకొన్నారన్న ప్రతిపాదన వైపు నేను మొగ్గుతాను వారికి ఎన్నో చాటువులూ, నీతి పద్యాలు కంఠతా వచ్చినట్టు చెప్పవచ్చు నీతిశాస్త్ర ముక్తావళి, సుమతి శతకం, సకల నీతి కథా నిదానం మొదలై పుస్తకాలలోని పద్యాలెన్నో వేమనగారికి వాచో విధేయాలని చెప్పడానికి ఆధారాలున్నాయి వీటిని సందర్భోచితంగా ఉదహరిస్తాను

---

2 వేమన - 47

3 అదే పుస్తకంలో - అదే పుట

4 వేమన పద్యములు - వావిళ్ల ప్రచురణ 1955 సంవత్సరపు ప్రతి పుట 101

5 వేమన - పాశ్చాత్యులు - మరుపూరివారి అనువాదం పుట 73

6 వేమన - పాశ్చాత్యులు - పుట 78

జన్మతః వేమనగారు శైవులు వారికాలానికి రాయలసీమలో వీర శైవం ప్రచారంలో ఉంది సామాన్య ప్రజలకోసం వీరశైవం ద్విపద కావ్యాలను ప్రోత్సహించింది శతకాలు, యక్షగానాలు కూడా వీరశైవ కవులు రచించారు అయితే పామరులను కూడా ఆకట్టుకొనేది పాటలే తాళ్ల పాకవారి ఆధ్యాత్మ సంకీర్తనల లాగే శైవులు కూడా శైవ సంకీర్తనలు రచించుకొన్నారు తత్త్వాలు, యాలలు చాలాప్రచారంలో ఉండేవి ఇప్పటికీ యాగంటివారి తత్త్వాలు తెలుగుదేశంలోని చాలాప్రాంతాలలో వినబడుతూనే ఉంటాయి వేమనగారి మీద యాగంటివారి రచనల ప్రభావం చిన్నప్పుడు గట్టిగానే ఉండేది

'వేమనవంటివారు' అనే ఆరో ఉపన్యాసంలో "ఏగంటి వారెవరో ఒకరో, అనేకులో, యేవూరి వారో యెప్పటివారో తెలియు నవకాశము నాకు లభింపలేదు" అన్ని రాళ్ళపల్లివారు అన్నారు[9] కొన్ని గుజిలీ ప్రతులలో ఈ పాటలు కొన్ని 'యేగంటి లక్ష్మయ్యగారి వచనాలు' అని ముద్రించిన సత్యాన్ని శర్మగారు గుర్తించారు దూదేకుల సిద్దయ్యలాగే యాగంటి లక్ష్మప్ప కూడా వీరబ్రహ్మంగారి శిష్యులలో ఒకడై ఉండవచ్చుననే అభిప్రాయానికి డాక్టర్ గోపీ వచ్చాడు[10] యాగంటి లక్ష్మప్పగారు వీర బ్రహ్మంగారి శిష్యుడైన సాలెకులజుడని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు రాశారట ఈసంగతిచెప్తూ బాలాంత్రపు రజనీకాంతరావుగారు ఇలారాశారు[11]

"కోదండరామయ్యగారే ఆధారంతో వ్రాశారోగాని యాగంటి లక్ష్మప్పగారి తత్త్వాలనుబట్టి గాని కాలజ్ఞాన తత్త్వాల పుస్తకంలోని పాట లపై నున్న సూచనలను బట్టిగాని లక్ష్మప్పగారు వీరబ్రహ్మంగారి శిష్యు డన్న విషయం యెక్కడా సూచితం కాలేదు అందుచేత యేగంటి గురుడూ ఆయన శిష్యబృందమూ బ్రహ్మంగారి ప్రభావంతో సంబంధంలేని మరొక కాలానికి చెందినవారని మాకు తోస్తుంది సిద్ధ యోగులకూ, శైవమతానికీ అటపట్టుగా పేరుపడిన శ్రీశైల ప్రాంతంలో వీరుండి యుండవచ్చు"

కర్నూలు జిల్లా బనగానపల్లె సంస్థానంలో 'యాగంటిపల్లె' ఉంది ఈగ్రామంలో స్థిరపడిన గాడ్లపాటి లక్షయ్యగారికి ఉత్తరోత్తరా 'యాగంటి లక్షయ్య' అనే పేరు వచ్చిఉంటుంది ఈయన సుప్రసిద్ధ శైవ సంకీర్తనలు

9 వేమన – పుట 134

10 ప్రజాకవి వేమన - పుట 390

11 ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము – పుట 413

**పాడినకవి** ఈయననే పోశెట్టి లింగయ్య తన నవచోళ చరిత్రలో ఇలా పొగిడాడు

"వీరభద్రేశ్వరు విజయ సాహసము
వీర రసంబున విరచించి తానె
దాతయై కవులకు ధాత్రిలో నుత వి
ధాతయై మరి నెరదాతయై మిగుల
బాటల సద్భక్తి వరుల నుతిసేయ
బాటికెక్కిన గార్లపాటి లక్ష్మణుని
వెలయగా వినుతించి విజ్ఞానమును

(నవచోళ చరిత్రం – ప్రథమాశ్వాసం
ద్విపద పంక్తులు 80 నుండి 87)

ఈ ద్విపద పంక్తులవల్ల గార్లపాటి లక్ష్మయ్యగారు పాటలు రాసి పాటికెక్కారని తెలుస్తోంది గార్లపాడు గ్రామం కర్నూలు జిల్లా నంది కొట్కూరు తాలూకాలో ఉంది గుంటూరు తాలూకాలో ఒక గార్లపాడు ఉంది పల్నాడు తాలూకాలో కూడా ఒక గార్లపాడు ఉంది ఈ గ్రామాలలో కన్నా రాయలసీమలోని గార్లపాడులోనే లక్ష్మయ్యగారు ఉండడానికి ఆస్కారం ఉంది గార్లపాడు, యాగంటిపల్లె రెండూ కర్నూలుజిల్లాలోనే ఉండడం గమనించదగ్గ విషయం

సుప్రసిద్ధుడైన తెనాలి రామకృష్ణుడు, రామలింగడిగా ఉన్నప్పుడు తెలియవచ్చే విషయాలవల్ల వాళ్ల ఇంటి పేరు గార్లపాటివారు తండ్రి రామయ్యగారు పినతండ్రి లక్ష్మణయ్య ఈగార్లపాటి లచ్చన్నగారినే పోశెట్టి లింగన్న నుతించాడని నేను ఇంతకుముందు భావించాను [12] రామకృష్ణుని తండ్రిగారు తెనాలిలో రామలింగేశ్వరస్వామికి క్రీ శ 1510 లో ఉత్సవ విగ్రహాలను చేయించారు [13] గార్లపాటి లక్ష్మయ్యగారు కూడా అప్పటి వారే ఈ వంశంలోనివారూ, వీరి బంధువులూ దేశసంచారాలు చేసినట్టుంది రామకృష్ణుడు, అతని తరువాతివారు వైష్ణవులయినా గార్లపావాటిరు ఆదిలో శైవులే.

రామకృష్ణుని పినతండ్రో కాదో చెప్పలేంగాని రాయలసీమలో గార్లపాటి లక్ష్మయ్యగారు ఉండడం మట్టుకు ఖాయం ఆయన పాటలు

---

12 సమగ్ర ఆంధ్ర సాహిత్యం--ఎనిమిదవ సంపుటం-- పుట 15
13. ఆంధ్రకవితరంగిణి-ఎనిమిదవ సంపుటం పుట 31

రచించి పాటికెక్కడం గ్రంధస్తమైన విషయం మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో 'ఏగంటివారి వచనములు' అనే వ్రాతప్రతులు డి 2487 నుండి డి 2498 దాకా పన్నెండు ఉన్నాయి వీటిలో ఆరు తాళపత్ర గ్రంథాలు. ఆరు కాగితం పుస్తకాలు 'యాగంటివారి మంగళహారతి' (డి 2486) ఏగంటి భాష్యము (డి 2499) అనే మరో రెండు పుస్తకాలు కూడా ఆ గ్రంథాలయంలోనే ఉన్నాయి యాగంటివారి మంగళహారతిలోని చివరి చరణంవల్ల కర్త లక్ష్మయ్యగారే అని తెలుతోంది [14]

అరుదొంద వృషభ వాహనుడు యాగంటీశు
డరయ లక్ష్మాభక్త వర దుడగుచు
పరికింప నేలిన ప్రమథగణ
సరస సాయుజ్య శివ సమూహామునకు ॥జయ మంగళం॥
(డి 2486)

ఈ పాటలలో యాగంటి గురుడు, యాగంటి హరుడు, యాగంటి శివుడు, యాగంటి లింగడు మొదలైన ముద్రలే ఎక్కువ కనబడతాయి నాలుగు పాటలలో యాగటి నంజేశుడు అనేముద్ర ఉంది ఇంకో నాలుగు పాటలలో 'పిడపర్తి గురుడు' అనే పేరు కనబడుతోంది మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంధాలయం వారి డి కేటలాగులో డి 2487 అనే గ్రంథం వివరాలు చెప్పాక కేటలాగు రచయిత చివరకొన్ని వాక్యాలు రాశారు 'ఇందలి గేయములన్నియు శైవ వేదాంత సంబంధమైనవి ఏగంటి నంజేశ్వరాంకితములు పిడపర్తి లక్ష్మయ్యగారి వచనములనియు నీ గేయములకు పేరు గలదు అందుచేత పిడుపర్తి లక్ష్మయ్యగారీగ్రంధమును రచించినట్లు తోచుచున్నది"

పిడపర్తి కవులు చాలా సుప్రసిద్ధులు ఎన్నో శైవ కావ్యాలు రచి వారు అయితే వారి వంశంలో ఎవరూ లక్ష్మయ్య అనే పేరిటి వ్యక్తి కనబడడంలేదు పద్య బసవ పురాణం, ద్విపద ప్రభులింగలీలలు చెప్పిన పిడుపర్తి సోమన్నగారు ప్రఖ్యాత శైవ కవులు, గురువులు ఈయన 1520 ప్రాతాలవారే వీరినే యాగంటి వారు పిడుపర్తి గురువుగా పేర్కొని వుంటారు ఈ పాటలకు 'ఏగంటి వారి వచనాలు' అన్నదే ప్రచారంలో ఉన్న పేరు వేమనగారి బాల్యంలో అవి వారి మీద గట్టిముద్ర వేశాయి శైవులు లింగధారులు లింగానికి అంగానికి బేదం లేదు ఉండకూడదు

---

14 ఓరియంటల్ తెలుగు పుస్తకాల డి క్యాటలాగు-పన్నెండో సంపుటం పుట 2735

అదట భక్తుడు లింగామౌట కణుమాత్రము భేదము కలదా
అది శివాంగము భక్తనామకం బదియే లింగము కాదా ॥అదట॥
సంగతముగ తన యిష్టలింగమున కంగము వేరే కలదా
లింగము ప్రాణమునైన భక్తుని చిందంగము అంగముకాదా
నింగడముగ యా లింగమునకు మరి వీనులు వేరే కలవా
అంగికంబై భక్తుడు వినియెడి అవియే వీనులు కావా ॥అదట॥

హరలింగమునకు స్పర్శనము మరిత్వకంగము వేరే గలదా
అరయగ భక్తునిత్వ కనియెడి స్పర్శేంద్రియ మదియె కాదా
యిరవుగ శివలింగమునకు ఇరు నేత్రంబులు వేరె కలదా
తరలన్ భక్తుడు చూచెడి యా నేత్రంబులు అవియే కాదా ॥అదట॥

అనుప గురులింగమునకు వక జిహ్వాగ్రము వేరే గలదా
అనుదినమును భక్తుడు రుచిగొనియెడి ఆ జిహ్వాగ్రము కాదా
ఘను డేగంటీశ్వరలింగమునకు ఘ్రాణము వెరే కలదా
అనుదినమును భక్తుడు ఘ్రాణించేటి అదియే ఘ్రాణము కాదా
॥అదట॥

(డి 2489 – పాటసంఖ్య 18)

జంగానికి లింగానికి అభేదం ఈ పాటలో యాగంటివారు చెప్పారు. ఈ భావాలను వేమనగారు తమ పద్యాలలో విస్తరించారు

లింగమంగమునను లీల దెలియు వెన్క
మనసు లింగమందు మరులు కొనును
మనసు నిల్పనందె మరిలింగముండురా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ. ర. 3366)

లింగమందు జూడ లీనమై యుండెనా
యంగమందు జూడ నమరి యుండు
[15] అంగ లింగ సంగమన నేకమైయుండు
విశ్వదాభిరామ వినురవేమ (వే. సూ ర 3367)

---

15 బందరు వారి ప్రతిలోనూ, ఇతర ప్రతుల్లోనూ "అంగ లింగ భంగ మన నేకమైయుండు' అనే అసాధు పాఠమే కనబడుతుంది యాగంటి వారి వచనాలలో 'అంగ లింగ సంగమము' అనే ప్రయోగం ఉంది. చూ డి 2489 లో 64వ పాట

ఆత్మయందు జ్యోతి యమరుట లింగంబు
తెలిసి చూడగాను తేటపడును
అదియు గురువులేక యబ్బునా తెలియంగ
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 243)

యాగంటివారు లింగధారులయినా సంసార యోగులు సంసారంలో ఆశాపాశాలు, ఇంద్రియమోహాలు ఉంటాయి వీటినే ఒక పాటలో చెప్పారు

ఈలాగు సుఖము లింద్రియ మోహపాశముల
పాలు గావలసె భవబంధముల చేతనే ॥ఈ॥

చనుప్రెమ ప్రియసతుల చక్కని రూపమటు జూచి
ఘన దివ్యలింగ భావన శాయబాసెనే
అనువైన బిగువు చన్నులు ముట్టతమకమున
తన మనసు శివలింగము ముట్టబాసెనే ॥ఈ॥

రతికూర్మి కొసరు మధురాధరము లొల్కు విని
శృతి శివానంద సన్నుతి శాయ మరచెనే
రతి క్రమాపేక్షలకు రయము నధరముగ్రోలి
గతిచెడి ప్రసాద భాగంబెల్ల బాసెనే ॥ఈ॥

సురత వేళల కళల జూపు సతులకు జిక్కి
నెరయ గురుపాద సుస్థిర శేయబాసెనే
సరసకేళీ విలాస మాటలకు జిక్కి
పరమ గురు మంత్రంబు పఠియింప బాసెనే ॥ఈ॥

అరయ నానా సుఖంబు లస్థిరంబని తెలిసి
గురుని శ్రీపాదంబు కొలువంగ బాసెనే
పరమ గురు డేగంటి నంజేశ్వరుని
కరుణ చేకున్నట్టి కర్మిగా వలసెనే ॥ఈ॥

(డి 2489 లో 75వ పాట)

ఈ పాటలోని భావాలను కూడా వేమనగారు చాలా పద్యాలలో విస్తరించి చెప్పారు

మతము దారి మరచు మధురామృతము జూచి
మగువ రూపు జూసి మనసు మరచు
యోని జూచి పరమయోగంబు మరచురా[16]
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2913)

ఇంత కనులు చనులు యెంత లెస్సని చూచి
మోహపడును బుద్ధి మోసపోయి
గరిసెలోని వాని కానలేడాయెరా
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 120 పద్యం 394)

ఇలాంటి ఉదాహరణలు ఎన్నో ఇవ్వవచ్చు శైవులు అగ్నిహోత్రాది కర్మలను దూషిస్తారు ఆబ్దీకాలను అవహేళన చేస్తారు యాగంటివారు ఒక పదంలో ఇలాగ ఎద్దేవా వేశారు

కాకుల తమవారిగా జేసేటి - పలు
గాకులకును భక్తి యేల కలుగు ॥కా॥

మొల్లమైన కూళ్ల కూరలను
పుల్లెకు మూగిన పులుగులను
తల్లిదండ్రి అని తలచి తలచి మొక్కే
గుల్లాములకు భక్తి గురుతేల కలుగును ॥కా॥

(డి 2498 లో 34 వ పాట)

యాగంటి ప్రభావం చిన్నప్పుడే తమ మీద పడినందువల్ల వేమన గారుకూడా ఇలాగే ఆబ్దీకాలను అవహేళన చేస్తూ కొంచెం ఘాటుమాటలే వాడారు

పిండములను జేసి పితరుల దలపోసి
కాకులకును బెట్టు గాడ్డెలార
పియ్యితినెడి కాకి పితరు డెట్లాయెరా
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 158 పద్యం 192)

---

16 'యోని జూచి' అనే చోట 'ఉరము జూచి' అనే పాఠం బందరు ప్రతిలో వుంది బ్రౌన్ (1839) ప్రతిలో 'యోని జూచిసర్వయోగముల్ మరచురా' అనే పాఠం ఉంది చూ పుట 168

పితర యన్నమనుచ బ్రీతితో బిలిపించి
కాకులకును బెట్టు కర్మలార
కాకులందు నేమి ఘనులకు బెటుడీ
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 158 పద్యం 191)

బ్రాహ్మణేతరులు ఇప్పటికీ తమ పితాళ్ల తిధిరోజున బ్రాహ్మణులకు 'పొత్తర్లు' ఇవ్వడం కద్దు వేమనగారి కాలంలో ఇది ముమ్మరంగానే సాగుతూ ఉండే ఆచారం దానిని కూడా వారు ఖండించారు

"బ్రాహ్మణులకు బెట్ట ఫలము కద్దందురు
కుక్కలకును బెట్ట కొదువ యేమి
ఇందువందు శివుడె యేకమై యుండును
విశ్వదాభిరామ వినురవేమ

(వే నూ ర 2809)

'తల్లి రంకు దెలుప తద్దినాలు' అని మరో పద్యంలో వేమనగారు. అన్నారు (వే నూ ర 299) యాగంటివారు లింగధారులలో ఉన్న దోషాలను కూడా చూశారు

లింగధారుల మనుచు లెక్కకాయరు గాక
లింగమును బ్రాణము తల్లీనము గావలదా

(డి 2489 లో 29 వ పాట)

లింగధారులమనుకొనేవారు ఎన్నిరకాలుగా అన్నీ లెక్కచేయరో ఎన్నో లెక్కలేనన్ని పద్యాలలో వేమనగారు వివరించారు "బట్టతాళ్ళలోను బంధించి కట్టగా, లింగ డెవరి సొమ్ము దొంగిలించె' అని అడిగారు (వే నూ ర 2671) ఇలా ఎన్నెన్నో ప్రశ్నలు వేసి తరచి తరచి చూసి 'లింగధార్లకన్న దొంగలు లేరయా' అని తేల్చేశారు (వే నూ ర 282 ) శైవం ఇలా ఉందనుకొంటే వైష్ణవం దానికన్నా ఘనంగా ఉందా ? యాగంటివారు కూడా ఇదే అనుమానంలో పడ్డారు

ఏటి శైవము మరి యేటి వైష్ణవ వ్రతము
యేటి యా రూపంబు యేటి మార్గములు ॥ఏటి॥

బొంకకను సత్యంబు పోనీయ కెపుడును
లంకింప జిహ్వకు అదియె శుద్ధి
శంక లేకను దాన మంకించి చేయుటకు
బొంకకను తగినట్లు బూనుటేశుద్ధి ॥ఏటి॥

పరవనితలను జూచి పట్టరాని మోహంబు
స్థిరముగా వదిలినదే దేహశుద్ధి
నిరతంబు బాడియను నింద శేయక యెపుడు
స్థిరకాలమున్నదే చిత్తశుద్ధి ॥ఏటి॥

పంచేంద్రియములను పారనియ్యక యెపుడు
మంచితనమున నిలుచు మనసునకు శుద్ధి
యెంచి యాగంటీశు నే వేళ తనలోన
అంచెరిగి పూజింప ఆత్మశుద్ధి ॥ఏటి॥

(డి 2481 లో 50 వ పాట)

'ఆత్మశుద్ధి లేని యాచార మదియేల' ? అని వేమనగారు అందరినీ ప్రశ్నించారు

శైవవైష్ణవాది షణ్మతముల కెల్ల
దేవుడొక్కడనుచు దెలియ లేరె
తమకు భేదమైన దత్త్వంబు భేదమా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ. ర 3242)

విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి
వాదమేల మత విభేదమేల ?
తెలియ లింగధరులు తిరుమంటి పాలైరి
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 3576)

ఆరు దర్శనాలే కాక ఆరు మతాలు కూడా హిందువులకు ఉన్నాయి. 1) శైవము 2) వైష్ణవము 3) శాక్తము 4) గాణాపత్యము 5) సౌరము 6) కాపాలము అనే ఆస్తిక మతాలన్నింటినీ వేమనగారు ప్రగాఢంగానే పరిశీలించారు వాటిలో ఉన్న మంచి చెడ్డలను గుర్తించారు మంచిని కొంచెం కీర్తించారు చెడ్డను గట్టిగా దూషించారు శాక్తం భారత దేశంలోని ప్రాచీన

మతాలలో మొదటిది ఇప్పటికీ అమ్మవారి జాతరలు లేని గ్రామం ఆంధ్ర లోనే కాదు దక్షిణ భారతదేశంలోనూ, ఉత్తరభారతంలోనూ కూడా లేదు చిన్నతనంలోనే మా విశాఖపట్నం ఎల్లమ్మ తోటలోని అమ్మవారి ముందు కొన్నివందల కోళ్ళనూ, మేకలనూ బలివేయడం నాకు తెలుసు ఇక వేమనగారి కాలంలో చెప్పాలా ? జీవహింసతోపాటు అమ్మవారికి కుంభాలు పోస్తారు

శక్తి పూజ చేసి సరవి కుంభము బోసి
మ్రొక్కుచుండువేళ గుక్క యేడ్వ
నూరు పాడటంచు నూరెల్ల నేడ్తురే
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 3677)

రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడుగుడ్డ తాను కోరునా దైవంబు
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 3304)

తోలు కడుపులోన దొడ్డవాడుండంగ
రాతి గుళ్లలోన రాశిబోయ
రాళ్లు దేవులైన రాశులు మ్రింగవా
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 1987)

పామరుల శాక్తానికీ, పండితుల శాక్తానికీ, కొంచెం తేడావుంది మళ్ళీ అందులో దక్షిణాచారం, వామాచారం అనిభేధాలున్నాయి ఇవి తాంత్రికాలు హిందూదేశంలోని అన్నిమతాలలో తాంత్రికశాఖలున్నాయి తంత్రమునుండి సాంఖ్యదర్శనం, యోగశాస్త్రం ఉద్భవించాయి ఆదిలో సాంఖ్యం, లోకాయత మతం అభేదాలు తంత్రంలో బీజాక్షరాలు, మంత్రాలు, యంత్రాలు, ముద్రలు, షట్చక్రభేదనం కుండలినీయోగం ప్రవేశించాయి పంచమకారా లకు ప్రాముఖ్యం వచ్చింది శాక్తం శైవంలోనికే కాక వైష్ణవంలోనికి కూడా మద్యమాంసాల ఆధిక్యత ప్రవేశపెట్టింది

ఎంబెరు మతమందు నెసగి మాంసము దిని
మారు పేళ్లు పెట్టి మధువు ద్రాగి

వావి వరుస దప్పి వల్కి పాడౌదురు
విశ్వధాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పు 152 ప 184)

బ్రాహ్మణేతరులు మాత్రమే కాదు బ్రాహ్మణులలో యజ్ఞయాగాదులు చేసేవాళ్లు కూడా మాంసభుక్కులే

సోమయాజి ననుచు సొంపుగా వేషంబు
గట్టి మాంసమెల్ల గాల్చి తినును
ద్విజుడ దాననగ నధికమేమి తనవల్ల
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3936)

ఆస్తికుల మనుకునే వాళ్ల తత్త్వాలకన్నా నాస్తికుల దర్శనాలే ఆదర్శవంతంగా ఉన్నట్టు వేమనగారికి తోచడం సహజమే ఆనాటి సంఘంలో చార్వాకులు, జైనులు కూడా ఉండేవాళ్లు శైవేతరుణ్ణి శైవులు 'భవి' అని పేర్కొంటారు భవుల ముఖం చూడకూడదు వాళ్ళతో మాటాడకూడదు అనే నియమాలు వీరశైవులకు కచ్చితంగా ఉన్నాయి అందుకే యాగంటి వారే ఒకపాటలో ఇలా అన్నారు

శివ జన్మమున బుట్టి శివలింగమును గట్టి
శివభక్తుడై ఘన శీలమునా
భవిదైవముల గొల్చి భవులొప్ప నాడిచె
భవజీవులకు భక్తి పదమేల కలుగునె

(డి 2484 లో 35 వ పాటలో

భవుల సంగము బాసి పరదైవముల రోసి
భవములన్నియు రోసి భ్రాంతి విడిచి
శివ భక్తులను సేవ లెంతయు జేసి
శివభక్తి మార్గమున చెలగె మనసా

(అందులోనే 19 వ పాటలో)

అయితే సమాజ జీవిత మన్నాక వివిధ కులాలవాళ్ళూ, మతాలవాళ్లూ 'నన్ను ముట్టుకోకు నా మాలకాకి' అని విడిగా కూర్చోలేరు పరస్పర

పంబంధాలు వాణిజ్యంలోనైనా, వైరంలోనైనా, మరెందులోనైనా, తప్పవు కాబట్టి యాగంటివారే చివరకు ఇలాగ వాపోవలసి వచ్చింది

'ఏలాగునడుపుదు సంసార యోగము
యేది ఉపాయమిక లింగయ్యా
నీలకంఠేశ్వర నీమీద నాభక్తి
నిలుప వశము గాదు ॥ఏలాగు॥

శివపూజ ధ్యానము చేసుకో నేనంటి
చిత్తగించదు మనసు లింగయ్యా
భవులతో సంసర్గ బాసియుండెదనంటి
బాహ్యరంగము మానదు ॥ఏలాగు॥

(డి 2489 లో 71 వ పాట)

వేమనగారికి కూడా తమ జీవితంలో ఎందరో భవులు తారసిల్లారు వాళ్ళను లింగధారులను చేయాలని వేమనగారు తాపత్రయ పడినట్టున్నారు

భవికి సూత్రమందు పరగ లింగము గట్టి
భవిని గాల్చి భూతి పసుగ పెట్టి
భవిని శివునిగాను భావింప నెరుగరో
విశ్వధాభిరామ వినురవేమ

(అకాడెమీ ప్రతి పుట 86 పద్యం 323)

ఇది సాధుపాఠాలతో సంస్కరించిన పద్యం [17]

భవిని కాల్చినట్టి భస్మంబు దాబెట్టి
శీలమునను వట్టి సిగ్గుమాలి
యన్ని జీవులకును నున్నవి లింగముల్
విశ్వధాభిరామ వినురవేమ

(అకాడెమీ ప్రతి పుట 241 పద్యం 1004)

వీరశైవ వాఙ్మయంలో మల్లికార్జున పండితారాధ్యుడు ప్రథముడు. ఈయన తన శివతత్త్వసారంలో 'భవి' అనేమాట ఎక్కడా వాడలేదు శైవు

17 అకాడెమీ ప్రతిలో ఈ పద్యం నిండా అచ్చు తప్పులే భవి అని ఉండవలసినచోట 'భువి' అని అచ్చు వేశారు యతి తప్పుతుంది ఈప్రతిలోనే 1161 నెంబరు పద్యంలో ఇదే భావం ఉంది అయితే 'భవి అనేచోట 'బహిని అనే పాఠం ఏర్పడుతుంది

లను భక్తులన్నాడు శైవేతరులను అభక్తులన్నాడు అవినీతులరు అన్నాడు భవి అన్నమాటను పాల్కురికి సోమనాథుని రచనల్లో విరివిగా చూస్తాం ఆ తరువాత వీరశైవుల కృతులన్నింటిలో ఈ మాట కనబడుతూ వచ్చింది పోతనగారు వీరభద్ర విజయంలో ఇలా నుతించారు

భవి జూడక భవి డాయక
భవు పదములు గొల్చి ఘోర భవ భంజనులై
భవదూరులైన పుణ్యుల
భవునర్చన చేసి వరము బడసిన వారిన్

(వీర – పీఠిక పద్య సంఖ్య 10)

ఈ వీరశైవులందరూ ఏ అర్థంలో వాడారో అదే అర్థంలో వేమనగారు కూడా 'భవి' అనే పదం వాడారు వీరశైవులకూ, జైనులకూ పడదు పచ్చగడ్డి వేస్తే భగ్గున మండుతుంది అయినా జైనులమతం ఏమిటో, తెలుసుకుందామని వేమనగారు భావించారు వీరశైవంలో కనబడే దురాచారాలను ఏవగించుకొన్నాక జైనం ఆకర్షణీయంగానే తోచింది కాబోలు

అర్హ మతముకన్న నధికమైన మతము [18]
లింగ మతముకన్న లేదు జగతి
లింగధారికన్న దొంగలు లేరయా
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను 1839 పుట 44 పద్యం 294)

జైనాన్ని అర్హమతం అంటారు ఈ పేరుతోనే జైనాన్ని వేమనగారు ఇక్కడ పేర్కొన్నారు జైనం మంచిదే అయితే అందులో ఒక లోపం ఉంది చాతుర్వర్ణాలను జైనం అంగీకరిస్తుంది వీరశైవంలో కులభేదాలు లేవు అందరిదీ ఒకటే వర్ణం అందుకే అర్హమతం కన్నా లింగధారి మతమే వేమనగారికి అధికమైనదిగా తోచింది కాని లింగధార్లకన్న దొంగలులేరని తమకు తెలుసు ఆ సంగతి దాచుకోకుండా చెప్పేశారు

జైనంలో ముఖ్యంగా వేమనగారిని ఆకర్షించిన విషయాలు భూత దయ, అహింస జీవహింస ఏరూపంలోనూ చేయకూడదనే సిద్ధాంతం మెచ్చుకోదగ్గదే

---

[18] బ్రౌను సంకలనంలో 'అర్మ్రతములకన్న నధికమైన మతము' అనే ప్రథమ పాదం ఉంది ఇది అచ్చు తప్పు అని భావించి 'అర్మతముల కన్న' అనే పాఠాన్ని పండితులు స్వీకరించారు ఆరు మతాలలో శైవం కూడా ఒకటే అయినపుడు 'కన్న' అనే పదానికి ప్రయోజనం ఉండదు

ప్రతి జీవిలోనూ శివుడుంటాడని శైవులు నమ్ముతున్నారు కదా. జీవిని చంపడం శివుని చంపడమే కదా

జీవి జీవి జంప శివుని జంపుటె యగు
జీవు డరసి తెలియ శివుడు కాడె
భావమందు వేగ పరికించి చూడరా
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 1624)

భావంలో అతివేగంగా పరికించి చూస్తే వేమనగారికి తత్త్వం అర్థమైంది 'జీవహింసకులకు చిక్కునా మోక్షంబు' అని ప్రశ్నించారు (1625)

హింస చేయరాదు సంసార ధర్మంబు
జంతువులను జంపి సాపడుదురె
బావు పశువు దినెడు చండాలుడేమేలు
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 4004)

తిండికోసం జంతువులనూ, దండనీతిలో శత్రువులను చంపవచ్చునని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి రామాయణంలో ఋషులు కావాలని రామునిచేత రాక్షసవధ చేయించారు భారతం బంధుక్షయం యుద్ధంచేసి అయినవాళ్ళను చంపమని అర్జునుడికి సాక్షాత్తు శ్రీకృష్ణుడే ఉపదేశించాడు.

రామ సచ్చరిత్ర రాక్షస హరణంబు
బంధు నాశనంబు భారతంబు
అగు బసవ పురాణమది ముక్తికి గుదురు
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 3312)

'భక్తి మీద వలపు బ్రాహ్మంబుతో పొత్తు, బాయలేను నేను బసవలింగ' అని పండితయ్య ఊగిసలాడుతున్న స్థితిలోనే వేమనగారు అద్వైతము మీద అభిమాన మొక పక్క లింగమతము వీడలేని తనమూ తనలో పోరాడుతున్న స్థితిలో ఇలాంటి పద్యాలు చెప్పి ఉండాలి పండితారాధ్య చరిత్రలో కూడా చంపదగ్గ వాళ్ళను చంపించడం జరిగింది జైనంతో పరిచయం లేకపోతే పాత నీతి పద్యాలలో చెప్పిన రీతిగా ఈ హత్యలను వేమనగారు సరిపెట్టుకు పోయేవారు

కీడు సేయు వానికిని మేలు సేయుట
మునుల గుణము గాక జనుల నెల్ల

బ్రోచువాడు కల్లరుల నాజ్ఞ పెట్టుట
యాగ పశు విశసన మట్లుగాదే

(సకల నీతి సమ్మతం 1-164)

ఇది నీతి సారంలోని పద్యం దీనిని మడికి పింగన ఉదహరించాడు కీడు చేసేవాడికి సైతం మేలుచేయడం మునుల గుణమని పద్య రచయిత చెప్తున్నాడు మునులంటే జైనాచార్యులే పండితారాధ్య చరిత్రలో జైన మునులను పాల్కురికి సోమన పేర్కొన్నాడు మునులు, యతులు, యోగులు, ఋషులు, సిద్ధులు అనే మాటలు నేడు పర్యాయ పదాలుగా వెలామణిలో ఉన్నా ఒక్కొక్క మాటలో ప్రత్యేకత ఉంది వేమనగారు జైనమునుల సంపర్కం వల్లనే అభిప్రాయాలు మార్చుకొన్నారు

చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మన్న చంపుట
విశ్వధాభిరామ వినురవేమ

(తంజావూరు డి 407 లో 70 వ పద్యం)

ఈ పద్యంలో 'పొసగ మేలు చేసి పొమ్మనుటయె చాలు' అనే పాఠాన్ని ముద్రిత ప్రతులన్నీ ప్రచారం చేశాయి బ్రౌను (1839) ప్రతిలో 'పొమ్మనుటే చావు' అనే పాఠమే ఉంది తంజావూరి ప్రతిలో 'పొమ్మన్న చంపుట' అనే పాఠం ఇంకే సందిగ్ధ పాఠానికి ఆస్కారం లేకుండా కవి హృదయాన్ని తెలియజేస్తుంది[19] ఇది మృచ్ఛకటికలో ఒక శ్లోకానికి అనువాదం కీడు చేసేవాడికి మేలుచేయడం మునుల మతం, కనుక జైనుల నుండే వేమనగారు ఈ శ్లోకాన్ని విని అనువదించి ఉంటారు లింగధారులకూ, జైనులకూ, బ్రాహ్మణులు ఉమ్మడిగా శత్రువులు శివ ద్విజులు కాని బ్రాహ్మణులను పాల్కురికి సోమనాధుడు తిట్టినంతగా మరెవ్వరూ పూర్వం తిట్టి ఉండరు అతడు బ్రాహ్మణులను త్రాటిమాలలు, పచ్చిమాలలు అన్నాడు కుక్కలు, త్రాటికుక్కలు అన్నాడు గాడిదలన్నాడు వీరశైవప్రభావం వల్లనే వేమనగారు కూడా బ్రాహ్మణులని కుక్కలు, గాడిదలు అని తిట్టారు

---

19 ఈ పాఠం విషయంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన 'బ్రౌన్ లేఖలు' (బంగోరే సంశోధన) లో పుటలు 61,62, 63 చూడండి

'వెఱ్ఱినక్కలవలె వేదముల్ సదివిరే
యాశయంబు లెరుగ రయ్యవార్లు
వేదసారమంత వేమన యెరుగును
విశ్వధాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పు. 124, 422

ఈ పద్యంలో 'వెఱ్ఱి నక్కలవలె' అనేది సాధు పాఠం కాదేమో! 'వెఱ్ఱికుక్క' అన్నదే నానుడి 'పిచ్చికుక్క' అనే ప్రయోగం కూడా విరివిగానే కోస్తా జిల్లాలో వినబడుతుంది కడప ప్రాంతాలలో 'వెఱ్ఱినక్క' అనే ప్రయోగం ఉన్నట్లు విన్నాను ఈ సంగతి ఇంకా పరిశోధించాలి వేమన గారు 'వెఱ్ఱికుక్క' అనే ప్రయోగం కూడా వాడారు

వేనవేలు చేరి వెఱ్ఱికుక్కలవలె
అర్థహీన వేద మఱచు చుంద్రు
కంఠ శోష కంటె కలిగెడి ఫలమేమి ?
విశ్వధాభిరామ వినురవేమ

నక్కయితేనేం, కుక్కయితేనేం ఆ జంతువుతో వేమనగారు విప్రులను పోల్చారు 'పిండములను జేసి పితరుల తలపోసి, కాకులకును పెట్టు గాడ్దెలార!' అన్న పద్యంలో గాడిదలతో పోల్చి తిట్టారు పాల్కురికి సోమనాథుడు బ్రాహ్మణులను 'కర్మజీవులు' అని తిట్టాడు వేమనగారు చాలా పద్యాలలో 'కర్మమతమును' దూషించారు సోమనాథుడి తర్వాత వీరశైవులు బ్రాహ్మణ నింద చేసినట్టు కనబడదు ఆంధ్రదేశంలో ఆరాధ్య బ్రాహ్మణులనే ఒకశాఖ రూపొందడమే దీనికి కారణం

'వెఱ్ఱి నక్కల వలె' అనే పద్యం వావిళ్ల ప్రతిలో కనబడదు అందువల్ల బాలసరస్వతివారి ప్రతిలోనూ డిటో ఒక్క బందరువారి ప్రతిలో పాఠభేదాలతో కనబడుతుంది

వీరశైవులలాగే జైనులు కూడా బౌద్ధ, బ్రాహ్మణ ద్వేషం కలవాళ్లే త్రిమూర్తులను నిందిస్తారు బ్రాహ్మణులకు జైనులకు ఎన్నో యుద్ధాలు జరిగాయి ఏయే ఊళ్ళలో, ఏయే జైన బసదులను ఎవరెవరు నాశనం చేశారో పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో చెప్పాడు[20] బ్రాహ్మణులు

20 వాదప్రకరణం పుట 590 నుండి చాల పంక్తులు

అందరూ చెప్పుకొనే 'సంకల్పంలో' జైనులను తిడతారు జైనులు తమ ప్రార్ధన సమయంలో 'బ్రాహ్మక్షయం!' అని లేస్తారు [21]

వేమనగారిమీద 'జైనమత ప్రభావం' ఉండబట్టే వారు కొన్ని పద్యాలు అలాగ చెప్పారని నేను నిరూపించడానికి ప్రయత్నిస్తున్నాను. అయితే రాళ్లపల్లివారివంటి విజ్ఞులే వేమనగారి కాలానికి జైనం మన దేశంలో లేనట్టు భావిస్తున్నారు శర్మగారు తమ 'వేమన' నాలుగో ఉపన్యాసంలో 'బహుదేవతా వాదులైన జైనులు ఆంధ్ర దేశమును చాలానాళ్ళ క్రిందనే వదిలిపోయిరి వీరాంధ్ర దేశమందు మతవ్యాప్తి కెక్కువ ప్రయత్నించినారా యను విషయమే సందిగ్ధము' అని చెప్పారు [22]

ఔనటంచు నొక్క డాడిన మాటకు
కాదటంచు బలుక క్షణము పట్టు
దాని నిలువదీయ దాతలు దిగివచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 828)

ఈ పద్యం నాదికాదు సాక్షాత్తు వేమన గారిదే ఎందరితో ఎన్ని చర్చలు చేస్తున్నపుడు ఇది వారికి స్వానుభవమైందో తెలియదు బౌద్ధానికన్నా జైనమే ఆంధ్రదేశంలోముందుగా ప్రవేశించింది తెలుగు నాడులన్నింటిలోనూ విస్తరించింది వేమనగారు రాయలసీమ వారు కాబట్టి నా మాటను నిలువ దీయడానికి తాతలను ముందు దిగుమతి చేస్తున్నాను రాయలసీమలో జైనస్థావరాల వివరాలను వినండి

కడపజిల్లా

| | | |
|---|---|---|
| 1 | దానవులపాడు | జమ్మల మడుగు తాలూకా |
| 2 | పెనికల పాడు | జమ్ములమడుగు తాలూకా |
| 3 | గంగపేరూరు | సిద్ధవటం తాలూకా |
| 4 | సిద్దవటం | |
| 5 | పుష్పగిరి | కడపతాలూకా |

21 ABBE J A DUBOIS — Hindu Manners P. 107
22 వేమన - రాళ్లపల్లి పుట 73

కర్నూలు జిల్లా

| | | |
|---|---|---|
| 6 | ఆదోని | |
| 7 | నాయకల్లు | పత్తికొండ తాలూకా |
| 8 | పెద్ద తుంబలం | ఆదవాని తాలూకా |
| 9 | శ్రీశైలం | నందికొట్కూరు తాలూకా |

అనంతపురం జిల్లా

| | | |
|---|---|---|
| 10 | అమరపురం | మడకశిర తాలూకా |
| 11 | చిప్పగిరి | గుత్తి తాలూకా |
| 12 | కంబదూరు | రాయదుర్గం తాలూకా |
| 13 | కొనకొండ్ల | గుత్తి తాలూకా |
| 14 | లేపాక్షి | హిందూపురం తాలూకా |
| 15 | పెనుకొండ | ధర్మవరం తాలూకా |
| 16 | రాయదుర్గం | |
| 17 | శివరం | మడకశిర తాలూకా |
| 18 | తాడిపత్రి | |
| 19 | తమ్మదేహల్లి | మడకశిర తాలూకా |
| 20 | తేగరగుంట | కల్యాణదుర్గం |

బళ్ళారి జిల్లా

| | | |
|---|---|---|
| 21 | హంపి | |

చిత్తూరు జిల్లా

| | | |
|---|---|---|
| 22 | చంద్రగిరి | |

చెంగల్పట్టు జిల్లా

| | | |
|---|---|---|
| 23 | నల్లాట్టూరు | తిరుత్తణి తాలూకా |
| 24 | నింద్ర | తిరుత్తణి తాలూకా |

రాయలసీమను అనుకొని ఉండే ఇతర తెలుగు జిల్లాలలోనూ జైన స్థావరాలు ఉండేవి ఆంధ్రదేశంలోని బౌద్ధుల పంచారామాలను శైవ

క్షేత్రాలుగా మార్చేసినట్లు జైన బసదులను నేలమట్టం చేసి శైవ ప్రతిష్టలు చేయడం కద్దు కర్నాటకంలో వైజకవ్వ జైన ప్రతిమను పడగొట్టి ఆ స్థానంలో వైజనాథేశ్వరుని ప్రతిష్ఠించినట్లు పండితారాధ్యచరిత్రలో ఉంది [23] ఎంతో ప్రఖ్యాతమైన శ్రీశైలం ఆదిలో జైన స్థావరమే అని జైనులు చెప్తారు శ్రీపర్వతం శ్రీశైలం ఆదిలో మునుల స్థావరాలు అక్కడ శ్రీధరుడనే జైనముని తపస్సు చేసుకొనడం వల్ల దానికి శ్రీశైలమనే పేరు వచ్చిందట ఈ శ్రీధరుడే అర్జునవృక్షం కింద తపస్సు చేసుకొంటూ ఉంటే ఖేచరులు అతనిని మల్లిక పుష్పాదులతో పూజించారట ఆ తావును అందుకే మల్లికార్జునం అంటారు ఈ శ్రీధరుడినే అమరులు పూజించిన తావు అమరావతి అయింది శ్రీధరుడు వటవృక్షంకింద కేవల జ్ఞానాన్ని పొందాడు అందుకే దాన్ని సిద్ధవటం అంటారు శ్రీధరుని పరంపరని ముండీయ వంశమంటారు ఇతడు మునివృత్తిని విసర్జించి గృహస్థాశ్రమం స్వీకరించాడట ఇతని వల్లనే ప్రస్తుతం నెల్లూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలను పూర్వం ముండరాష్ట్రం అని పిలిచేవారు జైన సంబంధంమాట నిజమో కాదో గాని ముండరాష్ట్రం మాత్రం ప్రాచీన విభాగాలలో ఒకటన్నమాట వాస్తవమే [24] ఈ ప్రాచీన వైనాలను నేటి జైన చరిత్రకారులు క్రోడీకరించారు

ప్రపంచ ధార్మనిక ప్రముఖులలో ఇద్దరు తెలుగువాళ్లు కూడా ఉన్నారు బౌద్ధం ఆచార్యనాగార్జునుని లోకానికి ఇస్తే జైనం కూడ కుంద కుందాచార్యులను ఇచ్చింది ఈయన రాయలసీమలోని కొనకొండ్ల గ్రామవాసి అక్కడ శాసనాలు కూడా ఉన్నాయి నేటికీ జైనులు మొదట మంగళాశాసనం చేస్తున్నపుడు ఈయన్ని తలచుకొంటారు

> "మంగళం భగవాన్ వీరో మంగళం గౌతమో మునిః
>
> మంగళం కుందకుందార్య, జినధర్మోస్తు మంగళం"

నేడు ఆంధ్రదేశంలో జైనం సర్వమంగళమైనా వేమనగారి కాలానికి అది ఊపిరి పీలుస్తూనే ఉంది వేమనగారి పద్యాలు ప్రచారంలో ఉన్న ప్రాంతాలలోనే ఆబెదుబాయ్ పర్యటించాడు ఈ పాదిరీ తన 'హిందువుల

---

23 చూ - బిలుకూరి వారి పీఠిక – పుట 331

24 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం - కుందూరి ఈశ్వరదత్తు పుటలు 264, 265, 266

25 Jainism in South India by P.B Desai PP 4-5 ఈ గ్రంథాన్ని షోలాపూరులోని జైనసంహితి సంరక్షణ సంఘం వారు 1957లో ప్రచురించారు

ఆచారాలు' అనే గ్రంథంలో జైనుల గురించి ఒక అనుబంధ వ్యాసాన్ని పొందుపర్చాడు ఎందరో జైనులను స్వయంగా కలుసుకున్నాడు కైఫీయతులు రాయించి మన స్థానిక చరిత్రలను గ్రంథస్థం చేసి పెట్టిన మెకంజీ దొరగారి సిబ్బందిలో జైనులుకూడా ఉన్నారు వేమనగారికి జైనులతో చాలా సన్నిహిత పరిచయం ఉందని చెప్పడానికి ఒక పద్యం తిరుగులేని సాక్ష్యం చెప్తుంది

తంగ్రిడికన్న సుగుణి తనయుడు గల్గెనా
పిన్న పెద్దతనము లెన్నబోరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా
విశ్వదాభిరామ వినురవేమ[26]

(బ్రౌను (1839) పుట 86 పద్యం 162)

ఈ లోకంలో ఎవరేనా వాసుదేవుణ్ణి విడిచి వసుదేవుణి ఎంచారా? అలా చేసినప్పుడే వాళ్ళను వేమనగారు నిజంగా ఎద్దేవా చేయడానికి ఆస్కారం ఉంటుంది జైనులే వాసుదేవుణ్ణి విడిచి వసుదేవుణ్ణి చాలా గొప్పగా కీర్తించారు జైన కావ్యాలలో 'వసుదేవహిండి' అనే గ్రంథం వసుదేవుని చరిత్రను వేనోళ్ల కీర్తిస్తుంది 'హిండి' అంటే వ్యాప్తి అనే అర్ధం వాసుదేవుణ్ణి విడిచి వసుదేవుని ఎంచినందుకే వేమనగారు సహజ ధోరణిలో జైనులను తప్పుపడుతున్నారని ఈ పద్యం చాటుతోంది

'వసుదేవహిండి' ఇటీవలదాకా వెలుగు చూడలేదు పరిశోధకులు ఈ గ్రంథం గురించి ఒక్కొక్కడా ప్రస్తావించారు దానిలోని సంగతులను కొద్దికొద్దిగా తెలియజేశారు 1977లో అహమ్మదాబాదులోని 'ఎల్ డి ఇన్‌స్టిట్యూట్ ఆప్ ఇండాలజీ' వారు ఈ కావ్యాన్ని ఇంగ్లిషులో విపులంగా వివరించే గ్రంథాన్ని ప్రచురించారు వసుదేవహిండి గురించి ఇందువల్ల ఎన్నో

---

26 ఈ పద్యం రమారమి అన్ని ప్రతులలో కనబడుతుంది 'ఉన్న ఘనత బట్టి మన్నింతురే కాని' అనే మొదటి పాదంలో ఇదే పద్యం నేదునూరి వారి సంకలనంలో చేర్చారు (పద్య సంఖ్య 6537) సి వి కృష్ణా బుక్ డిపో వారి ప్రచురణలో ఈ పద్యమే పాఠభేదాలతో ఇలా ఉంది.

''తంగ్రిడికన్న కొడుకు తాగుణి యయ్యెనో
పిన్న పెద్ద తనము లెన్న వలదు
వసుధ గృష్ణునెంచివసుదేవ నెంతురా (పుట 22)

పాఠభేదాలు కనబడుతున్నా ఈ పద్యం ప్రఖ్యాతమే కాని ప్రక్షిప్తం కాదని చెప్పవచ్చు

సంగతులు తెలియవస్తున్నాయి ఇందులో వసుదేవుని కల్యాణాల కథనం ఉంది దీనిని 'వసుదేవ చరియ' అనికూడ పిలుస్తారు 'వసునేవహిండి' అనే ఒక కావ్యం ఉందనికాని, దానిలో వాసుదేవుని విడిచి వసుదేవుని ఎంచారనిగాని వేమనగారికి తెలుసునంటే వారికి జైనులతో ఎంత ప్రగాఢ పరిచయముందో అర్థంచేసుకోవచ్చు వేమనగారి కాలానికి జైనానికి సంబంధించిన మట్టుకు రాయలసీమ కనీసం ఇంగువ కట్టిన గుడ్డ

ఇటీవలదాకా ఆంధ్ర చారిత్రక పరిశోధకుల దృష్టిలో పడని మరొక జైన ప్రయోగం వేమనగారి పద్యాలలో కనబడుతుంది విజయనగర సామ్రాజ్యపు ప్రారంభదినాలలో క్రీ శ 1368లో వీరబుక్కరాయలు పృథివీరాజ్యం చేస్తున్నప్పుడు జైనులకూ భక్తులకూ వివాదాలు ఏర్పడ్డాయి. ఆనెగొంది, హొసపట్టణం, పెనుగొండ, కళ్లెహొ మొదలైన నాడులలో ఉండే జైనులువెళ్లి, భక్తులు తమ్ము అన్యాయంగా చంపుతున్నారని రాయల వారికి విన్నపం చేసుకొన్నారు బుక్కరాయలు జైనులకు, భక్తులకూ రాజీ కుదిర్చారు దీనికి శాసన ప్రమాణం ఉంది (చూ ఏపిగ్రాపియా కర్ణాటికా 9వ సంపుటం మాగడి తాలూకా 18వ శాసనం ) ఈ శాసనంలో భక్తులనే పేరుతో శ్రీ వైష్ణవులను సూచించారు ఇతర శాసనాలలో జైనులను భవ్యులని పేర్కొన్నారు (శ్రావణ బెలగోలా 136 నెంబరు శాసనం) హంపీ విజయనగరనిర్మాణ కాలంలో జైనులు చాలా అధిక సంఖ్యలోనే ఉండేవారు దేశమేలే రాజూ సైన్యాలను నడిపే సేనానులూ భవ్యులకు ఆలయాలు కట్టించారు[27] ఆయుధోప జీవులైన సైనిక ప్రముఖులు అహింసను బోదించే జైనాన్ని ప్రోత్సహించడం దేశంలో తూర్పు చాళుక్యుల కాలంనుండీ ఆనవాయితే

తెలుగు వీరశైవ కావ్యాలలో వీరశైవులను, భక్తులు అని, శైవేతరులను భవులు అని పేర్కొనడం సామాన్యం కర్నాటక శాసనాలలో వైష్ణవులను భక్తులు అని, జైనులను భవ్యులని పేర్కొనడం ఇప్పుడు గమనించాలి 'భవి' అనే మాటను తమ పద్యాలలో వాడిన వేమనగారు 'భవ్యులు' అనే పదాన్ని కూడా వాడారు ఇది కనీసం ఒక పద్యంలో కనబడుతుంది

మద్య మాంస రుచిని మాదిగ దైవాల
ఎంగిలి తినువారి దెట్టి కులము

---

27 Social and Political Life in the Vizayanagara Empire by B A Saletore - Vol. I, p 103

భక్తులు హరి వీడి భవ్యులు కారొకో
విశ్వదాభిరామ వినురవేమ [28]

భవ్యులు' అనేమాటకు ఆనాడు ఉండే అర్థం ఏమిటో తెలుసుకొంటేనే 'భక్తులు హరి వీడి భవ్యులు కారొకో' అనే పై పాఠం సాధువని తెలుస్తుంది. బ్రౌను కాలం నుంచీ పరిష్కర్తలు ఈ మూడో పాదాన్ని పలువిధాలుగా మార్చారు భక్తులు అంటే వైష్ణవులు, భవ్యులు అంటే జైనులు అన్న ఉద్దేశంలోనే ఈ ప్రయోగాలను వేమనగారు చేశారని ప్రస్తుతం భావించానే తప్ప నిరూపించడానికి తక్షణ తార్కాణాలు లేవు అయినా ఇవి భావి పరిశోధనలవల్ల దొరుకుతాయన్న నమ్మకం నాకు గట్టిగా ఉంది

"రంగ ధామమునకు హంగుగా తానేగి
కల్లు కంపు సొంపు కల్గియుండు

విశ్వదాభిరామ వినురవేమ [29]

'భక్తుల'ను ఇలాగ దూషించిన వేమనగారు వీళ్ళను మద్యమాంసాలను తాకని భవ్యులతో కలపడానికే ప్రయత్నించారనుకొనడం విడ్డూరమేం కాదు

జైన ప్రభావంచేత వేమనగారు దిగంబర సన్యాసం స్వీకరించారని భావించడం సులభమే గాని రుజువు చేయడం కష్టం దక్షిణ భారతంలో దిగంబర జైనులదే ప్రాబల్యం వేమనగారి సమకాలికులో సమీపకాలికులో సదాశివ బ్రహ్మేంద్రులు కూడా దిగంబరులే ఆయనకు జైన సంపర్కం లేదు తంజావూరు రాచనగరులో ఉన్న దిగంబర సన్యాసి చిత్రపటం సదాశివ బ్రహ్మేంద్రులదేమో అన్న సందేహం సామాన్యులకు కాకపోయినా చారిత్రక పరిశోధకులకు కలగడానికి ఆస్కారం ఉంది భోసల రాజులతో

---

28 ఈ పద్యంలోని మూడో చరణం బ్రౌను (1839) ప్రతిలో 'భక్తిని హరిగొల్చి భవ్యులుగారైరి' అని ఉంది (పుట 99 పద్యం 255 ) బందరు ప్రతిలో 'భక్తిని హరు గొల్చి భవ్యులు కండయా!' అని ఉంది (2928) వావిళ్ల ప్రతిలో 'యెంగిలి దినగానె నింగికలదె? భక్తిని హరుగొల్చిభవ్యులు గండయా' అని ఉంది (పుట 147 )

29 రాళ్లపల్లివారు కొంతే ఉదహరించిన పద్యం (ఒ లై 13-3-39)

సదాశివ బ్రహ్మేంద్రులకు సంబంధమున్నట్టు గ్రంథస్థమైన ప్రమాణాలే ఉన్నాయి [30]

ఇంగిలీక మహిమ హేమింప నేరక
చిత్రపటము వ్రాసి చెరచినారు
బొంతచెముడు పాలు బొంగింపనేరరు
విశ్వదాభిరామ వినురవేమ

(రాళ్ళపల్లి – వేమన –పుట 65)

ఏ చిత్ర పటాన్ని చూసి వేమనగారు ఈ పద్యాన్ని చెప్పారో తెలియదు ఇందులో హేమతారక విద్య ప్రసక్తి ఉంది రసవాదం గురించి వేమనగారు చిన్నప్పుడే విని ఉంటారు గౌరన రచించిన హరిశ్చంద్ర నవ నాథ చరిత్రలు ఆయన బాల్యంలో చదువుకొనే ఉంటారు

అంకి లెరిగి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్దతనము లెన్న నేల
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుగదా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1)

ఈ పద్యాన్ని గౌరన హరిశ్చంద్ర ద్విపదంలోని పంక్తులు కొన్ని చిన్నప్పుడే చదివి తరవాత జ్ఞాపకం తెచ్చుకొని వేమనగారు చెప్పి ఉంటారు

పన్నిన చీకటి బాపి వెల్గింప
సన్నపు దీపము సాలదే తలప
చిన్నవైనను బుద్ధి బెద్దవు నీవు
మన్నించి మాన్పుము మా విచారము

(హరిశ్చంద్ర 2-790)

గౌరవ రచనలో నవనాథ చరిత్ర శైవగాథా ప్రతిపాదకం శైవ సిద్ధులయిన నవనాథుల కథలు ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉన్నాయి ఈ తొమ్మిదిమంది సిద్ధులలో సిద్ధనాగర్జునుడు ఆంధ్ర దేశంలో నివసించిన

---

30 చూ శ్రీధర వెంకటేశుల 'శాహేంద్రవిలాస' కావ్యానికి ఆచార్య వి రాఘవన్‌గారి ఉపోద్ఘాతం పుట 19

వాడు రసవాదంలో ప్రజ్ఞానిధి ఇతడు మీననాధుని శిష్యుడైన నాగార్జునుని శిష్యుడు నాగార్జుననాధుని శిష్యుణ్ణి సిద్ధనాగార్జునుడంటారు నాగార్జున నాధుడు ప్రపంచంలో ఇక్కడా అక్కడా అనక అన్నిచోట్ల తిరిగి తన పేరిట ఒకరిని—

వెలయ సిద్ధు జేసి వివిధౌషధముల
మణిమంత్ర యోగాది మర్మకర్మలను
నణిమాది సిద్ధుల నాత్మ ప్రణీత
రసవాద సార శాస్త్రంబుల దెలిపి
మసలక దేహ మే మరక నీవింక
దిరుగ బొమ్మని యంధ్ర దేశమున నతని
బరగ వీడ్కొలి (పె)

(నవనాధ–పంచమాశ్వాసం– పుట 222)

సిద్ధనాగార్జునుడు కృష్ణవేణీ తీరంలో వున్న శ్రీ పర్వతాన్ని చూసి దాని గుహలలో ప్రవేశించి మూలికలూ అవీ పరిశోధించి శిష్యులను చేర్చుకొని,

రసము లైదును నుపరసము లెన్మిదియు
బసరులు మందులు బాషాణములును
గలువంబులును చాలగా సమకూర్చి

నేర్చిన మందులన్నియు వైచి యగ్ని
గూర్చి పుటంబు గ్రక్కున బెట్టినపుడు
వెసనూరు వారును విసువక రసము
పసరులో గలిపి పాల్పడ నూరువార
లను వెంచగా మూస లమరించువారు
మొనసి క్రమ్మర బుటంబులు బెట్టువారు
కలయుగ నూదిన కనకంబు దివిసి
యెలమిమై బెనుబ్రోవు లీడ్చెడువారు
నై సంభ్రమించుచు

(నవనాధ – పంచమ - పుట 235)

శ్రీ పర్వతాన్ని బంగారు కొండ చేయడానికి ఉపక్రమించారు నవ నాధ చరిత్రలోని ఈ ప్రకరణం చదివాక చిన్నప్పుడే వేమనగారికి రస

వాదంపై ఆసక్తి జనించి ఉంటుంది పెద్దయ్యాక ఆయనా బంగారం చేయ డానికి ప్రయత్నించారు కృతకృత్యులయ్యారని చెప్పలేం నవనాథ చరిత్ర లోనే సిద్ధనాగార్జునుడిని 'శ్రీమహా విష్ణువు చంపడానికి మారువేషం వేసుకొని వచ్చాక ఆ ఇద్దరిమధ్య సుదీర్ఘచర్చ జరుగుతుంది

భావింప యోగికి బరమ యోగంబు
ధనముగా గూర్చుట తగుగాక యిట్టి
ధనములు ధనముగా తలపంగ దగునె
పసిడికై యోగంబు పసచెడి యిట్టి
గసని బొందగ నేమి గలదు ?

(నవనాథ – పంచమ – పుట 243)

కథలోని కపట పాత్రవేసిన ఈ ప్రశ్నలో కపటం ఏమీలేదు ఇందు లోని నిజాయితీ గురించి వేమనగారు ఆలోచించే ఉంటారు 'అనఘ యోగ మున దేహమునకు నిత్యతెసగునేని' అని ఆ పాత్రే ఇంకొక ప్రశ్న వేస్తుంది 'మృత్యుంజయునొకనికి తప్ప వస్యులకు నుత్పత్తి నాశనములు' అని సిద్ధనాగార్జునుడు అంటే "కాలమృత్యువు గెల్వ గారడి విద్యలీ లీల బది వేల నేరిగిన నేమి ?" (నవనాథ – పంచమ – పుట 244) అని హరి అడుగుతాడు ఈ ప్రశ్నలు వేమనగారిలో ఆలోచనలు రేపినట్టు ఉన్నాయి

సకల శాస్త్రములను బదివియు వ్రాసియు
తెలియ గలరు చావు తెలియలేరు
చావు దెలియలేని చదువు లవేలరా
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 3788)

చావు గురించి చాలా దీర్ఘంగానే వేమనగారు తర్కించుకొన్నారు

తన్నుగన్నవారు తాగన్న వారును
చచ్చు టెరిగి తాను చచ్చు టెరిగి
తెలియనీరు మాయ దీనిల్లు పాడాయ
విశ్వధాభిరామ వినురవేమ

(అకాడెమీ ప్రతి పుట 186 పద్యం 760)

నరుడు పుట్టేటప్పుడు ఏమిటి తీసుకొని వచ్చేడు పోయేటప్పుడు ఏమిటి పట్టుకుపోతాడు ? ఎక్కడనుంచి వస్తాడు ? ఎక్కడికి పోతాడు ?

ఇలాంటి ప్రశ్నలకు అన్ని దర్శనాలు సమాధానాలు ఇవ్వడానికి ప్రయత్ని స్తాయి చార్వాక దర్శనం చెప్పిన జవాబు వేమనగారికి నచ్చినట్టుంది మనిషి మరణించాక

గాలి గాలి గలిసె గగనాన గగనంబు
మన్ను మన్ను గలిసె మంట మంట
నీరు నీట గలిసి నిర్మలుండాయెరా
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ, ర 1267

ఇది చార్వాక ప్రచారకులలో ప్రథముడైన అసిత కేశకంబళుడు చెప్పినదానికి నకలు

**"The human being is built up of four elements When he dies the earthly in him returns and relapses to the earth the fluid to the water, the heat to the fire, the wind to the air, and his faculties pass into space'**

ఇది అసిత కేశకంబళుని దర్శనంలో ఒక అంశం [31] అతని కాలంలో పంచభూతాలు లేవు వేమనగారి కాలంలో ఆకాశం అందులో ఒకటయింది దానిని వేమనగారు తమ పద్యంలో చేర్చారు వేమనగారు చార్వాకులతోటి లోకాయతశాస్త్రంతోటి ప్రగాఢ పరిచయం ఏర్పరచుకొన్నారు ఆ పిమ్మ టనే వారి దర్శనానికి పరిపూర్ణత ఏర్పడిందని నా అంచనా భౌతికవాద దృష్టి లేకపోతే పరలోకం అన్న భావాన్ని మరిచి పోకపోతే ఏ దర్శనమూ ఈ సమాజ స్వభావాన్ని తెలుసుకోలేదు వేమనగారు బోలెడు పద్యాలలో పరలోకాన్ని ఖండించారు

ఇహమునందు సుఖము లింపార లేవట
పరమునందు సుఖము బడయు టెట్లు
ధనము లేకసుఖము తనకెట్లు కలుగురా
విశ్వధాభిరామ వినురవేమ

(బాలసరస్వతి పుట 76 పద్యం 275)

31 'Lokayata' అనే తమ గ్రంథంలో దేవీ ప్రసాద చట్టోపాధ్యాయుగారు రైస్ డేవిడ్స్‌గారి 'డైలాగ్స్ అఫ్ ది బుద్ధ నుండి ఉదహరించిన భాగం లో ఇదొక లేశం – పుట 510

ఈ పద్యానికి పాఠాంతరాలు కోకొల్లలు

ఇహము నందు సుఖము ఇంపారకుండిన
పరము నందు నెట్లు పడయవచ్చు
మొదట లేవి చేవ తుదనెట్లు కలుగురా
విశ్వదాభిరామ వినురవేమ

(రాళ్ళపల్లి వేమన పుట 15)

ఇహము విడిచి పలము లింపుగ గలవని
మహిని బల్కు వారి మతముకల్ల
ఇహములోన బరము నెసగుట కానరో
విశ్వదాభిరామ వినురవేమ

(బ్రౌను (1839) పుట 160 పద్యం 204)

పాఠాంతరాలు ఎలాగఉన్నా 'ధనము లేక సుఖము తనకెట్లు కలుగురా' అన్న సత్యాన్ని వేమనగారు ఈ పద్యంలో కాకపోయినా ఇతర పద్యాల్లో చెప్పారు 'కడిగి లింగముంచ కడుపెట్లు నిండురా?' (అకాడెమీ ప్రతి పుట 218 పద్యం 903) అని ప్రశ్నించారు ధనవంతులు మరీ శ్రీమంతు లెలా అవుతున్నారో, నిరుపేదలు నిరాశ పాలెందు కవుతున్నారో ఆయన తెలుసుకొన్నారు ఇలాగ తెలుసుకోలేకపోతే యాగంటి వారిలాగ వేమనగారుకూడా పాతపాటలు పాడుకొంటూ ఉండేవారు

ఓపితే పుణ్యము చేయి వోపకుంటె వూరకుండు
పాపము చేయకు యంతె పదివేలు జీవుడా ॥ఓపితే॥

తెరవాటు గొట్టితెచ్చి తెగయిచ్చే కీర్తికంటె
నొరుల నొప్పించక వుండుంటే చాలు
పరుల బాధించి సంపదలు బొందుటకంటె
ధర దున్నుకొనియెడి దరిద్రమే చాలు ॥ఓపితే॥

పరులచే నవ్వుచేసి పప్పు కూడు తినుటకంటె
దొరకు నంబలి యొక దోసెడుచాలు
పరదైవాల గొలిచి పడయు సిద్ధుల కంటె
వురిమెలో యేగంటీశ వద్ద నుంటె చాలు

(డి 2489 లో 23 వ పాట)

ఈ పాటలోని రెండో చరణంలోని తొలిరెండు పాదాలలో యాగంటి వారు చార్వాకులనే సూచిస్తున్నారు అప్పుచేసి పప్పుకూడు తినమని ఆ మతం ఆదేశిస్తున్నదని ఇతరుల నమ్మకం 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' అన్నది ఇంతకుముందే 'పుట్టించి చార్వాకులకు అంటగట్టారు చార్వాకుల సిద్ధాంతాన్ని తెలుసుకొన్నాక వేమనగారు యాగంటివారి ఉద్దేశాలపై తిరుగు బాటు చేశారు తెరవాటు కొట్టి తెచ్చినా పేదలకు సొమ్మివ్వడం మంచిదనే అభిప్రాయానికి వచ్చారు

తనదు సొమ్ము చూడ దానమియ్యగ వచ్చు
అవని దొడ్డ గా దదెవరికైన
అదురు బెదురు లేక యన్యుల సొమ్ములు
దానమిచ్చువాడు దాతవేమ

(రాళ్ళపల్లి వేమన పుట 63)

ద్రోహబుద్ధినైన దొంగరికమునైన
నటలనైన సాహసమున నైన
సంప దధికు వలన సాధించి ధనమును
బడుగునకు నొసంగ బాగు వేమ

(రాళ్లపల్లి వేమన పుట 63)

కీడు తలపెట్టయినా, ముచ్చిలించైనా, కపటం చేతనైనా తెగింపు చేతనైనా గొప్పవాడి సిరిని చేత చిక్కించుకొని నిరుపేదలకు పంచిపెట్టడం మంచిదనే విప్లవ ధోరణి దాకా వేమనగారి తత్త్వచింతన వెళ్ళిందంటే వారిపై భౌతిక వాద ప్రభావం ఎంతో తెలుస్తుంది భారత దేశంలోని ఆదిమ భౌతిక వాదమైన 'లోకాయత' శాస్త్రాన్ని ఆయన తరచి చూశారని చెప్పక తప్పదు

ఇటీవలి పరిశోధకులు 'వేమన్న కాలంలో ఆస్తిక మతాలే కాక నాస్తిక మతాలు కూడా ఉన్నాయి' అని అంగీకరిస్తూనే కాని వాటికి అంత ప్రాచుర్యం ఉన్నట్టు కనిపించదు లోకాయతులు, తాంత్రికుల గుంపులు అక్కడక్కడ మాత్రం ఉండే వారని భావిస్తున్నారు[32] ఇది కేవలం భావనే కాని ఆనాటి స్థితిగతులను చెప్పదు ఇలాగ భావించడం వేమనకాలంలోని ధార్మిక వాతావరణం గురించి మన తక్కువ తెలివిని వ్యక్తపరచడమే అవు తుంది దక్షిణ భారతంలో, అందులోనూ కర్ణాటకంలోనూ దానిని అను

32 ప్రజాకవి వేమన - డాక్టర్ గోపి పుట 240

కొన్ని రాయలసీమలోను లోకాయత శాస్త్రం ఎంత సుస్థిరంగా ఉండేదో ఈ ఉపన్యాసంలోనే చెప్పడానికి నాకు అభ్యంతరం లేదు గాని కాల విస్తర భీతిచేత ఈ విషయాలను మరో ఉపన్యాసానికి వాయిదా వేస్తున్నాను 'మన వేమన– లోకులు లోకాయతలు' అనే శీర్షికతో సవిస్తరమైన ఉపన్యాసాన్ని సంసిద్ధం చేస్తున్నాను నిజానికి వేమనగారి ఊరూనాడు మీద ఒకటి, భాషా–ఛంధస్సు మీద మరొకటి ఉపన్యాసాలు తయారు చేయాలి వాటికి తగ్గ అధారాలు చాలా సేకరించాను అయితే వేమన పద్యాల పాఠనిర్ణయం జరిగి సంశోధిత ప్రతి ఒకటి ప్రచురితమయ్యేదాకా ఎవరి పరిశోధనలూ నిండుగా వుండవు

ఏభైమూడు సంవత్సరాల క్రిందట వేమనగారి మీద ప్రప్రథమంగా సప్రమాణికమైన ఉపన్యాసాల నిచ్చిన రాళ్లప వారు "ఆంధ్ర మహాపురుషులందరితోడ వేమన్నకును యూనివర్సిటీ కుర్చీలపై సమానముగా కూర్చుండ జోటిచ్చిన ధీరులు ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ఇంక కొంత యౌదార్యము వహించి, వ్రాత ప్రతులను ప్రాత యచ్చు ప్రతులను, సేకరించి, సంప్రతించి, సవిమర్శకముగా వేమన పద్యముల నూతన ముద్రణమొకటి చేసి పుణ్యము కట్టుకొందురు గాక సామాన్య లొకరిద్దరితో అకార్యముసాధ్యము కాదు కావున నా భారము ప్రకృతము వారినే చెందియున్నది"[33] అన్నారు

ఇప్పటికి మనకు ఏడు విశ్వవిద్యాలయాలు ఉన్నాయి అనాడు శర్మగారు ఆశించిన 'సవిమర్శక సంకలనం' నేటికీ రాకపోవడం శోచనీయం అనాడు వేమనగారికి యూనివర్సిటీ కుర్చీనిచ్చిన, దీరులు ఆంధ్ర విశ్వ విద్యాలయం వారేగాని నేడు వ్యావహారిక భాషకు యూనివర్సిటీ దేవాలయ ప్రవేశం అందరికన్నా ముందుగా కలిగించిన శూరులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు వేమనగారిపై మళ్ళీ ఉపన్యాసాలు కనీసం రెండయినా ఈ నాటికి ఇప్పించిన ఉదారులు ఈ విశ్వవిద్యాలయంవారు శాస్త్రీయ పద్ధతులలో 'వేమన పద్య సర్వస్వం' సంసిద్ధం చేయించే కార్యక్రమాన్ని చేపట్టాలని నా అకాంక్ష

వేయు విధము లమర వేమన పద్యంబు<br>
లర్ధ మిచ్చు దాని నరసి నంత<br>
చూడ చూడ గలుగు బోద్యమౌ జ్ఞానంబు<br>
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3653)

ప్రజలను జ్ఞానవంతులను చేయడం ప్రాజ్ఞుల కర్తవ్యం

---

33 వేమన – రాళ్లపల్లి – పుట 21

# లోకులు - లోకాయతులు

దేవుడిమీద తిరగబడలేని వాడు లోకులను మార్చలేడు లోకులను మార్చకపోతే మూఢాచారాలు అంతరించవు మూఢనమ్మకాలున్నంత కాలం అభ్యుదయం సాధ్యంకాదు పాతదేవుడి మీద తిరగబడ్డ ప్రతి ప్రగతిశీల ప్రవక్తా కొన్నాళ్ళకు కొత్త దేవుడైపోతాడు

ఆదిలో దేవుడిమీద తిరగబడ్డవాడు సాక్షాత్తూ కృష్ణవాసుదేవుడు ఆకాలంలో ఇంద్రుడు పెద్దదేవుడు నందుడు మొదలైన గోపవృద్ధులు ఇంద్రయాగం చేయదలచారు కృష్ణుడు ఇది 'శాస్త్రీయమో, జనాచారమో' చెప్పమన్నాడు [1] మేఘవిభుడైన ఇంద్రునిమెప్పుకోసం ఈయాగం చేయాలని పెద్దలు చెప్పారు

మఖము సేయ వజ్రి మరి సంతసించును
వజ్రి సంతసింప వానకురియు
వాన గురియ గసువు వసుమతి బెరుగును
గసవు మేసి ధేను గణము బ్రతుకు

ధేనువులు బ్రతికె నేనియు
మానదు ఘనమైన పాడి మందల గలుగున్
మానుగను బాడి గలిగిన
మానవులును సురలు దనిసి మనుదురు పుత్రా

(దశమ - 1-878-879)

నందుడు అలాచెప్తే కృష్ణుడు ఇలా తత్త్వోపదేశం చేశాడు

'సత్వ రజస్తమో గుణంబు లుత్పత్తిస్థితి
లయ కారణంబులు అందు రజంబున జగంబు
జన్మించు రజోగుణ ప్రేరితంబులై మేఘంబులు
వర్షించు వర్షంబునం బ్రజావృద్ధియగు
ఇంద్రుడేమి సేయంగలవాడు' (దశమ 1-884)

---

1 మహాభాగవతము - దశమస్కంధం (అధ్యాయం 24)

ఇంద్రయాగం శాస్త్రీయంకాదని కృష్ణుడు ఖండించగలిగాడు గాని జనాచారం కాబట్టి జాతరను మార్చలేకపోయాడు కొత్తసంబరాన్ని ప్రతిపాదించాడు 'కానలు గొండలు బసులు గాదిలి వేల్పులు గొల్లవారికిన్' అని చెప్పాడు[1] 'ఇలవేల్పులుండ గొలుతురె పలువేల్పుల నెవ్విధంబు పాలశులయినన్' అని చీవాట్లుపెట్టాడు

మనమేమి యెరుగుదుము శ
క్రుని, నమరులు మునులు నతని గొలుతురుగా కి
వ్వనములు గిరులును మన చూ
చిన మేరలు వీని మానజెప్పిరె పెద్దల్

చేయరైతిరేని జేయింతు మిమునిది
బలిమినైన నన్ను వలతురేని
ప్రియము దప్పకుండ బెద్దరికంబుతో
కొండపండు వియ్యకొందు సేయ

(హరివంశం – పూర్వ 7-137)

'నేను కావాలనుకొంటే నేను చెప్పింది మంచిగా చేయండి లేకపోతే బలవంతాన చేయిస్తాను' అని బెదిరించి కృష్ణుడు కొండపండుగ చేయించాడు ఇంద్రుడికి కోపం రావడం రాళ్ళవాన కురిపించడం కృష్ణుడు చిటికెన వేలితో కొండను గొడుగులాగ ఎత్తడం, ఇంద్రుడు దిగివచ్చి కాళ్ళమీద పడడం, ఇవన్నీ పుక్కిట పుట్టిన పురాణాలయ్యాయి జనులు కృష్ణుణ్ని ఉపేంద్రుణ్ని చేశారు తర్వాత ఇంద్రుణ్ని తోసిరాజని ఉపేంద్రుణ్ణే పెద్దదేవుణ్ణి చేశారు కృష్ణుడు గీత చెప్పాడన్నారు అతడు భగవంతుడు కనుక అది భగవద్గీత అన్నారు దీన్ని శంకిస్తే కళ్లు పోతాయని నమ్మేవాళ్లు, దీన్నికళ్ల మూసుకొని మరీ నమ్ముతారు

భాగవతంలోని ఈ ఉదంతం ఒక్క విషయాన్ని మాత్రం స్పష్టపరుస్తోంది శాస్త్రీయంగానట్టి జనాచారాన్ని మార్చాలి ప్రకృతిలో సంభవించే వివిధకార్యాలకు కారణాలు చెప్పగలగడం శాస్త్రీయ దృష్టివల్లనే వస్తుంది ఈదృష్టి హేతువాదం వల్ల అలవడుతుంది భారతదేశంలో అత్యంత ప్రాచీన కాలం నుండె హేతువాదులున్నారు మనవు తనధర్మశాస్త్రంలో వీళ్ళను హైతికులు అన్నాడు

---

1 హరివంశం పూర్వభాగం 7-132

పాషండినో వికర్మస్థాన్‌బైడాల వ్రతికాచ్ఛరాన్
హైతుకాన్ ఒక వృత్తింశ్చ వాఙ్మాత్రేణాపి నార్చమేత్
(మను – 4-30)

మనువు దృష్టిలో హేతువాదులు పాషందులు, వికర్మస్థులు బిడాల వ్రతికులు శఠులు బక వృత్తికలవాళ్లు వీళ్ళను మాటవరసకైనా గౌరవించ కూడదు మనుస్మృతి రచనాకాలం క్రీ పూ 1200 నుండి క్రీ శ 150 వరకూ ఉన్న మధ్యకాలం అని వివిధ విమర్శకులు భావిస్తున్నారు 'మోనియర్ విలియమ్స్' క్రీ పూ 5వ శతాబ్దమన్నాడు కాణే పండితులు క్రీ పూ 3వ శతాబ్ది అన్నారు వివిధ ధర్మ శాస్త్రాలపై సాధికారమైన విమర్శాత్మక వివరణలు రాసిన కాణే పండితుల నిర్ణయానికి చాలా విలువ ఉంది క్రీ పూ 3వ శతాబ్దికి హేతువాదులు సుప్రసిద్ధులయ్యారని చెప్పవచ్చు

మనుస్మృతికి వ్యాఖ్యానం వ్రాసిన కుల్లూకభట్టూ మేధాతిథీ 'హైతికులు నాస్తికులైన లోకాయతికు'లే అని చెప్పారు 'హేతుశాస్త్రాన్ని ఆశ్రయించే నాస్తికులు వేదనిందకులు' అని మనువే అంతకు ముందు చెప్పాడు

యోఽవ మన్యేత్ తే మూలే హేతుశాస్త్రాశ్రయోహ్యాజః
ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకాః
(మను - 2 - 11)

లోకాయతికులను స్పష్టంగా ఆపేరుతో మనువు పేర్కొనకపోయినా అలా చేసినవాడు ఆదిలో వాత్స్యాయనుడే తన 'కామసూత్రాలు' గ్రంథంలో ఈ శాస్త్రరచన అనవసరమనే వారి వాదాలూ, దాటిలోని యుక్తులూ చూపెట్టి వారి ఆక్షేపణలకు సమాధానాలు చెప్పాడు ఆదిలో సాధారణాధికరణంలోనే నాస్తిక దర్శనాలలో చెప్పిన కారణాలను పేర్కొన్నాడు లోకాయతుల మతం గురించి విశేషాలు వివరించే సూత్రాలను రచించాడు ఆరు సూత్రాలలో 'లోకాయతికులు' చేసే వాదాన్ని సూచించాడు

1 నధర్మాంశ్చరేత్ (1-2-25)

ధర్మాలను ఆచరించకూడదు వాత్స్యాయనుడు గ్రంథాదినే 'ధర్మార్థకామేభ్యోనమః' (1-1-1) అని ధర్మం కొరకూ, అర్థం కొరకూ, కామంకొరకూ నమస్కరిస్తున్నాను అని చెప్పాడు తాను పూజించే ధర్మాన్ని లోకాయతులు అంగీకరించరు అందుకే వారి మతంలోని ధర్మాలను ఆచరించకూడదనే సూత్రాన్ని మొదట చెప్పాడు

2 ఏష్యత్ఫలత్వాత్ (1-2-26)

ధర్మాలను ఎందుకు ఆచరించకూడదంటే అవి ఏష్యత్ ఫలం కలవి కనుక అంటే వాటిఫలం ఇప్పుడు కాక ఎప్పుడో సిద్ధించేది యజ్ఞయాగాల వంటి ధర్మ సాధకకార్యాలు ఇహలోకపు వానికి సంబంధించినవి కావు ఈ జన్మలో ఫలిమిచ్చేవి కాక జన్మాంతరంలో ఫలమిచ్చేవి కనుక ధర్మాలను ఆచరించడం నిరుపయోగం ఎంత తెలివి తక్కువ వాడైనా ఇహలోకంలో ఫలవంతమైన సేద్యం మొదలైన వాటినే చేపట్టి ఫలం అనుభవిస్తాడు గాని పరలోకాన్ని ఆశించడని వ్యాఖ్యానం

3 సాంశయికత్వాచ్చ (1-2-27)

కష్టపడి ఎలాగో యజ్ఞ యాగాదులు చేసినా స్వర్గఫలం వస్తుందో, రాదో నిశ్చయంగా చెప్పలేం సందేహాస్పద–మైన ఏ పనికీ ఎవడూ డబ్బు ముడుపు పెట్టడు అందుచేత ధర్మాలు ఆచరించకూడదు

4 కోహ్యా బాలిశో హస్తగతం పరగతం కుర్యాత్ (1-2-28)

స్వహస్తాలతో ఉన్నదాన్ని ఏ తెలివితక్కువ దద్దమ్మ పరహస్తగతం చేస్తాడు? తన చేతిలోని సొమ్ము ఇంకొకడి దగ్గర సురక్షితంగా ఉండదని ఎవ్వడూ ఎలా నమ్మడో అలాగే ఇహలోక సౌఖ్యాన్ని వదులుకొని పర లోకం కోసం ఎదురు చూడడు

5. వరమద్య కపోత శ్శో్వ మయూరాత్ (1-2-29)

రేపటి నెమిలికన్నా నేటి పావురమే దొడ్డది చచ్చిపోయాక, ఒకవేళ దొరికే స్వర్గంకన్నా ఇప్పుడు బతికున్న భూలోకమే శ్రేష్ఠం పక్షులను వేటాడి చంపి మాంసం తిందామనుకొనే వాడికి ముందెప్పుడో దొరకబోయే నెమిలికన్నా ఇవాళ చిక్కే పావురమే గొప్పదని లోకులు భావిస్తారు కదా!

6 వరం సాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణ

ఇతిలౌకాయతికాః (1-2-30)

వస్తుందో రాదో తెలియని బంగారు నాణెంకన్నా, కచ్చితంగా లభించే అల్పనాణెం నయం 'ఇవాళ నా దగ్గర రూపాయి పావలా మాత్రమే ఉంది రేపు మాత్రం నాకు నూరు సవరన్లు వస్తాయి అప్పుడో సవరను నీకిస్తాను' అని ఎవడైనా అంటే నిక్కచ్చిగా తెలియని నిష్కంకన్నా అనుమానానికి తావులేని కార్షాపణాన్నే మిన్నగా, లోకులు భావిస్తారు ఇవి లౌకాయతికుల మాటలు

వాత్స్యాయన కామసూత్రాలకు యశోధరుడు వ్యాఖ్యానం రాశాడు. దీనిని జయమంగళ టీక అంటారు లోకప్రసిద్ధిగల దృష్టాంతరాలనే లోకాయతులు చూపించారని యశోధరుడు తన వ్యాఖ్యానంలో అడుగడుగునా విశదపరిచాడు

'లొకేషు ఆయతః లొకాయతంః' లోకులలో ప్రచారం గలది లోకాయతం అని నిర్వచనం 'లోకం మాత్రమే విషయముగాగల శాస్త్రము లోకాయతము లోకగాధను లోకదృష్టిని అనుసరించు దర్శనములోకాయతము' అని వివరణ వాత్స్యాయనుడు క్రీ పూ 150 ప్రాంతాలవాడని కామసూత్రాలను జయమంగళ టీకలోనూ విపులమైన ఆంధ్రవివరణతోనూ ప్రచురించిన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రగారి అభిప్రాయాం వాత్స్యాయనుడన్నది గోత్రనామమేకాని అతని అసలు పేర్లు మల్లనాగుడు ఇతడు బహుశా ఆంధ్రుడు కుంతల సాతకర్ణిని తనగ్రంథంలో ఒకచోట పేర్కొన్నాడు ఈ సాతకర్ణి సాతవాహనుడే అందుచేత వాత్స్యాయనుడు క్రీ శ 137 38 ప్రాంతాలవాడు అని భావించేవాళ్లు కూడా ఉన్నారు

పంచాగ్నులవారు 'లోకేషు ఆయతః లోకాయతః' అనే వ్యుత్పత్తిని కాక 'లోకే ఆయతంత ఇతి లోకాయతాః' లోకమునందలి వారిని యుక్తుల ద్వారా వశపరచుకొనుటకు ప్రయత్నించు శాస్త్రములు గనుక లోకాయతములు అనే వ్యుత్పత్తిని చెప్పి లోకాయతులు చార్వాక మతానుయాయులనే దార్శనిక వచనాలను ఉటంకించారు చార్వాకుడు చాలా ప్రాచీనుడు వాల్మీకి రామాయణంలో జాబాలి చెప్పిన మాటలు లోకాయత మతానివే వాల్మీకి జాబాలిని బ్రాహ్మణోత్తముడని చెప్పాడు (అయోధ్య – 108-1) జాబాలిది చార్వాకమతమని వ్యాఖ్యాతలు విశదీకరించారు వ్యాసభారతంలో చార్వాకుడు ఒక చిన్న పాత్ర శాంతిపర్వంలో హస్తినాపురానికి తిరిగి వస్తున్న ధర్మరాజును నిలబెట్టి పచ్చని లోకాన్ని పీనుగు పెంటలతో నింపి నువ్వేం బావుకొంటావని నిందిస్తాడు (38,39 అధ్యాయాలు) ఈ చార్వాకుడు బ్రాహ్మణ వేషం వేసుకొన్న రాక్షసుడనీ దుర్యోధనసఖుడని అక్కడ ఉన్న బ్రాహ్మణులే అతణ్ణి అప్పటికప్పుడు చంపేస్తారు

జాబాలీ బ్రాహ్మణుడే చార్వాకుడూ బ్రాహ్మణుడే ఈ ఇద్దరూ ఆర్ష ధర్మాన్ని ఎందుకు వ్యతిరేకించారు ? వేదాన్ని ఎందుకు తోసిపుచ్చారు ? యజ్ఞయాగాదులూ, ఆబ్దీకాలూ, మొదలైనవి ఎందుకు నిరసించారు ? చార్వాకుణ్ణి బ్రాహ్మణ వేషం వేసుకొన్న రాక్షసునిగా ఎందుకు చిత్రించారు ? ఆర్యులు రాకముందు మనదేశంలో ఒక విలక్షణమైన నాగరికత ఉండేది

దాన్ని ఆర్యులు ధ్వంసం చేశారు అనార్యులను దస్యులన్నారు కృష్ణత్వక్కులూ శిశ్నదేవులూ అని ఈసడించారు కొన్నాళ్లపోయాక దేశంలో వున్న అనార్యులందర్నీ చంపడం సాధ్యంకాదు కనుక ఆర్యులు కొంతమంది అనార్యులతో సఖ్యంచేశారు ఇలాంటి అనార్యులలో నిషాదులు పేర్కొనతగ్గ వాళ్లు కొన్ని యజ్ఞయాగాలలో నిషాదులను ఆర్యులు పాల్గొననిచ్చారు వాళ్లకు బ్రాహ్మణత్వాన్ని కూడా కొన్ని సందర్భాల్లో అంగీకరించారు బ్రాహ్మణు లలో నిషాదగోత్రం కూడా ఒకటుంది[1] ఆర్యులతో సంపర్కమున్న ఈ నిషాద బ్రాహ్మణులు తమ ప్రాచీనమతాన్నీ భౌతికవాదాన్నీ విసర్జించ లేదనుకోవాలి

నిషాదులు చేపలు పట్టడం, పడవలు నడపడం, వేటాడడం మొద లైనవి చేస్తూ జీవించేవాళ్లు (అరణ్యవాసానికి వెళ్తున్న సీతారామలక్ష్మణు లను పడవలో అద్దరికి చేర్చిన గుహుడు నిషాదుడే) చార్వాక దర్శనం లోని కొన్ని ఉపమానాలూ, ఉదాహరణలూ పక్షులను వేటాడ్డానికీ, చేపలకూ సంబంధించినవి కావడం గమనించదగ్గ విషయాలు[2] చార్వాక సిద్ధాంతం గ్రంథ రూపంలో ఎప్పుడూలేదు ప్రతిపక్షులు వివిధగ్రంథాలలో, వివిధ సంద ర్భాలలో ఉదహరించిన వాక్యాలనుబట్టే లోకాయత దర్శన స్వరూపం ఇలా ఉంటుందని తత్త్వశాస్త్ర చరిత్రకారులు ఊహించి దానిని పునర్నిర్మించారు ఆదిలో బ్రాహ్మణులే లోకాయతాన్ని ప్రబోధించారు, ప్రచారం చేశారు

ఇదంతా ఉత్తర భారతదేశంలో జరిగింది ఈ లోకాయతం దక్షిణా దికి వచ్చిందా? ఎప్పుడొచ్చింది? ఎవరు తీసుకొచ్చారు? అనే ప్రశ్నలు ఉదయించడం సహజమే అశోకుని కాలం నాటికి ఆంధ్రదేశం మగధ సామ్రాజ్యంలో ఉండేది 'యవనరాజ్యంలో తప్ప బ్రాహ్మణులూ, శ్రమణులూ లేని రాజ్యాలు లేవు' అని అశోకుడే ఒక శిలాశాసనంలో చెప్పాడు[3] ఈ శాసనం ఆంధ్రదేశంలోనే ఉంది కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో

---

1 INDIAN SOCIETY Historical Proceedings (in memory of D D Kosambi) అనే గ్రంథంలో వివేకానందరూ రాసిన From the Tribe to Untouchable అనే వ్యాసం చూడండి

2 దక్షిణాదిని శైవసంప్రదాయంలో ప్రసిద్ధులైన 63 నాయనార్లలో మొదటి వాడు అడిభర్త (అడిపత్తర్) తనకు దొరికిన మొదటి చేపను శివునికి రోజూ అర్పించేవాడు

3 అశోకుని ఎర్రగుడి శిలాశాసనములు – ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖ ప్రచురణ (1975) పుట 30

ఎర్రగుడి అనే గ్రామం ఉంది అక్కడ అశోకుడు చెక్కించిన 13 శిలాశాసనాలూ, రెండు లఘుశాసనాలూ ఉన్నాయి అశోకుని కాలంలో ఆంధ్ర దేశంలో అందునా రాయలసీమలో బ్రాహ్మణులున్నారని ఇందువల్ల తెలుస్తోంది

ఏదో ఒక వేదశాఖనో, శాస్త్రాన్నో, దర్శనాన్నో ప్రత్యేకించి అధ్యయనం చేయడం వైదికకుటుంబాల్లో పరిపాటి ఋగ్వేదుల, సామవేదల ద్వివేదుల, వేదుల అనే ఇంటిపేర్లు తెలుగు బ్రాహ్మణులలో నేటికీ ఉన్నాయి శాస్త్రాధ్యయనం తక్కిన వర్ణాల వాళ్ళకు ఆదిలో నిషేధించారు చదువు బ్రాహ్మణులకూ, సాము క్షత్రియులకూ, గుప్తవిద్యలయ్యాయి తపస్సు చేసే శూద్రులను రాజుచేత బ్రాహ్మణ్యం చంపించింది లోకాయతం ప్రాచీన దర్శనం దీనిని లోకులు ఆచరిస్తున్నా ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేసి పుత్ర పౌత్రాదులకు నేర్పడం బ్రాహ్మణుల తొలినాటి హక్కు అందుకే "ఒకప్పుడు (లోకాయతాన్ని) కొందరు బ్రాహ్మణులు అధ్యయనం చేసి ప్రచారము చేయుచుండెడివారు ఇంద్రియానుభవమునకు, తర్కమునకు, హేతువాదమునకు ప్రాముఖ్యము నిచ్చెడివారు దీనిని ఉపాసించెడివారు తదన్య బ్రాహ్మణులు వీరిని తూలనాడుచుండెడివారు" అని తత్వశాస్త్ర చరిత్రకారులు రాశారు [4] ఈ లోకాయత బ్రాహ్మణులు, ఇతర బ్రాహ్మణులతోపాటు వివిధకాలాలలో దక్షిణాదికి వచ్చి వుంటారు

పల్లవరాజ్యాన్ని స్థాపించిన వీరకూర్చవర్మ (క్రీ శ 285-310) అనేక హిరణ్య కోటిగోహల శతసహస్ర ప్రదాత' అనే బిరుదుగలవాడు సాతవాహనాహారం అనే పేరిట ఆరోజుల్లో పేర్కొన్న నేటి దత్తమండలంలోని దండకారణ్యాన్ని కొట్టించి వ్యవసాయార్హం చేయడానికి ప్రయత్నించాడు. త్రిలోచన పల్లవుడనే పేరుతో సుప్రసిద్ధుడైన నందివర్మ (క్రీ శ 485-510) శ్రీశైలపర్వతం ఆగ్నేయదిశలోని అడవులు కొట్టించి అగ్రహారాలు కట్టించాడు ఉత్తర భారతదేశంలోని అహిచ్ఛత్రపురంనుండి అనేక బ్రాహ్మణకుటుంబాలను రప్పించి వాళ్ళకా అగ్రహారాలు దానంచేశాడు [5] అడవులు కొట్టించినందుకే ఇతడికి 'ముక్కంటి కాడువెట్టి' అనే పేరు వచ్చింది ఈ త్రిలోచన పల్లవుడి విరోధి కరికాలచోళుడు దేశంలోని చాలా చోళ వంశాలకు ఇతడే మూలపురుషుడు ఇతరవిషయాలలో త్రిలోచనపల్లవు

---

4 తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వం– దర్శనములు- మతములు సంపుటి-7, పుట 68

5 Cuddaphah Inscription.- పీఠికలో నేలటూరి వారు ఈ సంగతు చెప్పారు పుటలు-11-12

డితో విరోధించినా అడవులు కొట్టించటంలో అగ్రహారాలు కట్టించడంలో కరికాలుడు అతనికేం తీసిపోడు నేలటూరి వెంకటరమణయ్యగారు కరికాలుడి గురించి ఇలాగ రాశారు

ఇతడు శైవమతాభిమాని అనేక శివాలయములు నిర్మించెను శూద్రుల అర్చకత్వమును దొలగించి బ్రాహ్మణుల నర్చకులనుజేసి వేదశాస్త్ర విహితముగ శివార్చన నడపెను జైనబౌద్ధమతముల నాశము జేసెను. జైనవసతులను, బౌద్ధవిహారములను పడగొట్టించెను బ్రాహ్మణ మతము నుద్ధరించెను దక్షిణ దేశమున ఆర్యనాగరికతను బ్రవేశపెట్టి దేశమును బర్బరాక్రాంతమును గాకుండ జేసెను ఆర్యావర్తము నుండి బ్రాహ్మణులను, బ్రాహ్మణేతరులను బిలిపించి అగ్రహారములను, భూములను ఇచ్చినారు దక్షిణాపథమున శాశ్వతముగ నుండునట్లు చేసెను అడవులను నరికించి గ్రామములను, పట్టణములను నిర్మించి వానిని వాసయోగ్యములుగ జేసెను [6]

తమిళదేశంలో హింసల పాలయినప్పుడు వివిధ మతస్తులు ఆంధ్ర దేశానికీ, కన్నడరాజ్యానికి పారిపోయి శరణుకోరడం చరిత్రలో పరిపాటే లోకాయతులకు కన్నడదేశంలో ఆశ్రయం లభించింది ఆదరణ పెరిగింది లోకాయతం కూడా ఒక ప్రాచీనశాస్త్రం కాబట్టి అది అంతరించకూడదనే సదుద్దేశంతోనే దాన్ని అధ్యయనం చేసె కుటుంబాలకు రాజులు అగ్రహారాలు ఇచ్చారు ఒకటికాదు రెండుకాదు అయిదు గ్రామలలో లోకాయత విద్యాకేంద్రాలు విలసిల్లాయి వాటి వివరాలు ఇవి

| | |
|---|---|
| 1. గుండేరి | చిత్రదుర్గం జిల్లా<br>హూళర్‌కెర తాలూకా |
| 2 బేగూరు | షిమోగా జిల్లా<br>సీకాల్ పుర తాలూకా |
| 3 బళ్లిగామ్‌వె | షిమోగా జిల్లా<br>సికార్ పుర తాలూకా |
| 4 సోమనాథపుర | కావేరీ తీరాన ఉంది |
| 5 నాగర ఖండ | షిమోగా జిల్లా |

క్రీశ 968 నుండి లోకాయతులకు సంబంధించిన శాసనాలు కన్నడ దేశంలో కనబడతాయి ఎందరో రాజపోషకులు మహారాజుపోషకులు ఈ

---

6 చరిత్రరచన - నేలటూరి వెంకటరమణయ్య (1946) పుటలు 134, 135

విద్యలను నిలబెట్టడానికి అగ్రహారాలు ఇచ్చారు క్రీ శ పదో శతాబ్దంనుంచి పదిహేనో శతాబ్దందాకా లోకాయతులు కర్నాటకంలో చాలా శక్తివంతంగా ఉన్నారని, ఇతర దార్శనికులతో కలబడి చాలా గట్టిగా వాదించే వారనీ పరిశోధకులు నిరూపించారు[7] తనకాలం నాడు లోకాయతం ప్రముఖ దర్శనం కాబట్టి మాధవ విద్యారణ్యులు తమ సర్వదర్శన సంగ్రహంలో దానిని విపులంగా వివరించవలసిన అవసరం ఏర్పడింది ఈ గ్రంథం అనన్య ప్రచారం పొందింది మాధవ విద్యారణ్యులు 1375లో శృంగేరి పీఠాధిపతులయ్యారు వారి గురువులు భారతీ తీర్థులు భాట్ట, బౌద్ధ, క్షపణక, చార్వాకాది దర్శనాలను ఓడించి అద్వైతానికి విజయం చేకూర్చారని శాసన ప్రమాణాలు ఉన్నాయి[8] భారతీతీర్థుల సన్నిధిలోనే మాదవ విద్యారణ్యులు సర్వదర్శన జ్ఞానాన్ని పొందారు

కన్నడదేశంలోనే కాక తెలుగుదేశంలో కూడా చార్వాకమతం ప్రబలంగానే ఒకనాడు ఉండేది. మల్లికార్జున పండితారాధ్యుడు వెలనాటి చోళుడి ఆస్థానంలో పరమతాలను ఖండించాడు గుంటూరుజిల్లా, తెనాలితాలూకాలో, చందనోలు ఆ వెలనాటిచోళుడి రాజధాని ఆరాజు పెట్టించిన సభలో జైనులు, బౌద్ధులు, సాంఖ్యులు, అద్వైతులు, చార్వాకులూ, లోకాయతులు మొదలైన నానా దర్శనాలవాళ్లు ఉన్నారు రాజగురువు బౌద్ధుడు ఇతణ్ణి పండితయ్య శిష్యులు హత్య చేశారు[9]

బౌద్ధులలో కూడా హేతువాదులున్నారు క్రీ శ 637 నుండి 640 దాకా ఆంధ్రదేశంలో సంచారం చేసిన యువాన్‌చ్వాంగ్ తన పర్యటనలో తెలుసుకొన్న దార్శనికుల గురించి విపులంగా రాశాడు నాగార్జున కొండ గురించి నాగార్జునుడి గురించి చెప్పాడు సిద్ధనాగార్జునిడి రసవాద శాస్త్రజ్ఞాన మహిమలు పేర్కొన్నాడు కానలనాడు చూశాక వేగినాడు వచ్చాడు దిఙ్నాగాచార్యుని కీర్తి విన్నాడు ఈ ఆచార్యుడు లోకహితార్థమై హేతువాద శాస్త్రరచన చేశాడు వేగినాడు నుండి యువాన్‌చ్వాంగ్ వెలనాడు వెళ్ళాడు ధనకటకాన్ని చూశాడు బావవివేకుడనే దార్శనికుడి గురించి విన్నాడు 'బాహ్యావేషముచేత నాతడు కపిలుని సాంఖ్యావాదివలె గన్పట్టి

---

7 Historical Notices of Lokayatas by B A SALETORE in annals of Bhandarkar Oriental Research Institute Vol. 23 (1942)

8 సాలెటోర్‌గారి పై వ్యాసం పుట 397

9 వివరాలకు సమగ్రాంధ్ర సాహిత్యం మొదటి సంపుటం పుటలు 233 నుండి చూడండి

నను హృదయమందు మాత్రము నాగార్జునుని మహాయాన సంప్రదాయము నవలంబించి యుండెను' అని చెప్పాడు [10] ధనకటకం నుండి ఆ చైనీయ యాత్రికుడు చోళదేశం వెళ్లాడు ఇది ఇప్పటి కడప కర్నూలు మండలాలని చారిత్రకులు నిర్ణయించారు [11]అక్కడ యువాన్‌చ్వాంగ్ ఉత్తరుడనే దార్మనికుడి సంగతి విన్నాడు ఇతడు షడభిజ్ఞుడు, అష్టవిమోచకుడు ఉత్తరుడికి తెలిసిన షడ్దర్శనాలలో చార్వాకం కూడా ఒకటై ఉంటుంది

యువాన్‌చ్వాంగ్ కాలంనుంచి పండితయ్యకాలందాకా ఆంధ్రదేశంలో హేతువాదులైన చార్వాకులూ లోకాయతులూ ఉండేవారని నిస్సందేహంగా చెప్పవచ్చు క్రీ శ 1300 ప్రాంతాలలో పాల్కురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్ర రచించారు కాబట్టి పధ్నాలుగో శతాబ్దంలో కూడా చార్వాకులు, లోకాయతులు ఆంధ్రదేశంలో ఉండేవారు క్రీ శ 1510 ప్రాంతాలలో శ్రీనాధుడు శ్రీహర్షుని నైషధీయ చరితను శృంగార నైషధం అనే పేరుతో ఆంధ్రీకరించాడు పదిహేడో సర్గలో శ్రీహర్షుడు 36 వ శ్లోకం నుండి 83వ శ్లోకం దాకా 48 శ్లోకాలలో వివిధ నాస్తిక దర్శనాలవాళ్ల యుక్తులను క్రోడీకరించాడు వీటనన్నిటి సారాన్నీ శ్రీనాధుడు శృంగార నైషధం సప్తమాశ్వాసంలో 64వ నెంబరు వచనం నుండి 87వ నెంబరు పద్యందాకా 24 గద్య పద్యాలలో అనువదించాడు ఈ నాస్తికులు వేదం అప్రమాణమంటారు స్వచ్ఛందమే ధర్మమంటారు,కామదేవుడే దైవమంటారు మరణమే అపవర్గం కనుక దేహం దగ్ధమయ్యాక పాపంలో ఉండదంటారు సౌఖ్యప్రదాలయిన కార్యాలను యధేచ్ఛగా ఆచరించవచ్చని చెప్తారు ఇవన్నీ హేతువాదానికి కట్టుబడ్డ యుక్తులే "(నాస్తికులు) విగ్రహపూజ నపహసించిన (యీ క్రింది) పద్యమపూర్వకమైన హేతువాదముతో గూడి వారు చెప్పినది సత్యమేమోయను భ్రాంతి కనిపించుచున్నది" అని ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు ఈ పద్యాల సారాంశాన్ని చెప్పిన తరువాత అభిప్రాయపడ్డారు [12] ఆస్తికలకు కూడా సబబుగా కనబడే దృష్టాంతరాలు చూపెట్టడంలో నాస్తికులు గట్టివాళ్లు

నైషధంలో కలిపురుషుడు వర్ణించిన తీరును శ్రీహర్షుడు కొన్ని శ్లోకాలలో వర్ణించాడు వాటిని వివిధ పద్యాలలో తెనిగించి ఒకశ్లోకంలోని

---

10 భావరాజు వేంకటకృష్ణారావు గారి 'విదేశీయాత్రికులు ప్రాచీనాంధ్ర దేశము' 1947 పుట 80

11 పై గ్రంథం పుట 94

12 యువభారతి వారి 'కావ్యలహరి' పుట 34

భావాన్ని విపులంగా సీస పద్యంలో చెప్తూ తనకాలంనాటి నాస్తికులను శ్రీనాధుడు ఇలా వివరించాడు

బౌద్ధుల బాటించు బరమ బంధులబోలె ,
జార్వాకులకు గరాంజలి ఘటించు
జైనుల బొడగన్న సంతోషమున దేలు ,
జేయని మ్రొక్కు లోకాయతులకు
వైతండికుల కభివాదనం బొనరించు ,
పాషండులకు జాల భక్తిసేయు ,
గాపాలికులకు సత్కారంబు గావించు
బరిచయించును దిగంబరుల తోడ

పాశుపత కక్ష పాలికా భస్మధూళి
పాళియుద్ధూళన క్రియా వేళయందు
గాలి వెంబడి బైరాల గళవళించు
గలియుగంబు పావక స్ఫులింగంబు లనుచు

(శృంగార నైషధం 7-127)

బౌద్ధులు, చార్వాకులు, జైనులు, లోకాయతులు, వైతండికులు, పాషండులు, కాపాలికులు, దిగంబరులు, పాశుపతులు అనే తొమ్మిది రకాల నాస్తికులను ఈపద్యంలో శ్రీనాధుడు చెప్పాడు సర్వంకష వ్యాఖ్యలో వేదము వెంకటరాయశాస్త్రిగారు సర్వదర్శన సంగ్రహంలోని శ్లోకాలు ఉదహరిస్తూ 'లోకాయత మని చార్వాక మతమునకే నామాంతరము . అటున్నను శ్రీనాధుడు భిన్నముగా వ్యవహరించుట విచారణీయము' అవిరాశారు (పుట 600) మధ్యయుగాలలో తెలుగునాట చెలామణి అయిన మతాల గురించి చాలా పరిశోధించాలి. శృంగారనైషధం తర్వాత లోకాయతమతాన్నీ చార్వాకాన్నీ పేర్కొనే తెలుగు గ్రంథం 'ప్రబోధచంద్రోదయం' అనే కావ్యం దీనిని 1480 ప్రాంతాలలో నందిమల్లయ, ఘంట సింగన అనే జంటకవులు తెనిగించారు దీనికి కృష్ణమిశ్రుడు సంస్కృతంలో రాసిన ప్రభోధచంద్రోదయం అనే నాటకం మాతృక, ఇందులో చార్వాక, బౌద్ధ, జైన సోమసిద్ధాంతులను హేయంగా అవహేళనం చేయడం జరిగింది. (దీనిని ఆధునికులు కందుకూరి వీరేశలింగంగారు, వడ్డాది సుబ్బారాయుడు గారు, ఆకొండి వ్యాసమూర్తిగారు నాటకంగానే అనువదించారు) ప్రబోధ,

చంద్రోదయంలో రోతగా చిత్రించిన సోమసిద్ధాంతానికే శృంగార నైషధాన్ని అంకితం పుచ్చుకొన్న మామిడిసింగన్న గూఢార్థదీపికగా వ్యాఖ్యానం రాశాడు [13]

తెలుగు సాహిత్యంలో చార్వాకుల ప్రసక్తి ఇతర గ్రంథాలలో కూడా లేకపోలేదు క్రీ శ 1590 ప్రాంతాలలో తంజావూరు రాజ్యంలోని మన్నారు గుడిలో పరమానందతీర్థులనే యోగి చాలా గ్రంథాలు రచించాడు శత కాలు చెప్పాడు 'ముక్తికాంతా పరిణయం' అనే యక్షగానంలో ఈ యోగి చార్వాకమతం మీద చాలా పెద్ద 'దరువు' రాశాడు ఇందులో 22 చరణా లున్నాయి ఇవి చార్వాకం గురించి వివిధ గ్రంథాలలో కనబడే శ్లోకాల సారాంశం పరమానంతీర్థులే 'వివేకచింతామణి' పేర యోగశాస్త్రం అనే గ్రంథాన్ని వచనంలో రాశాడు చార్వాకుల మతాన్ని మిగతావాటితో బాటు వివరించాడు 'ఇట్లు బహువిధంబులయిన వాదులయందు చార్వాక, జైన, బౌద్ధ, మీమాంస, సాంఖ్యులు నిరీశ్వర వాదులు' అని చెప్పారు [14]

ఈయన శతకాలు చాలాప్రచారంలో ఉండేవి ఈయన పరమహంస పరివ్రాజకుడైనాదాంభిక యోగులను నిరసించాడు

తంజావూరిలోని మన్నారుగుడిలోనే చల్లాసూరయ్య అనే ఇంకో కవి ఉన్నాడు ఈయన ప్రబోధ చంద్రోదయాన్నే వివేకవిజయం అనే యక్ష గానంగా అనువదించాడు ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన యక్షగానములు (తంజావూరు) నాల్గో సంపుటిలో ఉంది ఈకవి కడపటి రాజుల యుగంవాడు

క్రీ శ 1650 ప్రాంతాలలో ధరణిదేవుల రామయ్య 'దశావతార చరిత్రము' అనే పది ఆశ్వాసాల పద్యకావ్యాన్ని రాశాడు బౌద్ధావతారకథలో ఇరవై అయిదు పద్యాలలో నాస్తికదర్శనాల వాదాలను చెప్పాడు (నవ మాశ్వాసం 38 నుండి 62 దాకా ఉన్న పద్యాలు) కల్క్యవతార కథలో మొదట ఇరవై పద్యాలలో నాస్తికమత విజృంభణం వివరించాడు (దశమా శ్వాసంలో 4 నుండి 23 దాకా ఉన్నపద్యాలు) ధరణిదేవుల రామయ్య కావ్యం దేనికీ అనువాదం కాదు పురాణ కథలను విస్తరించి రాసిన కావ్యం నాస్తికులగురించి, కలికాల వైపరీత్యాలను గురించీ స్వయంగా తెలుసుకొన్నదే

---

13. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'శృంగార శ్రీనాథం' పుట 81

14 పరమానంద తీర్థుల 'వివేక చింతామణి' తంజావూరు సరస్వతీమహాలు ప్రచురణ - పుట 13

పద్యరూపంలో పెట్టాడు 'దశావతార చరిత్రము' రచనాకాలం క్రీ శ 1650 వేమనగారి జననకాలానికి దగ్గరలో ఉన్న సంవత్సరమే అంటే వేమనగారి కాలంనాటికి చార్వాకం ప్రచారంలో ఉన్న మతమే

వేమనగారి జీవితకాలంలోనే తంజావూరు నేలిన భోసలరాజులు ఆధ్యాత్మిక విద్యలను ఆదరించారు శాహజీ (1684-1710) 'అవైదికదర్శన సంగ్రహం' అనే పేరిట నాస్తిక దర్శనాల వివరణలు గంగాధర వాజపేయ చేత సంకలనం చేయించాడు[15] వేమనగారు కాలంచేసిన నూటయాభై సంవత్సరాలకు వారి పద్యాలు ప్రచారంలో ఉన్న ప్రాంతాలలో పర్యటనం చేసిన పరాసు పాదిరి ఆబేదుబాయ్ తన గ్రంథంలో (హిందువుల ఆచారాలు) లోకాయత శాస్త్రం గురించి నాస్తిక శాఖ గురించి రాసాడు[16] లోకాయతులు జాతిభేదాలను, మడి మైలలను పాటించరని చెప్పాడు (పుట 415) షణ్మతాలలో చార్వాక మతాన్ని పేర్కొన్నాడు (పుట 405) వేమనగారు గతించిన నూటయాభై సంవత్సరాలకు ఒక విదేశీయ మతప్రచారకుడు చార్వాకుల గురించి, లోకాయతుల గురించి తెలుసుకోగలిగాడంటే అప్పటికా దర్శనాలు ఊపిరితీస్తూనే ఉండాలి

వేమనగారి భావపరిణామాలో లోకాయత చార్వాకాలు గట్టిముద్రను వేశాయని నా నమ్మకం శ్రీనాథుని కాలంనుంచి ధరణిదేవులరామయ్య కాలందాకా తెలుగు సాహిత్యంలో కనబడుతూ వచ్చిన లోకాయత సిద్ధాంతపు పద్యాలు వేమనగారికి వాచోవిధేయం అని నిరూపించవచ్చు సంస్కృత శ్లోకాలను సైతం ఆయన సులభంగా అర్థంచేసుకొని అవలీలగా ఆంధ్రీకరించగలరు వీరశైవ ప్రభావంలోంచి క్రమంగా యోగ తాంత్రిక, జైన చార్వాక మతాల అవగాహనలోనికి వేమనగారు వచ్చారు అందుకే వారి పద్యాలలో వివిధ దర్శనాల ధోరణులు కనబడతాయి లోకాయత చార్వాక నాస్తిక తత్త్వాల సూత్రాలను వరసగా ఉదహరిస్తూ వాటి ప్రభావం వేమనగారి మీద ఎలా పనిచేసినదీ ఏ పద్యాలను చెప్పించినదీ చూద్దాం

లోకాయత మతాన్ని ఆదిలో బార్హస్పత్య మతమని కూడా పిలిచేవారు కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వార్తాదండనీతులనే బార్హస్పత్య మతంలో శాస్త్రాలుగా పరిగణిస్తారని చెప్పాడు భాసుడు తన ప్రతిమా

15 'శ్రీధర వెంకటేశుల, శాహేంద్ర విలాసం' కావ్యానికి ఆచార్య రాఘవన్ గారి ఆంగ్లపీఠిక పుట 19

16 ABBE J A DUBOIS - HINDU MANNERS etc (3rd Ed )

నాటకంలో బార్హస్పత్య అర్థశాస్త్రాన్ని ఉల్లేఖించాడు[17] లోకాయతులకు ప్రత్యేకమైన అర్థశాస్త్ర అవగాహన ఉంది వార్త అంటే ఉనికి, వృత్తాంతం, సమాచారం, జీవిక, వృత్తి, వాణిజ్యం, సేద్యము, కృషి, అనే అర్థాలు ఉన్నాయి ఆన్వీక్షకి మొదలైన విద్యలలో వార్త ఒకటి, దీనివల్ల లాభా లాభాలు తెలుసుకొనవచ్చు, ఆదికాలంలో వార్త అంటే సేద్యం, కృషి, వాణిజ్య అనే అర్థాలే వర్తించేవనుకోవచ్చు కౌటిల్యుడు కూడా 'వ్యవసాయము, పశుపాలనము వాణిజ్యము' కలిసి వార్త అనిపించుకొనును అన్నాడు వీటి సాధనమున ధాన్యము, పశువులు, హిరణ్యము, వన్యపదార్థములు, విష్టి (కూలి జనం) లభించగలవు' అని చెప్పాడు (1 4-7-1) ప్రబోధ చంద్రోదయం నాటకంలో చార్వాకుడు ప్రవేశిస్తూనే 'వత్స ! జానాసి దండనీతిరేవవిద్యా, అత్త్రైవ వార్తాంతర్భవతి' అని శిష్యునితో చెప్తాడు 'ఒరే అబ్బాయి , దండనీతే విద్య అనీ, వార్త దాని అంతర్భూతమనీ నీకుతెలుసు' అని భావం ఈ మాటలను నందిఘంటకవులు ఇలా తెనిగించారు

'వత్సా ! ప్రత్యక్షాప్రత్యక్షసలమూలంబైన కృషి గోరక్షణాది
సహిత దండనీతియె మంచి విద్యయని (ప్రబోధ -2 - 34)

ఈమాటలనే చల్లాసూరయ్య తన యక్షగానంలో ఇలా చెప్పాడు

వినువత్స ! ప్రత్యక్ష వేద్యైక ఫలము
లనదగు గోరక్షణాదుల దెలుపు
దండనీతియె విద్య——— (వివేకవిజయం - పుట 82)

వేమనగారు కూడా వార్త అనేమాట కృషి అనే అర్థంలో వాడారు

వార్తలోని వార్త వసుమతీశుని జేయు
వార్తలోని వార్త వశ్యజేయు
వార్తలోని వార్త వరకవి జేయురా
విశ్వదాభిరామ వినురవేమ (త్రిపురనేని– పుట 113)

వార్తయందు జగము వర్తించు చున్నది
అదియు లేని నాడె అవని పతులు
అంత్యకాల మగ్నులగుచు నుందురుగాన
వార్త నిర్వహింప వలయు వేమ

(వేమన సూక్తి రత్నాకరం – 3470)

---

17 తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వం – ఏడవ సంపుటి 71.

పైరు నిడిన వాని పలమదే సపలంబు
పైరు నిడని వాడు ఫలము గనునె
పైరు నిడిన వాడు బహుసౌఖ్య వంతుడౌ
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2613)

మనం 'ఎకానమీ' అనే పదాన్ని ఇప్పుడు ఏ అర్థంలో వాడుతున్నామో ఆ అర్థంలోనే 'వార్త' అన్నపదాన్ని పూర్వులు వాడేవారు 'అర్థసాధన కాలంలో అందరూ లోకాయతులే' అని బృహస్పతి చెప్పాడు [18] ఎకానమీ దెబ్బతింటే రాజూ ఉండడు రాజ్యమూ ఉండదు లోకాయతులు అరాచక వాదులు కారు కొన్ని నియమాలకు కట్టుబడిన సామాజిక వ్యవస్థలో కులానికీ, గ్రామానికీ, నాడుకీ, దేశానికీ ఒకపెద్ద అవసరం 'లోకసిద్ధో భవే ద్రాజాపరేశో నాపరః స్మృతః' అని చార్వాకమతం చెప్తుంది "లోకసిద్ధ రాజు శాసనమే ఈశ్వర శాసనముగా తలచి దానిని పాటింపవలెనని, తత్తత్కాల దేశములందు ప్రచారమందున్న న్యాయవిధులను పాటించుటే ధర్మమని (లోకాయతుల) అభిమతము రాజులేదా శాసనకర్త నిర్మించు విధులే ధర్మము అవి అపౌరుషేయములో, నిత్యములో కావు ఇట్లు రాజనియమ బద్ధమగు సౌఖ్యమును, అర్థకామములను సాధింపుమని లోకాయతము బోధించినది' అని దార్శనిక చరిత్రకారులు రాశారు [19]

ధర్మమరసి పూని ధర్మరాజాదులు
నిర్మలంపు ప్రౌఢి నిలుపు కొనిరి
ధర్మమే నృపులకు తారక యోగంబు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2133)

రాజు ధర్మాన్ని రక్షించాలి ధర్మమంటే లోకధర్మం యుగధర్మం. ధర్మసూక్ష్మాలు తెలుసుకొనడం చాలా అవసరం

ధార్మికునకుగాని ధర్మంబు కనరాదు
కష్ట జీవికెట్లు కాన బడును
నీరు చొరమి లోతు నిజముగా తెలియదు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర. 2138)

---

[18] తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం ఏడవ సంపుటం పుట - 72,
[19] తెలుగు భాషా సమితివారి విజ్ఞాన ఏడవ సంపుట పుట 77

ఉపనిషత్తుల కాలంలో రాజులు చాలామంది తత్త్వచింతన చేశారు బ్రహ్మవిదులయ్యారు యోగాలలో రాజయోగం గొప్పదన్నారు వేమనగారు రాజయోగాన్ని ఇలా నిర్వచించారు

దానధర్మములును దయయు సత్యము నీతి
వినయధైర్యధుర్య వితరణములు
రాజుపాలిటికివి రాజయోగంబులు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2016)

ఆదిమకాలంలో లోకాయతమతం పుట్టినప్పుడు రాజులు బాగానే ఉండేవారు తరవాత రాచరికాలలో రకరకాల అవలక్షణాలు, అవినీతులు, దుర్మార్గాలూ ప్రవేశించాయి రాజనీతి శాస్త్రంలో వీలైనంతవరకు ధర్మాచరణ చేయాలని చెప్తూనే రాజ్యకాంక్షతో, అర్థార్జనకోసం, శత్రువిజయం కోసం, సత్యాన్ని, అహింసనూ అంటిపెట్టుకోనక్కర్లేదు అన్నారు ఈప్సితం నెరవేరాక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోమన్నారు యజ్ఞాలలో దానాలు ఇస్తే ఎన్నిపాపాలైనా కడుక్కొని పోతాయట యజ్ఞయాగాదులను చార్వాకులు చాలా దుయ్యబట్టారు రాజ్యకాంక్షకోసం అబద్ధమాడడం వేమనగారు సహించలేరు

కులము నీరుజేసి గురువును వధియింప
పొసగ నేనుగంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేప విత్తయా
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 1139)

ధర్మాన్ని నియతి అంటారు 'నృపతిలేక భూమి నియతి కాదు' అని వేమనగారు చెప్పారు 'ఆజ్ఞలేనిరాజు అడుముండ' అన్నారు రాజాజ్ఞ శాసనం రాజానుమతమే ధర్మం అని లోకాయతులు విశ్వసిస్తారు కాబట్టి ఈ నాస్తికులను ఈసడించడానికి ఆస్తికులు రాజానుమతం ధర్మం అన్న సూత్రాన్ని వక్రీకరించారు శ్రీహర్షుడు ఇది ఒక శ్లోకంలో చెప్పాడు (17-44) దానిని శ్రీనాథుడు ఇలా అనువదించాడు

రాజానుమతము ధర్మము
రాజునిశాకరుడు, మీకు బ్రాహ్మణులారా!
రాజుప్రవర్తించిన పే
రోజన గురు తల్పగమన ముచితముమీకున్

(శృంగారనైషధం -7-68)

'రాజు' అనే మాటకుండే నానార్థాలపైన చమత్కరించడమే కాని ఈ పద్యంలో హేతువాదంలేదు చార్వాకులు పురుషార్థాలయిన అర్థకామా లకు రెండింటిపై ప్రాధాన్యమిస్తారు వాళ్ళను వావివరసలు లేనివాళ్ళగా, నీతివిహీనులుగా చిత్రించడమే ఆస్తికులకు ఒకనాడు పని

అంగనాలింగనా జ్జన్య సుఖమేవ పుమర్థతా
కంటకాది వ్యథాజన్యం దుఃఖం నిరయ ఉచ్యతే

ఇది లోకాయతుల మతమని దర్శన సంగ్రహకారులు చెప్పారు స్త్రీల ఆలింగనము వలన కలిగిన సుఖమే పురుషార్థం భౌతిక కారణాలవల్ల పుట్టిన దుఃఖమే నరకమని చెప్పబడును అని లోకాయతులన్నారు లోక వ్యాపారం సక్రమంగా సాగాలంటే కామాన్ని లోకులు ఆచరించాలి తప్పదు

కామికానివాడు కవిగాడు రవిగాడు
కామిగాక మోక్షకామిగాడు
కామియైనవాడు కవియౌను రవియౌను
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1058)

కామి అనే పదానికి కాముకుడు, మిక్కిలి మరులు గలవాడు, కోరిక గలవాడు, స్త్రీకి వశుడగుమగడు అనే అర్థాలున్నాయి వేమనగారు ప్రబోధిం చేది సంసారయోగం కనుక భార్యకు వశవర్తి అయిన మగడు అనే అర్థమే ఇక్కడ పొసగుతుంది కామికాని వాడు కవికాలేడు కవిఅంటే కవిత్వమల్లే వాడు పండితుడు అనే అర్థాలున్నాయి కామికానివాడు పండితుడుకాడు అంటే మూర్ఖుడన్నమాట కామికానివాడు రసికుడు కాలేడు తాను వెలుగు లీనలేడు కామియైన సంసారయోగికి జీవనపాండిత్య మబ్బుతుంది కర్మ సాక్షియైన రవిలాగ లోకవ్యాపారాలను వీక్షించే నేర్పరికాగలడు తాను వెలుగుతూ ఇతరులపై కాంతులు జల్లగలడు కామికానివాడు మోక్షమార్గం వైపు పయనించలేడు లోకాయతుల దృష్టిలో అర్థకామాలు రెండే పురుషా ర్థాలు వాత్స్యాయనుడి లెక్కప్రకారం త్రివర్గమే ఉండేది కామశాస్త్రం మొట్టమొదటి సూత్రంగా 'ధర్మార్థ కామేభ్యో నమః' అని మూడింటికే నమ స్కారం చేశాడు వేమనగారి కాలానికి ధర్మార్థకామ మోక్షాలు అనే నాలుగు పురుషార్థాలు ప్రచారంలో ఉండేవి వేమనగారి దృష్టిలో మోక్షమంటే ఏమిటో తరువాత చూద్దాం చార్వాకుల మతంలో పంచభూతాలకు బదులు నాలుగే ఉండేవి వాటివల్లనే జగత్తు జనిస్తుంది

అత్ర చత్వారి భూతాని భూమి వార్యనిలానలాః
చతుర్భ్యః ఖలు భూతేభ్య శ్చైతన్య ముపజాయతే

'భూమి, నీరు, అగ్ని, వాయువు ఈ నాలుగే భూతాలు వీటివల్లనే చైతన్యం కలుగుతుంది' అని చార్వాకులు చెప్తారు ఉత్తరోత్తరా ఆకాశాన్ని **కూడా** ఈ నాలుగు భూతాలలో దార్శనికులు కలిపారు వేమనగారి కాలానికి అవి ప్రచారంలో ఉన్నాయి ప్రపంచం పాంచభౌతికమని వేమనగారు విశ్వసించారు

పంచభూతములను బరగనింద్రియముల
సంచరించినపుడు జగముగలుగు
సంచరింపకున్న జగమెట్టు కలుగురా
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 2335)

నాలుగు భూతాలవల్ల నరుని దేహం ఏర్పడుతుంది వాటివల్లనే చైతన్య మేర్పడుతుంది తేనె, బెల్లం మొదలైన వస్తువులకు ప్రకృతి అవస్థలో కైపునిచ్చే శక్తిలేదు మత్తు పదార్థాలను తయారుచేసే ఓషధిని 'కిణ్వ' అని పిలిచేవారు కిణ్వాది మాదక ద్రవ్యాలవల్ల మదశక్తి ఎలా పుడుతుందో చైతన్యం కూడా అలాగే దేహంలో చతుర్భూతాల సంయోగంవల్ల పుడుతుంది 'తచ్చైతన్య విశిష్ట దేహ ఏవ ఆత్మ' అని లోకాయతులు చాటి చెప్తారు దేహాన్ని మించిన ఆత్మలేదంటారు

దేవుడనగవేరె దేశమందున్నాడె
దేహితోడకూడి దేహమందు [20]
వాహనంబు నెక్కి వడి లోలుతున్నాడు
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 2050)

దేహాన్ని మించిన ఆత్మలేదని వేమనగారు కూడా విశ్వసిస్తారు

దేహమూల మందు దేహిదేవుడటంచు
తెలిసి యున్న బుధులు తీర్థయాత్ర
లరయ బోరు జగతినాత్మ తామైయుండి
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2071)

---

20 ఈ పద్యంలో రెండవపాదానికి చాలా పాఠాంతరాలున్నాయి - బ్రౌను ప్రతులలో 'దేవితోడ అనే పాఠం ఉంది

చార్వాకుల మతం ప్రకారం 'దేహచ్ఛేదో మోక్షః' దేహవినాశమే మోక్షం మనుష్యుడు మరణించినప్పుడు పాంచభౌతికమైన అతనిదేహంలోని భూతాలు విశ్వంలోని భూతాలతో కలిసిపోతాయి

గాలిగాలి గలిసె గగనంబు గగనంబు
మన్ను మన్ను గలిసె మంట మంట
నీరునీట గలిసె నిర్మలంబై యుండె
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1267)

చార్వాకులు బతికినంతకాలం సుఖంగా బతకమంటారు కంటికి కనిపించని మృత్యువు నెరిగినవాడెవ్వరూ లేరు భస్మమైపోయిన ఈ దేహం తిరిగి రాదు అని చెప్తారు పరలోకంలేదు

యదిగచ్ఛేత్ పరలోకం దేహాదేషవినిర్గతః
కస్యాద్భూయో నచాయాతి బంధుస్నేహసమాకులః

అని చార్వాకులుప్రశ్నిస్తారు దేహముకంటె అతిరిక్తమగు ఆత్మదేహం నుండి వెడలి పరలోకమునకు పోతే బంధుస్నేహ సమాకులమైన ఆత్మ ఎందుకు తిరిగిరాదు? అని నిలదీస్తున్నారు వేమనగారు కూడా పరలోకం లేదని చాలా పద్యాలలో చెప్పారు

ఇహమునందు సుఖమె యింపారలేదట
పరమునందు సుఖము బడయుడెట్లు?
మొదలు చేవలేక తుదనెట్లు కల్గురా
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 435)

ఇది చార్వాక సిద్ధాంతం దీనినే బౌద్ధమత సిద్ధాంతంగా ధరణిదేవుల రామయ్య దశావతార చరిత్రలో బుద్ధునినోట చెప్పించాడు

మొదటికి నిహమే లేదట
పిదపం బరమెట్లు కలుగు బేలుతనము గా
కిది మతము కాదు నామత
మిది గైకొను డిహపరంబు లిచటనె కల్గున్
(దశావతార – 9-60)

బౌద్ధులు పరలోకాన్ని విశ్వసిస్తారు జైనులు జన్మ పరంపరను నమ్ముతారు ఈ రెండింటిని చార్వాకులు ఒప్పుకోరు వివిధ నాస్తిక దర్శ

నాలలోని భావాలను కలగాపులగం చేసి మనవాళ్ళు గ్రంథాల కెక్కించారు ధరణిదేవుల రామయ్య చాలా చార్వాక సూత్రాలను బుద్ధుని మాటలుగా రాశాడు పరలోకముందనే వీరి మాటలు అబద్ధాలని వేమనగారు నొక్కి చెప్తున్నారు

ఇహము విడచి పలము లింపుగ గలవని
మహిని బల్కు వారి మతము కల్ల
యిహము లోని పరము నెసగుట గానరో
విశ్వధాభిరామ వినురవేమ (వే సూ ర 437)

చార్వాకుల లాగే వేమనగారు కూడా ఇహలోకాన్నే నమ్ముతారు కాబట్టి ఇహలోకంలో సుఖమయ జీవితం ఎలా గడపాలో వివరిస్తూ చాలా పద్యాలు చెప్పారు వైదిక కర్మలను, విప్రాదికృతనూ ఖండించారు సున్నితమైన హాస్యంతో కొన్ని పద్యాలు చెప్పారు శూల్లాల్లాంటి మాటలతో ఇంకొన్ని పద్యాలు చెప్పారు మూఢాచారాల మురికి దట్టంగా పేరుకొన్నప్పుడు గట్టిగా రేవు పెట్టాలి–

చాకి కోకలుదికి చీకాకు పడచేసి
మైలతీసి లెస్స మడిచినట్లు
బుద్ధిచెప్పువాడు గ్రుద్దినమేలయా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1502)

సంఘంలో ఉన్న కుళ్ళును కడగడం సంస్కర్తల పని అంధ విశ్వాసాలు, అర్థంలేని ఆచారాలూ, అమాయకులమీదనే గట్టిగా పని చేస్తాయి పనికిమాలిన కర్మకాండలను ప్రజలచేత చేయించి వాటివల్ల వచ్చే సొమ్ముమీద కొందరు ఒతుకుతారు సంఘానికి ఉపయోగపడని ఈ సంప్రదాయాలను సంస్కర్తలు ఖండించాలి

తతశ్చ జీవనో పాయో బ్రాహ్మణై ర్విహితస్త్విహ
మృతానాం ప్రేతకార్యాణి నత్వన్యద్విద్యతేకచిత్

'మనుష్యులు మరణించిన తరవాత తద్దినాలు మొదలైన కర్మలు బ్రాహ్మణులు తమ జీవనోపాధి కోసం సృషించారు అంతేకాని అంతకుమించి వీటివల్ల ఎంతమాత్రం ప్రయోజనం లేదు' అని లోకాయతులు స్పష్టంగా చెప్పారు వేమనగారు చాలా పద్యాలలో ఈ దురాచారాలను దుయ్యబట్టారు

ఆలి రంకు తెలుప నఖిల యజ్ఞంబులు
తల్లి రంకు తెలుప తద్దినములు
కాని తెరగు కర్మ కాండ కల్పితమాయె
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 299)

పిండములను జేసి పితరుల తలపోసి
కాకులకును పెట్టు గాడ్డెలార
పియ్యితినెడి కాకి పితరు డెట్లాయరా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2527)

బ్రాహ్మణులకును బెట్ట ఫలము కద్దందురు
కుక్కలకును బెట్ట కొదువ యేమి
ఇందునందు శివుడె యేకమై యుండును
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2809)

ఉదాహరణలు ఇలాంటివి చాలా ఇవ్వవచ్చు కానీ అన్నింటిలోనూ భావం ఒకటే పురోహితుల జీవనంకోసమే ఈ కర్మలన్నీ పుట్టాయి చార్వాకులు చెప్పిన ఈ సంగతినే వేమనగారు చాటారు లోకాయత శాస్త్రమంటూ ఏదీ గ్రంథరూపంలో లేదు లోకాయతాన్ని ఖండించే ఇతర మతాలవాళ్ళు ఉటంకించిన వాటన్నిటినీ క్రోడీకరించి ఈ మత స్వరూపం ఇదీ అని దార్శనిక చరిత్రకారులు స్పష్టపర్చగలిగారు

మాధవవిద్యారణ్యులు సర్వధర్మన సంగ్రహంలో లోకాయతుల గురించి విపులంగానే చెప్పారు హరిభద్రసూరి 'షడ్దర్శన సముచ్చయం' అనే గ్రంథంలోకూడా చార్వాకమతం గురించి వివరించారు దీనికి మణిభద్రసూరి టీక రాశాడు అందులో ఆషాఢభూతులు అమాయకులను ఎలా వంచించి లోబరుచుకొంటారో చార్వాక మతానుసారం చెప్పాడు పరలోకంలో సౌఖ్యాలు లభిస్తాయనే ఆశచూపెట్టి వెర్రిప్రజలను ఆకట్టుకొంటారు 'ఏది తినాలో, ఏది తినకూడదో, ఎక్కడికి వెళ్ళాలో, ఎక్కడికి వెళ్ళకూడదో, ఏదిపోతో, ఏదిగ్రహించతగ్గదో తెలియని ధర్మసంకటాల్లో పడేసి ధార్మికంగా ఒక పిచ్చి చీకటిని పుట్టిస్తారు స్వర్గం అన్నది ప్రత్యక్ష ప్రమాణం వల్ల తెలియదు అందుచేత ఈ మోసగాళ్లు ఏదో అనుమాన ప్రమాణాన్ని

గిట్టిగా చూపెడతారు పిచ్చిప్రజలు నమ్మేస్తారు కాబట్టి ప్రత్యక్షమే మూలప్రమాణం" అని చార్వాకులు చెప్తారని మణిభద్రుడు సర్వదర్శన సముచ్చయం టీకలో చెప్పాడు

తినికూర్చొనే పాలక వర్గాలకు తేరగా పనిచేసే శ్రామికులు ఎప్పుడూ అవసరమే అలా పాటుపడేవాళ్ళను ఎప్పుడూ దాస్యంలో ఉంచడానికి మతం ఒక పెద్ద సాధనం "భావవాదం, మతం ఇహలోక కష్టాలను మరపించి, శ్రమ జీవులపై నల్లమందులా పనిచేసి వాళ్ళను చిరదాస్యంలో బానిసలుగా ఉంచి ధనిక ధూర్తుల దాసులను చేస్తాయి" అని శాస్త్రీయ సామ్యవాద దేశికుడు కార్ల్‌మార్క్స్ చెప్పిన మాటలను ఆనాడే చార్వాకులు చెప్పడం గమనార్హ మని దార్శనిక చరిత్రకారులు హెచ్చరిస్తున్నారు [18]

ధర్మచ్ఛద్మధూర్తులు, పరవంచన ప్రవణులు' అని చార్వాకులు పేర్కొన్నవారిని వేమనగారు 'దొరకోట సన్యాసులు' అనే చక్కటి జాతీయ మైన పలుకుబడితో పిలుస్తారు

బ్రతుకు తెరువులేని బడుగులందరు పెద్ద
యోగివరుల మంచు సాగిరాగ
బండ వాండ్రు ముందు దండంబు లిడుదురు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2773)

మణిభద్రుడు 'సర్వదర్శన సముచ్చయం' టీకలో వాడిన 'ముగ్ధజనులు అనే మాటను ఇక్కడ 'బండవాండ్రు' అని వేమనగారు వాడారు 'ముగ్ధము అనేపదానికి వివేకము లేనిది, మూఢము పొరపడినది అనే అర్థాలు కూడా ఉన్నాయి బండవాండ్రు అంటే అవివేకులు వీళ్ళను 'మొప్పెలు' అనే జాను తెనుగుమాటతో కూడా వేమనగారు పేర్కొన్నారు

గుడులు దేవతలని గుర్తులు గావించ్రు
ముష్టి బాపలనుచు మూలనేల
మొప్పెలకును దారి జెప్పిన ప్రాజ్ఞత
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1281)

ప్రజల చిచ్చం మీద బతికే బాపనయ్యలు గుళ్ళనీ దేవతలనీ గుర్తులుగా పెట్టారని సణిగితే లాభంలేదు అజ్ఞానులకు దారి చూపడమే

18 తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం- ఏడవ సంపుటి -పుట. 74

ప్రాజ్ఞత నోరులేనివాళ్ళకు చెప్పేది చెవినిల్లు కట్టుకొని చెప్పాలి ఎవరు నోరులేనివాళ్లు?

ఒరుల కొరకు భూమి నొరచెడు వారు
అవని పతికి వశ్యులైన వారు
పాలవంటివారు పన్ను బెట్టెడివారు
వాక్కెరుగరు కాపువారు వేమ

(వే సూ ర 812)

వేమనగారి దృష్టిలో కాపువారు నోరులేనివాళ్ళు పూర్వం నాల్గవజాతి వారందరినీ కాపులని పిలిచేవారు మన ప్రబంధాలలో కవులు నాలుగు జాతుల వారినీ పురవర్ణనలో వర్ణించాలి కృష్ణదేవరాయలవారూ, రామకృష్ణుడూ శూద్రజాతి వర్ణనలో వారిని కాపులనే పేర్కొన్నారు కాపుల ముఖ్యవృత్తి వ్యవసాయం ఒకనాడు రెడ్డి అన్నమాట కూడా సేద్యగాడికి పర్యాయపదమే భూస్వామ్య వ్యవస్థలో ఇంకొకరి కోసం భూమిని దున్నేవారు భూస్వామికి వశ్యులైన వ్యవసాయదారులే పంటను నిజంగా ఉత్పత్తి చేసేవాళ్లు ఈ పన్నులు పెట్టే ప్రజలు పాలవంటివారు (పన్నులెగేసేవాళ్లు ప్రబల సంపన్నులనీ వాళ్లజోలికి ప్రభుత్వాలు వెళ్లలేవనీ ఇవాళమనకు ప్రత్యక్షంగా తార్కాణాలు కనబడుతున్నాయి) వేమనగారి దృష్టిలో పాలవంటి కులము బ్రహ్మమే

పాలు పెరుగు వెన్న పాయసాన్నము నేయి
జున్ను లెన్ని యైన జూడపాలె
పాలవంటి కులము బ్రహ్మంబు గానరో
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2514)

పాలవంటి కులంలోని వాళ్ళే పన్నులు పెడతారు పన్నులమీదనే ప్రభువులూ, ప్రభుత్వాలు బతుకుతారు పన్నులనే బాధలంటారు పల్లవుల రాజ్యకాలంలో పన్నులగురించి వేలటూరి వెంకటరమణయ్యగారు ఏమంటున్నారో వినండి

"(ఈ)కాలమున జనులెంత సుఖమనుభవించిరో తెలియదు అయినను వారిపై విధింపబడిన పన్నులను జూడ వారు విశేష సుఖమనుభవించిరని తలంచుటకవకాశము లేదు పన్నులను రాజునకిచ్చుటయేగాక రాజభృత్యులగు నధికారులకు పాలుమజ్జిగలను సరఫరా చేయవలసి యుండెను ఉప్పు

పంచదారల మీది పన్నును సర్కారునకు చెల్లింపవలసియుండెను అంజీ పనులధికారుల ఇష్టప్రకారము చేయవలసియుండెను అధికారులు గ్రామస్థుల కడనుండి పచ్చిక, కలప, పశువులు, పండ్లు, పుష్పములను గొనుటయవారమై యుండెను ఇట్లు జనులు సర్కారువారి కీయవలసిన పన్నులకుగాని చేయ వలసిన చాకిరులకుగాని 'బాధ' లనిపేరు ఇటువంటి బాధలు పదునెనిమిది. వీని యందొక్కటి ప్రజలనుపద్రవించునట్లు తోచెడి సంచరింతల (సిపాయీల) వల్లబాధ విశేషముగనుండెడిది వీరిచ్చవచ్చినట్లు రాజ్యమునందంతటను సంచరించుచు జనులను బాధించెడివారు "[19]

పన్నుపెట్టేవారే నిజంగా బాధితులు అభ్యుదయ దృక్పథం గలవాళ్లు ఏయుగంలోనైనా శ్రామిక పక్షపాతులే వేమనగారూ అంతే

కాపుకులజులెంత కర్మలైననుగాని
పాపరాశికొంత పరిశిపోవు
వివరమెరుగనట్టి వెర్రిజీవులుగాన
విశ్వధాభిరామ వినురవేమ (వేదునూరి - 1296)

కర్మి అంటే పనిచేసేవాడు అందులోనూ ఫలాన్ని ఆశించి పనిచేసే వాడని అర్థం ఇవాళ ఈ అర్థంలో కార్మికుడన్న పదాన్నే వాడుతున్నాం కాపులు ఎంతకాయకష్టం చేసి పండించినా ఆ పంటలో కొంత పరిశి పోతుంది అంటే తగ్గిపోతుంది ఎందుకంటే పాటుపడేవాళ్ళు వివరమెరుగని వెర్రిజీవులు కనుక పండించే రైతులతోబాటు పంచాణం వారుకూడా గ్రామీణ ఆర్థికవ్యవస్థలో వస్తూత్పత్తి చేసేవారే వీళ్లు తమ కులవిద్యలు సమాజశ్రేయస్సుకు వినియోగిస్తారు వీళ్ళందరినీ హిందూమతం చతుర్థ కులంలో 'దయదలిచి' ఉండనిస్తూంది అయితే బ్రాహ్మణభక్తి ఉన్నంత కాలమే ఉండనిస్తుంది

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమ దైవతం

'ఈ జగత్తు అంతా దైవాధీనం, ఆ దైవం మంత్రాధీనం, ఆ మంత్రం బ్రాహ్మణుల అధీనం కాబట్టి బ్రాహ్మణులే నాకు దైవం' అని దేవుడి చేతనే చెప్పించారు దేవుడంతటి వాడినే తక్కువవాడిగా చూసే

---

19 నేలటూరి వెంకట రమణయ్యగారి చరిత్రరచన ఒకటవ భాగం వేదం వేంకటరాయ శాస్త్రీ అండ్ బ్రదర్స్‌వారి ప్రచురణ పుటలు (1948)99-100.

పురోహిత వర్గం ఇతర వర్గాలను ఖాతరు చేస్తుందా! 'పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం' అని భగవద్గీతలో అనిపించారు (17-44) సేవ చేయడం తప్ప శూద్రులకు మరే హక్కు లేదు శూద్రులను బుద్ధిమంతులను చేయాలంటే వాళ్ళని బాగా తన్నాలి

దుర్జనం కాంచనం భేరీం దుష్ట స్త్రీం దుష్టవాహనం
ఇక్షు ఖండాన్ తిలాన్ శూద్రాన్ మర్ద యేద్గుణ వృద్ధయే

చెడ్డవాడినీ, బంగారాన్నీ, ఢంకాని, చెడ్డస్త్రీని, చెడ్డగుర్రాన్నీ, చెరుకు ముక్కలనూ, శూద్రులను గుణవృద్ధికోసం మర్దించి తీరాలి అగ్రవర్ణాలు చెప్పే ఈ నీతివాక్యాలను వేదవాక్యాలుగా స్వీకరిస్తేనే వర్ణవ్యవస్థలలో శూద్రులను ఉండనిస్తారు 'వేదాక్షర విచారేణ శూద్రశ్చండాలతాం వ్రజేత్' అనికూడా శాసించారు వేదాక్షరాలను విమర్శిస్తే శూద్రుడు చండాలతుల్యుడవుతాడట అంటే వెలివాడలో పంచములతో ఉండాలట

చతుర్థకులజులు సాంఘికంగా పైకివెళ్ళడమే మనదేశచరిత్రలో ఎక్కువగా కనబడుతుంది వర్ణాశ్రమధర్మాలను సిద్ధాంతరీత్యా తెలుగువాళ్లు దిగుమతి చేసుకొన్నా శిఖరాగ్రంలో బాపనయ్యలు అట్టడుగున పంచములూ తప్ప మధ్యనున్న కులాలలో సాంఘికంగా ఉన్నతచలనం కొన్ని సందర్భాలలో కనబడుతుంది వర్ణవ్యవస్థను మార్చలేనప్పుడు దానిలోనే ఉంటూ అంతస్తును పెంచుకొందికి అందరూ ప్రయత్నిస్తారు ఇది అనాదిగా హిందూ సంఘంలో జరుగుతున్నదే రాచవారితోపాటు వెలమవారు, కమ్మవారు, రెడ్లశాఖలు మండలాధిపతులు కావడం, మహారాజులుకావడం తెలుగు చరిత్రలో అందరికీ విశదమైన విషయమే ప్రాచీన కాలంలో ఉత్తరభారత దేశంలోని 'సోషల్‌మొబిలిటీ' గురించి రోమిలా థాపర్ చేసిన పరిశోధన వంటిది మధ్యయుగాల తెలుగుదేశంలోని సాంఘికచలనం గురించి ఎవరైనా చేస్తే బాగుండును [20]

చతుర్థ పంచమకులాలవాళ్ళే ఏనాడైనా సమాజంలోని అధికసంఖ్యాకులు వీరే నిజమైన లోకులు వీళ్ల సంఖ్యలో ఎంత ఎక్కువగా ఉన్నారో సామాజికంగా అంతహీనంగా ఉన్నారు చండాలుడు అన్నది ఒకతిట్టుకింద సిరపడింది వేమనగారు కూడా కొన్ని పద్యాలలో ఈ మాటను తిట్టుగావాడారు

20 INDIAN SOCIETY-Historical Proceedings (In memory of D D Kosambi) - Indian Council of Historical Research pp 95-123

మాట నిలుపలేని మనుజుండు చండాలు
డాజ్ఞలేని రాజు ఆడుముండ
మహిమ లేని వేల్పుమంట జేసినపులి
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ. ర 3015)

ఇంకా చాలా పద్యాలలో ఈ రకంగా చండాల పదప్రయోగం వేమనగారు చేశారు ప్రారంభదశలో శైవాన్ని అభిమానించే రోజుల్లో ఆయన ఇతరమతాలను చీదరించుకొన్నారు చార్వాకమతం గురించి అవగాహనలేని రోజుల్లో ఆయన ఒకపద్యం చెప్పారు

చాలదయ్య యింక చార్వాక మతరీతి
శక్తిశైవ మనుచు జాలనమ్మి
సరణి మిగిలి చెడదె చండాల సేవచే
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1500)

ఇలాంటిదే ఇంకొకటి ఉంది

శాక్త మతము చేత జగతిలోపల మరి
శక్తి దైవ మనుచు యుక్తిలేక
శ్వపచ వంశసేవ జక్కంగ సేతురు
విశ్వదాభిరామ వినురవేమ

(అకాడెమి ప్రతి - 1034)

వేమనగారి కాలానికి చార్వాక మతంలో కూడా తాంత్రిక చర్యలు ప్రవేశించాయికాబోలు ఒక్కశైవంలోనే కాదు శాక్తం ప్రబలంగా జైనంలో బౌద్ధంలో, వైష్ణవంలో కూడా తంత్రరూపంలో ప్రవేశించింది ఇక్కడ ఒకటి మనం గమనించాలి చార్వాకానికీ, చండాల జాతికీగల సంబంధం అంత్యజులు వైదిక దాస్యానికి అంగీకరించకపోవడమే వాళ్లు వర్ణవ్యవస్థకు వెలికావడానికి ముఖ్యకారణం ఆదినుంచీ ఈదేశంలోని అనార్యజాతులకు ఒక ప్రత్యేకదర్శనముంది ఆచార వ్యవహారాలున్నాయి ఆహారపద్ధతు లున్నాయి లోకాయితమతం నిషాదులలోనూ, చండాల జాతులలోనూ ప్రాచుర్యం పొందడానికి ఇదే కారణం దశవిధబ్రాహ్మణులలో చండాల బ్రాహ్మణులు కూడా ఉన్నారు పంచగౌడులు, పంచ - ద్రావిడులు అనే విభజనకాక స్మృతికర్తల లెక్కప్రకారం ఇంకో పదిరకాలవాళ్లు ఉన్నారు

దేవ మునిర్ద్విజో రాజా వైశ్య శూద్ర బిడాలకః
పశు మ్లేచ్ఛ శ్చండాలో దశవిప్రా ప్రకీర్తితా

**ఈ అంచనా ప్రకారం దశవిధ బ్రాహ్మణుల విభాగాలు ఇవి**

1 దేవ బ్రాహ్మణులు
2 ముని బ్రాహ్మణులు
3 ద్విజ బ్రాహ్మణులు
4 క్షత్రియ బ్రాహ్మణులు
5 వైశ్య బ్రాహ్మణులు
6. శూద్ర బ్రాహ్మణులు
7 బిడాలక బ్రాహ్మణులు
8 పశు బ్రాహ్మణులు
9 మ్లేచ్ఛ బ్రాహ్మణులు
10 చండాల బ్రాహ్మణులు

ఒక్కొక్క జాతివాళ్లు వాళ్ళ వాళ్ళ కులాచారాలను బట్టి వివిధ జీవిత సంస్కారాలను చేసుకోవాలి అవి చేయించే కులపెద్దలనే ఆ జాతి బ్రాహ్మణులుగా అంగీకరించక తప్పలేదు ఈ దశవిధ బ్రాహ్మణులలో బిడాలక బ్రాహ్మణులు ఉండడం గమనించదగ్గ విషయం హైతుకులను మనువు బిడాల వృత్తిగల వాళ్ళని పేర్కొన్నాడు బిడాల బ్రాహ్మణులనే నిషాద బ్రాహ్మణులని కూడా అంటారు చార్వాకం వీరివల్లనే వ్యాపించింది.

వేమనగారి భావపరిణామక్రమంలో శైవం నుండి వీరశైవానికి వెళ్ళాక జాతిభేదాలు ఉండకూడదని గ్రహించారు 'జంగమైన పిదప జాతి నెంచగరాదు' (వే సూ ర 851) అనే అభిప్రాయానికి వచ్చారు వీరవైష్ణవులు కూడా జాతిభేదాలు పాటించరని తెలుసుకొన్నారు మాల మాదిగలను హీనంగా చూడకూడదని వాళ్లూ మనుష్యులే అని గ్రహించారు

చదివినయ్యకన్న చాకలయ్యేమేలు
గృహము వేల్పుకన్న గేదెమేలు
బాపనయ్యకన్న బైనీడు మేలయా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1470)

బైనీడు మాలమాదిగలకు క్షురకర్మ చేసే వృత్తివాడు బాజా భజంత్రీ కూడాను కొన్ని కులాలలో పెద్దదినంనాడు అంకమ్మమీద బైనీళ్ళు పాటలు పాడుతారు మాల మాదిగలనే కాక వాళ్ళలో కొంచెం కిందమెట్టు వాళ్ళను కూడా వేమనగారు గౌరవంగా చూశారు

కులము హెచ్చుతగ్గు గొడవల పనిలేదు
సానుజాత మయ్యె సకలకులము
హెచ్చుతగ్గుమాట లెట్లెరుంగగవచ్చు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1144)

అందుకే 'పొత్తు కలిపి కులము పొలయ చేసి' ప్రపంచంలోని ప్రజలందరినీ ఒక్కకంచంలో తినిపించాలని వేమనగారు కంకణం కట్టారు సర్వ మానవ సమానత్వాన్నీ, సంసారయోగాన్నీ సహనాన్ని ఉపదేశం చేశారు

బహుళ కావ్యములను బరికింపగావచ్చు
బహుళ శబ్ద చయము బలుకవచ్చు
సహన మొక్క టబ్బ చాల కష్టంబురా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2716)

సహన మబ్బినప్పుడే సమాజాన్ని అర్ధంచేసుకోడానికి వీలుంటుంది అప్పుడే సంఘాన్ని సామ్యసంఘంగా మార్చడానికి సాధనాలు బుద్ధికి గోచరిస్తాయి వాటిని ఆచరణలో పెడితే సాధనముల, పనులు ధరలో సమకూరుతాయి ఆదిమ లోకాయత మతాన్ని పునఃప్రచారంచేసి ఆధునిక లోకాయతమైన శాస్త్రీయ సామ్యవాదాన్ని ఆచరణలో పెట్టి వర్గరహిత సమాజ స్థాపనకు పాటుపడడమే ప్రాజ్ఞత కలవాళ్ల ప్రథమ కర్తవ్యం

నీతి తెలియజెప్ప నిజముగ వేమన
పాతకముల నెల్ల పారబట్టి
లోతుతత్త్వమరసి లోకులకును జెప్పి
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 2262)

# ఊరూ నాడూ, కులం కుటుంబము

ఏది కులమునీకునేది స్థలంబురా
పాదుకొనుము మదిని బక్వమెరిగి
యాచరించు వాని నవలీల ముట్టరా
విశ్వదాభిరామ వినురవేమ

(వేమన సూక్తి రత్నాకరం– 740 )

ఎదుటనున్న శిష్యుణ్ణి చూసో, లేక తమ్ము తాము ఉద్దేశించుకొనో వేమన గారు ఈపద్యం చెప్పారు పరిపక్వమైన మనస్సుకు కులంగాని స్థలంగాని అనవసరం అయినా మనిషన్నవాడు భారతీయ సమాజంలో ఏదో ఒకకులంలో పుడతాడు, ఏదో ఒక స్థలంలో పెరుగుతాడు పుట్టిన కులాన్ని బట్టీ పెరిగిన స్థలాన్ని బట్టీ ఒకవ్యక్తి చైతన్యం ఎదగవచ్చు, లేదా కుదించుకుపోవచ్చు సంస్కారవంతమైన వాతావరణంలో పెరిగినవాళ్లు సమగ్రమైన చైతన్యపు రూపురేఖలు సంతరించుకొంటారు

వేమనగారు కులాలకూ, స్థలాలకూ అతీతులైన విశ్వకుటుంబే అయినా వారు ఎక్కడ పుట్టారు? ఏకులంలో పుట్టారు? ఎలా పెరిగారు? ఎలా ఎదిగారు? మొదలైన ప్రశ్నలు చరిత్రకారులు వేసుకోకతప్పదు–వేమన గారి వంటి చాటుకవులు చెప్పిన అనేకానేక పద్యాలలో నుంచి వారి జీవిత విశేషాలనూ, ఊరూ నాడూ, కులమూ, కుటుంబమూ మొదలైన వాటి వివరాలను సేకరించాలి ఒక పద్యంలో వేమనగారు తమ చిరునామాను స్పష్టపరిచారని పరిశోధకులు భావిస్తున్నారు

ఊరుకొండవీడు ఉనికి పశ్చిమవీధి
మూగసేతకెల్ల మొదటియిల్లు
యరసి చూడ చూడ నదిముక్తి మార్గమే
విశ్వదాభిరామ వినురవేమ

[D 174-ప 467

ఈ పద్యంవల్ల వేమనగారు కొండవీడుకు సంబంధించినవారనీ ఆ ఊళ్లో పశ్చిమ వీధిలోనే వారిల్లుందనీ భావిస్తే అది పొరపాటుగా కనిపించక

పోవచ్చు ఈపద్యాన్ని బ్రౌను దొరగారు 1824 నవంబరు మాసంలోనే గుర్తించారు వారు వ్రాయించిన అనేక ప్రతులలో ఇది కనబడుతుంది అయితే ఈ పద్యం బ్రౌను దొరగారు తాము అచ్చువేసిన వేమన పద్యాల సంకలనంలో 1829 లోగానీ, 1839 లోగాని చేర్చలేదు ఈ పద్యంలో ఏదో గూఢార్థం ఉందని ఆగూడార్థం ఏమిటో నికరంగా తేలేదాకా ఈ పద్యాన్ని అచ్చు వేయకూడదని ఆయన భావించి ఉంటారు ఈ పద్యానికి ఆయన ఇలాగ ఇంగ్లీషులో వివరణ ఇచ్చారు

**The village of our body in which the deity dwells is Hill Town (the head), his is in back street (the spine) There in silence is the first house We gaze and continually view it, this is the road of beautitude**

**(D - 1774 Verse 46)**

బ్రౌను దొరగారి ఆంగ్ల వివరణలున్న ఈ కాగితం ప్రతిని ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారు 1967 లో ప్రచురించారు అయితే ఈ పద్యం ఇతర ముద్రిత ప్రతులలో చాలాకాలం కిందటే చోటు చేసుకొంది 1913 లో రాయవరపు పూర్ణయాచారిగారి సంకలనం, వేమన సూక్తి రత్నాకరం, అచ్చుపడింది దీనిని బందరుప్రతి అని పరిశోధకులు పేర్కొంటారు అందులో ఈ పద్యం ఇలా ఉంది

ఊరు కొండవీడు నునికి పశ్చిమ వీధి
మూగ చింతపల్లె మొదటిఇల్లు
అరసిచూడ బయలునదె ముక్తి శివుడయా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 569)

బందరుప్రతిలో కనబడే ఈ పద్యం బ్రౌను దొరగారి సంకలనాల్లో ఇదే పాఠంతో ఉంది (D 1709 ప 171) ఇది చాలా ఊహాగానాలకు ఆస్కారమైంది కొండవీడు అనే ఊరిపేరేకాక మూగచింతపల్లె అనే గ్రామం కూడా ఈ పాఠంవల్ల తెలియవస్తూంది వేమనగారి పూర్వీకులు మూగచింత పల్లెలో ఉండేవారనీ, ఎప్పుడో కొండవీడు వలసవెళ్ళి అక్కడ పడమటి వీధిలో స్థిరపడ్డారనీ ఈ పద్యంవల్ల పూర్వ పరిశోధకులు భావించారు అంతే కాదు ఆధునిక పరిశోధకులు ఒక అడుగు ముందుకెళ్ళి "కొండవీటి పశ్చిమ వీధిలోని బయలు (మైదానం) లో శివాలయం ఉండి ఉంటుంది ఆ దాపుననే వేమన నివశించె యిల్లు ఇంటి చిరునామాకు వివరాలు చెప్పే పద్ధతి ఇది" అని చాటుతున్నారు[1]

---

1 డాక్టర్ - ఎన్ గోపి - 'ప్రజాకవి వేమన పుట 112

వేమనగారు ఈ పద్యంలో స్వకీయమైన సాకీను విశదపరుస్తున్నారని భావిస్తే ఇందులోని కొండవీడు అనే మాట పట్ల ఎవరికీ పేచీ ఉండదు అది సుప్రసిద్ధమైన చారిత్రాత్మక స్థలం పోతే రెండో పాదంలోని 'మూగచింత పల్లె' ఎక్కడుంది ? చెన్నరాజధానిలోని గ్రామాల నామాలను అకారాదిగా జిల్లాలవారీగా తాలూకాల వింగడింతో 1924 లో ప్రభుత్వం ప్రకటించింది. అందులో 'పల్లె' అనే చరమావయంగల గ్రామ నామం చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలో మాత్రమే 'మూగ చింతనపల్లె' అని కనబడుతుంది. (పుట – 107). ఇదే వేమనగారి పద్యంలోని 'మూగ చింతపల్లె' అని నేను ఊహించాను [2] ఇటీవల 'చిత్తూరుజిల్లా గ్రామనామాలు – భాషా సామాజిక పరిశీలన' అనే సిద్ధాంతవ్యాసాన్ని శ్రీ డి చెంగారెడ్డి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో సమర్పించారు అందులో ఈ క్రింది ఆరోపాలు ఉన్నాయి (పుట 448)

> మూగచింతన పల్లె చంద్ర 9+ బేచరాకు, గ్రామ నామ సూచి
>
> మూగచింతన ౯ మూగచింతల చూడు దిగువ ఆరోపాలు
>
> మూగ చింతల వాయ 106 + కుటుంబ నామ సూచి < మూగ–అన్న

ఈ పరిశోధన వల్ల మూగ చింతన అనే పదం మూగచింతల అనే రూపాంతరం చెందిందని తెలుస్తోంది చంద్రగిరి తాలూకాలోనే కాక వాయల్పాడులో కూడా ఒక మూగచింతల ఉన్నట్టు ఇప్పుడు అదనపు ఆకరం లభిస్తోంది 'మూగచింతల' అనే పేరుగల గ్రామాలు నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకాలో ఒకటీ, హిందిలి డివిజన్‌లో ఒకటీ ఉన్నట్టు చెన్నరాజధాని గ్రామనామాల గ్రంథంలో కనబడతాయి పరిశోధకులు వీటికీ వేమనగారికీ లంకెకుదిర్చి కొంత ఊహాగానం చేయవలసివచ్చింది

ఈ పద్యానికి లెక్కలేనన్ని పాఠాంతరాలు దిక్కుమాలినన్ని అంతరార్థాలూ కనబడతాయి వాటిని డాక్టర్ గోపి బేరీజు వేశారు

1 మూగ చింతపల్లి మొదటి ఇల్లు (D - 1723 - 504

2 ఊరుకొండపల్లె ఉనికి పశ్చిమ వీధి
మూకచింతపల్లె మొదటి యిల్లు
ఆత్మరాక పోక అదియె పోతత్త్వంబు (D - 1725 - 646

---

2 సమగ్ర ఆంధ్ర సాహిత్యం - పన్నెండవ సంపుట - పుట 66

3 మూల చింత కడకు ముందరిల్లు
అరశి చూడ బయలు అడనె శివుడుండు (D - 1727 - 324

4. మూగసేత కెల్ల మొదటివీడు
అరశి చూడనది ముక్తిమార్గమో (D - 1773 - 5 - 900

బ్రౌను వ్రాత ప్రతులలో ఈ పాఠాంతరాలు ఇలా ఉండగా వావిళ్ల వారు ప్రకటించిన ఒకపద్య సంకలనంలో ఈ పద్యం ఇలాగ రూపాంతరం చెందింది

ఊరు కొండవీడు సునికి పశ్చిమవీధి
మూగచింతలెల్ల మొదటియిల్లు
వడ్డె రెడ్డికుల మదేమని తెల్పుదు
విశ్వధాభిరామ వినురవేమ (వావిళ్ళ (1955) ప 1034

వావిళ్ల వారిని చూసి బాలసరస్వతీ బుక్ డిపోవారు కూడా ఇదే పాఠాన్ని తమ సంకలనంలో ప్రచురించారు ఈ పద్యంవల్ల వేమనగారి కులం తెలుస్తూంది అని సంబరపడవచ్చు గాని ఈ పాఠం "తాళపత్ర ప్రతులలో గాని బ్రౌనునాటికే వ్రాయించిన పుత్రికలలో కాని కనిపించదు" అని డాక్టర్ గోపి విశదం చేస్తున్నాడు బందరు ప్రతిలో కూడా ఎడ్డెరెడ్డి కులమదేమని తెల్పుదు అదే పాఠం కనబడుతుంది (పద్య సంఖ్య 568) అయినా బ్రౌను సంకనాలలో లేని ఈ పాఠం నమ్మ తగినదికాదు అని పరిశోధలకు భావన -[3]

ఈ పాఠాంతరాలన్నీ ఇలా ఉండగా ఇటీవల పారిస్‌ప్రతి నకళ్లు మనదేశానికి వచ్చాయి ఈప్రతిని 1730లో సంజీవనాధస్వామి అనే జెసూటు పాదిరీ పారిస్‌నగరానికి పంపించారు ఈప్రతిలో ఉన్న పాఠం కొంత ప్రాచీనం కాబట్టి దీనిని విశ్వసించవలసిన అవసరం ఉంటుంది అందులో ఈ పద్యం ఇలా ఉంది

విడు కొండ్డ విడు విధి పంచ్చమహా విధి
మొలక చింత్తలలొన మొదటి యిల్లు
వెర్రి వెమననంగ వెదాంత వెత్తరా
విశ్వదాభిరామ వినరావేమ ॥ ౨ ॥

---

3 డాక్టర్ గోపి - ప్రజాకవి వేమన పుట 111

ఆనాటిలేఖనపద్ధతులను బోధపర్చుకొని లేఖక దోషాలను పరిహరించి మాత్రాధిక్యతను తొలిగించి పరిష్కరించితే ఈపద్యం ఇలాగ చదువుకో వచ్చు

వీడు కొండ వీడు వీధి పశ్చిమ వీధి
మొలక చింతలోన మొదటి యిల్లు
వెర్రి వేమననగ వేదాంత వేత్తరా
విశ్వదాభిరామ వినురవేమ

ఈపద్యం మూడవ పాదంలోని పాఠాంతరం అన్నిటికన్నా విభిన్నంగా విలక్షణంగా ఉంది ఇందులో కులప్రసక్తిగాని, బయలుగాని, శివుడుగాని ముక్తిమార్గంగానీ లేవు ఇది కేవలం వేమనగారి ప్రశస్తి ఆయన తమ్ము తాము వెర్రి వేమన అని పిలుచుకొనడం కూడా కనబడుతుంది ఈ ముచ్చట ఇతర వేమన పద్యాలలో కూడా ఉంది ఉదాహరణకు

సిగ్గు గల దటంచ్రు సృష్టిలోపలి వారు
వెర్రి వేమన గనివెరగువారు
తమకు గల్గు సిగ్గు దైవమే యెరుగురా
విశ్వదాభిరామ వినురవేమ

[వే సూ ర 3895

ఈ 'వెర్రి వేమన' అనే పాఠాంతరంవల్ల ఈపద్యంలో 'చిరునామాకు వివరాలు చెప్పే పద్ధతి' లేదనుకోవాలి రెండోపాదంలో మూగ చింతపల్లె కూడాలేదు 'మొలక చింత' అనిఉంది ఇతర పాఠాంతరాలలో 'మూగసేత' 'మూగ చింత' అనే ప్రయోగాలు కనబడతాయి చింత అనేపదం వేమనగారు తాత్త్వికచింతనకు పర్యాయపదంగా చాలాసార్లు వాడారు 'చింతలోనచింతి చిన్మయంబు' (వే సూ ర 3806), 'చింతదీర్చి చూడ చిన్మయ జ్యోతి, (వే సూ ర 3809')

1824లో బ్రౌనుదొరగారు ఊహించినట్టూ ఈ కొండవీడు పద్యంలో ఏదోగూఢార్థం వేదాంతపరంగా ఉండాలి – దొరగారికి వేమన పద్యాలను ఆదిలో విడమర్చి చెప్పినవాళ్లు తిప్పాభట్ల వెంకటశివశాస్త్రిగారూ వద్యం అద్వైత బ్రహ్మశాస్త్రిగారూ ఈ ఇద్దరూ వీర శైవులు కాకపోయినా ఆ సంప్ర దాయంలో దేశికవులు ఊళ్ళపేర్లు వాడుతూ చెప్పిన పదాలనువినే ఉంటారు శివకవులు తొక్కినదారినే వేమనగారు తొక్కారు వారిమీద యాగంటి వారి

ప్రభావంబాలా గాఢంగా ఉంది యాగంటివారి వచనాలలో ఈక్రింది యాల పదం చాలా సుప్రసిద్ధం

సూర్య చంద్రా వహ్నినడుమ
శౌర్య మానె చిలుక గంటి
సూర్య దీప్తి గాయు చుండగా
యాగంటి లింగా
చూడ చూడా శ్చర్చమాయెరా

గండినోట నుండి చూడ
దండి ఉదయాగిరీ గంటి
దండి ఉదయాగిరీ మీదనూ
యాగంటి లింగా
ఉండ గంటి చంద్రగిరీని

పాముపేరు చెప్పా విషము
ఆడ కాడ యెక్కిగదరా
చీమ యెనుబోతు కడుపునా
యాగంటి లింగా
దీమసాన మ్రింగెగదరా

కాంతలా పాలెములోనా
చింతమాను పుట్టేగదరా
చింత అనలు కొనుటసాగాగా
యాగంటి లింగా
చింతబూని బండు పండెరా

ఆకసాన కోడికూసె
చీకటింట్లో పొద్దు పొడిచె
మూక చిత్తాలామధ్యమూన
యాగంటి లింగా
యేకమై వెన్నెలా గాసెరా

ఈ పాటలో ఇంకో చరణం కూడా ఉంది, కానీ ఉదాహరించినంత మట్టుకు మనకు పనికొచ్చే వివరాలు ఉన్నాయి ఇందులోగంజికోట, ఉదయ గిరి, చంద్రగిరి, కాంతల పాలెం అనే స్థలనామాలు కనబడతాయి మూక

చిత్తం అనే ప్రయోగం కనబడుతుంది యాగంటివారు ఈవచనంలో వాడిన బాణీనే వేమనగారు 'కొండవీడు' పద్యంలో వాడారని నిస్సందేహంగా చెప్ప వచ్చు. కొండవీడు శివపరమైన అర్థంలోనే వాడారని చెప్పాలి

కొండరేడు మామ కొండ కూతురు యాలు
కొండ యిల్లు, పసిడి కొండ విల్లు
కొండవంటి దొరవు కుంటెన నడతురా
విశ్వదాభిరామ వినురవేమ

(అకాడమి ప్రతి – 287)

ఈ పద్యంలో శివుని యిల్లు కొండ అన్నది వేమనగారి భావం అని తెలుస్తూనే ఉంది 'వీడుకొండవీడు' అనడం శివుని గురించేగాని తమ స్వంత చిరునామాకాదు

తల్లి గౌరియగును దండ్రియౌ శంభుండు
ప్రమధ గణము లఖిల బంధునితతి
తనకు బుట్టినిల్లు తనర కైలాసంబు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1847)

జంగమైన పిదప వేమనగారు కైలాసమే తమ స్వగృహమని ఈ ఒక్క పద్యంలోనేకాక ఇతర పద్యాలలోకూడా నొక్కి చెప్పారు 'ఉనికి మేరు పర్వత మున్మ త్తతనుజాచి' అనే పద్యంలో ఉనికి ప్రసక్తి ఉంది

(వే సూ ర 524)

కొండవీడు పద్యంలో తాంత్రికమైన గూఢార్థం ఉందని 'పశ్చిమవీధి' అనే ప్రయోగం పట్టి ఇస్తోంది శివప్రోక్తమైన అరవైనాలుగు తంత్రాలలో పశ్చమం ఒక తంత్రం ఇది వామాచారంకన్నా విభిన్నమైనదనుకోవాలి పశ్చిమ తంత్రం గురించి విస్తృత పరిశోధనలు చేస్తే మరికొన్ని విషయాలు బయట పడవచ్చు పూర్వ పశ్చిమ దక్షిణ తంత్రాలనూ మూడింటినీ కలిపి ఒకే తంత్రంగా పరిగణిస్తారు ఇవి కౌలమత తంత్రాలలో చేరినవి వేమన గారు కులార్ణవ తంత్రంలోని గుప్తవిద్యను ఒక పద్యంలో పేర్కొన్నారు వారికి కౌలమత తంత్రాలు కరతలామలకాలని భావిస్తే తప్పులేదు

ఏతావాతా తేలిందేమిటంటే శివకవులు ధోరణిలో వేమనగారు కొండవీటి పద్యంలో ఆయన అగ్రామ నామాన్ని వాడి కైలాసాన్ని ఉద్దేశించారు అయితే

కొండవీడు అన్న పదమే వాడవలసిన అవసరమేమొచ్చింది? ఎందుకొచ్చింది? ఇది మానసికమైన భావానుబంధంవల్ల కావచ్చును యాగంటివారు తమకు పరిచితమైన గండికోట, ఉదయగిరి, చంద్రగిరి మొదలైన మాటలు వాడారు అలాగే వేమనగారు కొండవీడు అనే మాటను వాడి ఉంటారు వారికి కొండవీటితో పరిచయముందని మాత్రమే నికరంగా చెప్పవచ్చును మొలక చింత మూగ సీత అనే పదాలను ఉత్తరోత్తరా లేఖకులు 'మూగచింతల' చేసి ఉంటారు ఈ లేఖకులకు 'మూగచింతల' గ్రామం పరిచయమైన ప్రదేశం అని చెప్పవచ్చు లేక వేమనగారికీ మూగచింతలకూ సంబంధముందని లేఖకులు భావించి అలాంటి పాఠాన్ని చెర్చి ఉండవచ్చు

ఒక కవి స్వస్థలాన్ని, అందులోనూ వేమనగారి వంటి చాటుకవి ఉనికిపట్టును నిర్ణయించేటప్పుడు కేవలం ఒక పద్యాన్ని పట్టుకొని ప్రాకులాడడం అంత సముచితంకాదు వేమనగారు తమ పద్యాలన్నింటిలోనూ వాడిన స్థలనామాలను పరిశీలించితే కొంత లాభసాటిగా ఉండవచ్చు వేమనసూక్తి రత్నాకరంలోనూ బ్రౌను అకాడమీ ప్రతిలోనూ కనిపించే స్థలనామాలను అకరాదిగా పొందుపరుస్తున్నాను కుండలీకరణాల్లో ఉత్త సంఖ్య ఇస్తె అది వేమన సూక్తి రత్నాకరంలోని పద్య సంఖ్యను సూచిస్తుంది అదే గ్రంథంలో వచనంలోనూ ఇతర ఛందంలోనూ స్థలం నామాలువస్తే ఆ సంగతి కూడా తెలియపరిచాను

1 ఉదయపర్వతం (777)

2 కంబము (930) ఇది ఊరిపేరేనా ?

3 కటారు పల్లె (887)

4 కదిరి (887) అచ్చుతప్పు 'కదిలి' అని ఉంది

5 కనక నగరం (892)

6 కనక పర్వతం (893)

7 కాంచి (1107), (1262 లో గరుడసేవ)

8 కాశి (352), 1097 నుండి 1110 దాకా

పధ్నాలుగు పద్యాలలో కాశియాత్ర నిష్ఫలమని చెప్పారు) (1172), (1485), (1943 1944, 1948, (2201, 3929)

9. కులగిరి (మలయాద్రి) - 1707) (అకాడమీ)-826

10 కొంకణం (1172), (అకాడమీ 819)

11 కొండవీడు 390 వచనం, 474 వచనం,

(569) కొండవీటి అభిరామయ్య;
పేరు (2123 చంపకమాల)
(2807 సీసపద్యం)

12 కైలాసం (1847), (2759), (2760)

13 గంగ (1232), (1234), (1235)

14 గండికోట (1247)

15 గయ (1107), (1232)

16 గోదావరి (298), (1944)

17 తిరుపతి (1943)

18 తిరుపతులు (1919) దివ్య తిరుపతుల సూచన

19 తిరుమల (1944)

20 నందిదుర్గం (397), (2155) నిటలదుర్గం అనే ప్రయోగాలు చాలా ఉన్నాయి

21 పర్వతము (శ్రీశైలం) (165) (419), (3369), (అకాడమీ 965)

22 ప్రయాగ (1107)

23 బదరి (3929)

24 మక్కా (2879)

25 మధుర (1107)

26 మూగచింతల (390 వచనం), (569),

27 మోపిదేవి (గుడి) (31116)

28 మేరుశిఖరము (524)

29 రంగధామము (అకాడెమీ 877)

30 రామనాధం (అకాడమీ 819)

31 వారణాసి (1383), (3468)

32. వింధ్య (2151)

33 సేతువు (1107), (1512), (3929)

లెక్కకు ముప్పదిమూడు స్థలనామాలు వేమనగారి పద్యాలలో కనబడు తున్నా, కాశి, వారణాసి ఒకటే కనుక ఛందస్సుకోసం విడివిడిగా వాడారు కనుక వెరశి ముప్ఫయిరెండు స్థలనామాలే అని చెప్పాలి వేమనగారి స్థల నిర్ణయం చేసేటప్పుడు వింధ్యనూ, కాశికి ఉత్తరాన ఉన్న వాటిని మినహా యించాలి కనకకనగరం, కనక పర్వతం, కాశి వారణాసి, కైలాసం, గంగ, గయ, ప్రయాగ, బదరి, మేరు శిఖరం, వింధ్య అనే పదినామాలూ పరిగణనలోనికి తీసుకోనక్కర్లేదు అలాగే మక్కా కూడా మన సరిధిలోనికి రాదు అంటే ముప్ఫయి రెండు స్థలనామాల్లో పదకొండు లెక్కించ నక్కర్లే దన్నమాట మిగత ఇరవైయొక్క స్థలనామాలు మాత్రమే పరిశీలిస్తే చాలు నన్న మాట

1 ఉదయ పర్వతం అంటే ఉదయగిరి అని అర్థం చెప్పుకొంటే అది నెల్లూరు సీమలోని సుప్రసిద్ధ దుర్గం

2 కంబం రాయలసీమలో కర్నూలు జిల్లాలో ఉన్న తాలూకా కేంద్రం కంబం అనే ప్రథమావయవంగల గ్రామనామాలు నెల్లూరు, చిత్తూరు, అనంతపురం జిల్లాలలో కూడా కనబడతాయి

3 కటారుపల్లె అనంతపురం జిల్లా కదిరి తాలూకాలోఉంది అయితే చిత్తూరు జిల్లా పుంగనూరు తాలూకాలో ఒక కటార్లపల్లె ఉంది

4 కదిరి అనంతపురం జిల్లాలోని తాలూకా కేంద్రం

5 కంచీపురం సుప్రసిద్ధమైన పురాదన క్షేత్రం పల్లవుల రాజధాని రాయలసీమకు చేరువలోనె ఉంది తమిళనాడులో ఉన్నా తెలుగు వాళ్ళకు సంబంధమున్న స్థలం

6 కొండవీడు కూడా సుప్రసిద్ధమైన దుర్గం గుంటూరుజిల్లా నరసా రావుపేటలో ఉంది

7 గండికోట కడపజిల్లా జమ్మల మడుగు తాలూకాలో ఉంది

8 తిరుపతి, తిరుమలలు చిత్తూరుజిల్లాలో ఉన్న ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు

9 నంది దుర్గం అనేమాటలో నందికొండను సూచిస్తున్నారనుకొంటే ఇది నల్గొండ జిల్లాలో ఇప్పుడుంది గుంటూరు జిల్లాలో కృష్ణకు అద్దరిని ఉన్న స్థలం ఇది

10 'మూగచింతల' గ్రామాలు కనీసం మూడుకనబడుతున్నాయి ఒకటి చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలోఉంది మిగతావి నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలోనూ పొదిలిడివిజన్‌లోనూ ఉన్నాయి మూగచింతన పల్లె అనే గ్రామం చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో ఉంది

11 మోపిదేవి కృష్ణాజిల్లా దివి తాలూకాలో ఉంది

ముట్టు వాకలికిని మును మంగలికి నంటు
కురులు మోపి దేవి గుడికి చేరు
మ్రొక్కులన్ని చేరు మొగి విశ్వకర్మకు
విశ్వధాభిరామ వినురవేమ

(వే సూ ర 311

పై పద్యంలోని మోపిదేవి గుడి దివిసీమలోనిదే అని వేమనగారు భావించారో లేదో తెలియదు మోపిదేవిలో నేటికీ ఏటేటా పెద్దపెట్టున సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవాలు జరుగుతాయని విన్నాను అక్కడ తల నీలాలు కూడా మొక్కుకొన్నవాళ్ళు ఇస్తారట ఈ పద్యం పూర్వ పరిశోధకుల దృష్టిలో పడలేదు

12 శ్రీశైలాన్ని శైవులు పర్వతం అన్నపేరుతోనే పేర్కొంటారు వేమనగారూ అదే చేశారు ఇది అత్యంత ప్రాచీన క్షేత్రం శైవుల యాత్రా స్థలం ఇది కర్నూలు జిల్లాలో ఉంది

ఈ పన్నెండే వేమనగారి పద్యాలలోగానీ, వారి పేరున చెలామణీ అయే పద్యాలలోగానీ కనిపించే తెలుగు గ్రామనామాలు స్థలనామాలలో గోదావరి కూడా ఉందిగాని ఏ ప్రదేశంలో, ఏఊరి దగ్గర గోదావరిని వారు పేర్కొన్నారో తెలియదు ఇకపోతే మధుర, రంగధామం (శ్రీరంగం), రామనాధం, సేతువూ తమిళనాడులో ఉన్నాయి ఛత్రపతి శివాజీ రాజ్యాన్ని వేమనగారి కాలంలో కొంకణం అని పిలిచేవారు ఉత్తరాన గోదావరి నుండి దక్షిణాన సేతువుదాకా తూర్పున దివిసీమలోని మోపిదేవి నుండి పశ్చిమాన కొంకణం దాకా వేమనగారు పర్యటించిన విస్తృతదేశమని చెప్పవచ్చు

బ్రౌను దొరగారు వేమన పద్యాల తాళపత్ర ప్రతులను తెలుగుదేశం నాలుగు చెరగులనుండీ తెప్పించారు బళ్లారి, కడప, చెన్నపట్నం, విశాఖ పట్నం, మచిలీ పట్నాలలో ఇవి వారికి లభించాయి ఇంకొన్ని ప్రతులలో ఎవరెవరు ఏయే వూళ్ళలో రాసుకొన్నదీ తెలిసే వివరాలు ఉన్నాయి ఆ ప్రతుల భౌగోళిక వివరాలను కూడా బేరీజు వేసి పరిశీలిస్తే కొన్ని ఆసక్తికర మైన సంగతులు తెలియవచ్చు బ్రౌనుదొరగారు తమ సంకలనంలోని కొన్ని ప్రతులకు అవి లభించిన గ్రామనామాలనే పేర్ల పెట్టారు

| | |
|---|---|
| 1 D 1723 | బెండమూడి లంక ప్రతి (కాగితం) |
| 2. D 1728 | కడప ప్రతి |
| 3 D 1730 | బెజవాడ (వర్ణన) ప్రతి |
| 4 D. 1732 | కొణిదెనకోమటి ప్రతి |
| 5 D 1734 | నీలపల్లి ప్రతి (యానాం) |
| 6 D 1735 | బెండమూరి లంకప్రతి మాతృక పెనుగొండ నుండి రాయించి తెచ్చినది. |
| 7 D 1739 | దర్శి అగ్రహారం కృష్ణయ ప్రతి |
| 8 D 1748 | గూడూరు ప్రతి సర్వేపల్లితాలూకా |
| 9 D 1750 | దర్శి సుబ్బయ్య ప్రతి |
| 10 D 1756. | మామిళ్ల దొరువు ప్రతి నెల్లూరు జిల్లా |
| 11 D 1758 | గణపవరపు ప్రతి |
| 12 D 1762 | జంగం వీరభద్రయ ప్రతి, |
| 13 D 1771 | యానాం ప్రతి |
| | బందరు - ప్రతుల నుండి |
| 14 D 1773 | రాయించినది – (కాగితం) (వెంకట శివయ్య కనకాద్రుల ప్రతులు) |

వేమనగారి పద్యాలలో కనబడే గ్రామాల పేర్లను గానీ, వారి పద్య సంకలనాలు లభించిన గ్రామాల పేర్లనుగాని చూస్తే వాటిలో అధిక భాగం పాకనాడులోనూ, పొత్తపినాడులోనూ ఉన్నట్లు విశదమవుతుంది వేమన గారి కాలంలో ఉదయగిరి, చంద్రగిరి, గండికోట దుర్గాలు ప్రబలంగా ఉండేవి ఇవి పైనచెప్పిన పాకనాడు, పొత్తపినాళ్ళలోనే ఉన్నాయి చంద్ర గిరి రాజ్యాన్ని పడనాడు అని పిలిచేవారు ప్రాచీన లేఖకులు కొండవీటి

పద్యంలో మూగచింతల ఏ కారణాలవల్ల చేర్చారోగాని వేమనగారి పూర్వీకుల గ్రామం అదే అయితే చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలో గ్రామం బహుశా వేమనగారి కుటుంబానికి సంబంధించినదే అవుతుంది ఒక పద్యంలో వేమనగారు చెంచులను పేర్కొన్నారు

మనసున కృపలేని మాలల కొడుకుల
వద్ద చేరినట్టి వారలెల్ల
పసన కొడుకు చెంచు పడుచుల చందమౌ
విశ్వదాభిరామ వినురవేమ

[ వే సూ ర 2947

ఇది వావిళ్లవారి ప్రతిలో కూడాఉంది అయితే రెండోపాదంలో మాత్రం 'యొద్దచేరినట్టి యోగులెల్ల' అనే పాఠాంతరం కనబడుతుంది 'చెంచు పడుచుల' అనే మాటలో తేడాలేదు (వావిళ్ల – 472 ) చెంచులు 'కర్నూలు, నెల్లూరుజిల్లాల మధ్య నల్లకొండల్లో జీవించే అటవిక సంస్కృతి జనులు చిత్తూరుజిల్లా వారికి కూడా సుపరిచితులు తాళ్ళపాకవారి సంకీర్తనలలో చెంచు పడుచుల ప్రసక్తి చాలాసార్లు కనబడుతుంది

వేమనగారు తమ సమకాలిక సమాజంలో కనబడే ఇతర తెగలను మతాలవారినీ కూడా తమ పద్యాల్లో పేర్కొన్నారు

షేకుసైదు మొగలు చెలగి పరానులు
తురకల దొరతనము తొలుత జేసి
రాగరాగ విడిచి రైతులై కొలచిరి
విశ్వదాభిరామ వినురవేమ

[వే సూ ర 3765

ఆంధ్రదేశంలోని ముస్లిములందరికీ ఇది వర్తించవచ్చును గానీ వేమనగారి ప్రాంతం చంద్రగిరి రాజ్యమైతే అక్కడ ఈ తెగలున్నాయో లేదో చూసి తేల్చుకొనడం మంచిది ఈమధ్య చంద్రగిరి తాలూకాలోని పాకాల పౌరుల ఇంటి పేర్లపై కంభం సిద్దారెడ్డి ఒక సిద్ధాంతవ్యాసం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారికి సమర్పించారు అందులోని అనుబంధంలో ముస్లిం ఉపశాఖలవివరణ ఇచ్చారు షేక్, పరాన్, సయ్యద్, సున్నీ, మహమ్మద్, రావుత్తర్, తోర్‌లచ్చె అనే పేర్లు అక్కడ కనబడతాయి వేమనగారి పద్యంలోని షేకుసైదు పరానులు ఇప్పటికి చంద్రగిరి తాలూకాలో ఉన్నారన్నమాట

వేమనగారి పూర్వులు చంద్రగిరి రాజ్యంలో మూగచింతల గానీ మూగచింతలపల్లెలో గాని ఉండేవారని ఉత్తరోత్తరా కొండవీటిరాజ్యంలో నికిగానిగండికోట రాజ్యంలోనికిగాని వలస వెళ్ళారని పూర్వపరిశోధకులలాగ మనమూభావించవచ్చు వేమనగారి కాలంలో కూడా వలసలు ఉండేవి ఆయన వాటిని ఆమోదించారు

తా వసించుచోట తగనల్లడాయనా
సౌఖ్యమున్నదరికి జరుగువలయు
గొలకులింకె నేని కొంగలందుండునా
విశ్వదాభిరామ వినురవేమ

[వే సూ ర 1927]

ఇదే భావం 'తాము వెలయు నూరక్షామంబు వాటిల్ల - నట్టి యూరు విడిచి వలసబోరె' అనే పద్యంలో కూడా ఉంది ('వే సూ ర 1919') వేమనగారి పూర్వీకులు అలజడివల్ల వలస వెళ్ళారో కరువు వల్ల వెళ్ళారో తెలియదు వారి పూర్వులు మరీ అంత మోతుబరి రైతులు కాకపోతే కరువు కాటకాలవల్లనే వలస వెళ్ళారని చెప్పవచ్చు-వేమనగారు వ్యవసాయదారులు ఆకాలంలో నాలగవజాతి వారిని కాపులని పిలిచేవారు

కలియుగమున నున్న కాపుకులాన
వేమన తన కీర్తి విక్రయించె
నున్న ధర్మ మెల్ల నుర్విలో నరులకు
కోరువెట్టి పరము కోరె వేమ (వే సూ ర 599

ఇది బాగా ప్రచారంలో ఉన్న పద్యం – ఇవాళకాపులన్న మాటకు ఏ అర్థమున్నా వేమనగారి కాలంలో ఉన్న అర్ధమేమిటో పరిశీలించాలి తెనాలి రామకృష్ణుడు తన నిగమశర్మోపాఖ్యానంలో కాపు రెడ్డి అనే పదాలను పర్యాయ పదాలుగా సేద్యవృత్తిగల వాళ్ళకు వాడాడు దొంగలు కొట్టిన నిగమశర్మను ఒక కాపుకొడుకు కాపాడుతాడు [4] ఇంటికి తీసుకువెళతాడు నిగమశర్మ ఆ కాపుకొడుకు పెళ్ళాన్ని లేవ తీసుకుపోతాడు అప్పుడు రామ కృష్ణుడు 'ఎవ్వడా రెడ్డియింటికి నెగ్గుచాల జేయు' అని నిగమశర్మను నిం దించాడు [5] ఇతర ఆకరాలలో కూడా కాపు, రెడ్డి అనేపదాలు సమానార్ధకాలే

4 పాండురంగ మాహాత్మ్యం-తృతీయాశ్వాసం - ప 55

5 అందులోనే- 3-68

అని చెప్పవచ్చు [6] రెడ్లు వ్యవసాయదారులని కూడ ప్రబంధాల లో చాలా వర్ణనలున్నాయి మచ్చుకొకటి

ఆరికకూడు పుచ్చవరు గావుల వెన్నయు దోపగింజ సం
బారపు టాంబురంబు తనిమజ్జిగ మాకొనకంపుతోడదం
డారగ బట్టి మడియల్ ములుగోలలబూని యెడ్లకో
టేరులు వైచి దున్నుటకు నెగిరి కోంట్రకు సాలివచ్చినన్

(పంచతంత్రం– 1-687

ఈపద్యాన్ని బైతరాజు వెంకటనాధుడు చెప్పాడు ఇటువంటి పద్యాల వల్ల రెడ్లవృత్తి వ్యవసాయమని వేమనగారు తాము రెడ్లయి ఉండే తమది కాపు కులమని చెప్పుకొన్నారు కాపు వారివృత్తి సేద్యమే అని చెప్పారు

ఒరులకొరకు భూమి నొరవెడువారలు
అవని పతికి వశ్యులైన వారు
పాలవంటివారు పన్నుపెట్టెడివారు
వాక్కెరుగరు కాపువారు వేమ (వే సూ ర 812

కాపువారు నోరులేనివాళ్ళని చెప్తూ అలాగ నోరు వాయిాలేని మూగ జీవాలు కనుకనే వాళ్లు వివరమెరుగక తమ శ్రమఫలితాన్ని పరిపూర్ణంగా అనుభవించలేరని కూడా వేమనగారు చెప్పారు

కాపుకులజులెంత కర్మలైయుండినా
పాపరాశి కొంత పరిసి పోవు
వివరమెరుగ నట్టి వెర్రి జీవులు గాన
విశ్వదాభిరామ వినురవేమ (D - 1727 ప 633

ఈ పద్యంలో రెండోపాదం బహుశా 'పైరురాశి కొంత పరిసిపోవు' అని ఉండాలనుకొంటాను ఎంత కష్టపడి పండించినా పంట కొంత క్షీణిస్తుందని వేమనగారి భావమై ఉంటుంది ఫలితం తరిగిపోతున్నా మళ్ళా పైరు పెట్టక తప్పదు

---

6 Edgar Thurston తన Castes and Tribes of Southern India లో రెడ్డి అనే కులం దగ్గర చూ కాపు అనిరాశాడు రెడ్ల గురించి కాపుల ఆరోపంలోనూ వివరించాడు

పైరునిడినవాని ఫలమేమి చెప్పదు
పైరునిడనివాని పలము పాడు
పైరు నిడినవాడు బహుసౌఖ్యవంతుడౌ
విశ్వదాభిరామ వినురవేమ

(వే నూ ర 2613

బహుళ సౌఖ్యాలకూ, సకలసంపదలకూ పైరుపంట మూలకారణం 'చెట్టు పెట్ట ఫలము చేపడకుండునా' అన్న ఆశాభావాన్ని వేమనగారు అడుగడుగునా వ్యక్తం చేస్తునే వచ్చారు కర్షకుడు ఆశావాది కాకపోతే ప్రపంచం సాగదు చాలా పద్యాల సాక్ష్యం వల్ల వేమనగారు వ్యవసాయం వృత్తిగా గల రెడ్లని చెప్పవచ్చు

దేశంలోని తాళపత్ర గ్రంధాలను బ్రౌను దొరగారు సేకరించే కాలానికి వేమనగారి కులం రెడ్డికులమని విశ్వసించేవారు D 1728 నెంబరు ప్రతిలో 'నాదెండ్ల గోపాలయ వ్రాసుకున్న వేమారెడ్డి పద్యాలు' అనే వివరణ ఉంది D 1747 ప్రతిలో 'వేమన శతకం రెడ్డిగారి పద్యములు' అనే వివరణ ఉంది లేఖకులు అందుకే కొండవీటి పద్యంలో 'ఎడ్డెరెడ్డికులమ దేమేనని తెల్పుదు' అనే పారాన్ని చేర్చి ఉంటారు

ఒక సుప్రసిద్ధ వ్యక్తికులం తెలిశాక కుతూహలం అక్కడితో ఆగదు ఆ కులంలో ఏ తెగనాడో తెలుసుకోవాలనిపిస్తుంది 'రెడ్లలో తెగలకూ వడ్లలో తెగలకూ లెక్కలేదని సామెత ఉంది, అయినా 'మున్నూట రెడ్ల'నే మూక ఉమ్మడి లెక్క ఒకటి ఉంది పరిశోధకులు ఎంత ప్రయత్నించినా ఈ లెక్క వివరాలు తేలలేదు కందుకూరు బాల సూర్యప్రసాద్ భూపాలుడు (దేవిడి జమిందారులు) గారు తమ ఆంధ్రవిజ్ఞానం ఆరవ సంపుటంలో 34 తెగల రెడ్ల పేర్లనే ఇవ్వగలిగారు

చంద్రగిరి తాలూకాలోని రెడ్లతెగలను నేను రెండు ఆకరాలనుండి క్రోడీకరించాను ఈక్రింది పందొమ్మిది తెగలపేర్లు తెలుస్తున్నాయి

---

7 కంభం సిద్దారెడ్డి–'పాకాల పౌరుల ఇంటిపేర్లు - భాషాసామాజిక పరిశీలన' (అముద్రికం)

● కుమారి కాటూరి శారద చంద్రగిరి పౌరుల ఇంటిపేర్లు భాషా సామాజిక పరిశీలన (అముద్రితం)

1. అరవ రెడ్లు
2 అకుతోట రెడ్లు
3 ఎర్రం రెడ్లు
4. ఎల్లమ రెడ్లు (ఎడ్లమ రెడ్లు?)
5 కాపురెడ్లు
6 కామాటి రెడ్లు
7 కమ్మ రెడ్లు
8 కూరాకుతోట రెడ్లు
9 కొండ కాపురెడ్లు
10 దేశూరి రెడ్లు
11 పంటకాపులు
12 పంట రెడ్లు
13 పల్లె రెడ్లు
14 పాకనాటి రెడ్లు
15 పోకనాటి రెడ్లు
16 మొరిసి రెడ్లు
17 మోటాటి రెడ్లు
18 వన్నె కాపులు
19 వెలమ రెడ్లు

వేమనగారి పూర్వీకులది చిత్తూరు జిల్లాలోని మూగచింతల గాని మూగచింతల పల్లెగానీ అయివుంటే వారు ఈ పందొమ్మిది తెగలలో ఎదో ఒక దానికి చెందినవారై వుంటారు ఈ గ్రామం పాకనాటికి చెందినది కాబట్టి వేమనగారు పాకనాటి రెడ్లయి ఉంటారని పూర్వ పరిశోధకులు భావిస్తున్నారు [8] ఈ పాకనాటి శాఖలోనే వ్యవసాయమే తమ ముఖ్యవృత్తిగా గల వారిని పంట రెడ్లని పంటకాపులనీ వ్యవహరిస్తారు పంటరెడ్లలో పధ్నాలుగు శాఖలున్నాయని పూర్వం భట్రాజులు పద్యాలు చదువుతూ ఉండేవారు అరవీనాటి బుక్కరాజు కొలువులోని దేవళరాజులనే భట్రాజు అ ఏలికను సంబోధిస్తూ ఈ పద్యం చెప్పారు

పంటాన్వమునందు పదునాలుశాఖల
    జక్కగవివరించు సత్యమరసి
మోటాటి, వెలనాటి, మొరుసు, నేర డయోద్య,
పంట, పొంగలినాటి, పాకనాటి
భూ మంచి, కుంచేటి మున్నూటి, గోజేటి,
    యొనర గండియకోట, యోరుగంటి

యన బరగు నుందు రాంధ్రా వనీస్థలి
    గౌరవధిష్టిత కాపురెడ్లు
పంట పదునాల్గు విధములం బొట జగతి
దరతరంబుల నిట్టుల దనరు చుండ్రు
వీరి కుపతెగలున్నవి వివిధములుగ
భుజ బలాటోప పిన్నకు బుక్కభూప[9]

---

8 బండారు తమ్మయ్యగారు వేమనచరిత్ర 1907 –పుట 94

9 ప్రసాద భూపాలుడు ఆంధ్ర విజ్ఞానం అరవ సంపుటం, పుట 2775

భట్రాజు చెప్పిన ఈ పద్యంలో పేర్కొన్న పద్నాలుగు తెగలలో నాలుగు తెగలే చిత్తూరు జిల్లాలో కనబడతాయి అవి మోటాటి, మొరసు, పంపు, పాకనాటి అనేవే వేమనగారి పూర్వులు గండికోటకు వలసకెళ్ళాక వారు గండికోట రెడ్లతో కలిశారేమో తెలియదు అయితే ఒకటిమట్టుకు వాస్తవం గండికోటరెడ్లే వలసవెళ్ళి దక్షిణాదిని మధుర, తిరునల్వేలి జిల్లాలో స్థిరపడారు [10] వేమనగారికి తమిళనాడులో పరిచయముంది అక్కడ సంచరించారు గండికోట రెడ్లతో సంబంధం ఉండడం వల్లగానీ, లేక వారు గండికోట రెడ్లే కావడం వల్లగానీ ఇది సంభవించిందేమో

ఒకవ్యక్తి ఊరు నాడూ కులం శాఖా తెలుసుకొన్నాకనే అతని కుటుంబ పరిస్థితుల గురించి అంచనా వేయగలం మానవుడు సంఘజీవి కులకట్టుబాట్లకు లొంగి ఉండవలసినవాడు , స్థానికమైన ఆచారవ్యవహారాలను పాటించవలసిన వాడు , యుక్తవయస్సు వచ్చేదాకా పెద్దల చెప్పుచేతలలో పెరగవలసినవాడు ఈ విషయాలన్నీ మనస్సులో పెట్టుకొనే మనం వేమనగారి బాల్యాన్నీ యౌవనాన్నీ ఊహించుకోవాలి వారి పద్యాల నుండి తెలియవచ్చే విషయాలను ఆనాటి సాంఘిక పరిస్థితులతో త్రైసారువేసి విశ్వసనీయమైన వ్యక్తిగత చరిత్రను విరచించుకోవాలి వేమనగారు నిస్సందేహంగా వేలకొద్దీ పద్యాలు చెప్పారు అయితే వాటిలో ఎన్ని స్వీయ చరిత్రాత్మకమైనవో ఎన్ని లోకానుభవం వల్ల ఇతరులపై చెప్పినవో ప్రస్తుత పరిస్థితులలో తేల్చలేం వేమనపద్య సంకలనాల పరిశోధక ప్రతిని తయారు చేయందే ఈ పనికి పూనుకొనడం సాహసమే అయినా పేరెన్నికగన్న అకాడమీలూ, తదితర సాహిత్య పరిశోధక సంస్థలు ఈ విషయంలో ఏమీ పట్టించుకోనప్పుడు ఉత్సాహవంతులు ఉన్న పరిస్థితిలోనే పరిశోధనలు చేసి వేమనగారి కుటుంబ విషయాల గురించి కొత్త వివరాలు సేకరించాలి

కొత్త విషయాలు సేకరించే ముందు పూర్వ పరిశోధకులు చేసిన కృషిని ఒక్కసారి పునశ్చరణ చేయాలి 1923లోనే వేమూరి విశ్వనాథశర్మ గారు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో 'వేమన కులము – కుటుంబము' అనే వ్యాసం రాశారు 1928 లో రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తమ ఉపన్యాసాలలో 'వేమన సంసార స్థితిగతులు' అనే అంశంమీద ఒక సుదీర్ఘ సమాలోచనం చేశారు ఇతర పరిశోధకులు చాలామట్టుకు రాళ్లపల్లి వారి బాటలోనే సాగారు కొందరు కొంచెం కుదించారు కొందరు చాలా సాగదీశారు మొత్తంమీద అందరూ వేమనగారు ప్రభురెడ్ల కుటుంబంలో

10 Edgar Thurston - castes and tribes of South India vol. III P 227 and P 246

పుట్టి పెరిగినట్టు భావించారు రాళ్ళపల్లివారి అంచనాలను 'కట్టె-కొట్టె-తెచ్చె' అన్నట్టు క్లుప్తంగా కూడా చెప్పుకోవచ్చు

వేమనగారు కలవారి ఇంట పుట్టారు గారాబంగా పెరిగారు గాలి చదువు చదువుకొన్నారు జులాయిగా తిరిగారు వారకాంతలను మరిగారు పెద్దలు కుదిర్చిన పెళ్ళి చేసుకొన్నారు పెళ్ళాం గయ్యాళి ఆమెను వంచలేక పోయారు అన్నదమ్ములతో వేరుపడ్డారు ఇంటిలోన పోరు ఇంతింత కాక పోయినా సంసారం వేశారు సంతానాన్ని కన్నారు వాళ్లు తల్లిదండ్రి మీద దయలేని బిడ్డలు, వేమనగారు అప్పులపాలయ్యారు లేమిని అనుభవించారు సంసారం మీద విరక్తిపుట్టి సన్యశించారు తత్త్వాన్ని తెలుసుకొనడానికి ఎందర్నో ఆశ్రయించారు అన్ని దర్శనాలను అవలోకించారు దీనివల్ల తృప్తి కలగలేదు తమదారినే ఒక ప్రత్యేక తత్త్వాన్ని దేశసంచారం చేస్తూ శిష్యులకు ఉపదేశం చేశారు వార్ధక్యంలో కాలంచేశారు

వివిధ పద్య సంకలనాలలోని విషయాలనుబట్టి ఈవిధంగా వేమన గారి జీవిత రేఖలను క్రోడీకరించవచ్చుగాని కేవలం వేమన పద్యాలపైనే ఆధారపడితే ఏది స్వీయ చరిత్రాత్మకమో ఏది లోకవృత్తియో తేల్చడం కష్టం అయినా వేమనగారి జీవితదశలను తెలుసుకొనడానికి వారి పద్యాలు తప్ప ఇతర ఆకరాలపైన ఆధారపడలేము ఆనాటి రెడ్డి కుటుంబాల సాధా రణ పరిస్థితులను మాత్రం ఎన్నెన్నో ఆకరాలనుండి బేరీజువేసి వాటిని వేమనగారి పద్యాలతో తైపారుచేసి నిగ్గు తేల్చాలి కృష్ణదేవరాయలవారు, తాళ్ళపాక చిన్నన్న, తెనాలి రామకృష్ణుడు, చైతరాజు వెంకటనాథుడు, పాలవేకరి కదిరీపతి, అయ్యలరాజు నారాయణ వంటి కవులు తమ కావ్యా లలో రెడ్లను పేర్కొని, వారి ఇళ్ళూ వాకిళ్ళూ, తీరు తెన్నులూ, కట్టూ బొట్టులు, పనిపాట్లూ వర్ణించారు ఎడ్గార్ థార్ స్టన్ తన 'దక్షిణ భారతం లోని కులాలు, తెగలూ' అనే ఆంగ్ల గ్రంథాలలో కాపు - రెడ్లు చరిత్ర, ఆచార వ్యవహారాలూ సవిస్తరంగా వివరించాడు వేమనగారి కుటుంబం గురించి అంచనాలు వేస్తున్నప్పుడు పూర్వ పరిశోధకులు ఈ ఆకరాలను స్పృశించలేదు ఇల్లలకడంలోనే వాళ్ళకు సరిపోయింది

కృష్ణదేవరాయలవారు ఆముక్తమాల్యదలో ఒకచోట 'అల్ప విద్యా లబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె' అని రెడ్డి ప్రసక్తి తెచ్చారు [11] ఈ సంగతిని పేర్కొంటూ సురవరం ప్రతాప రెడ్డిగారు 'దుప్పటి

---

11 ఆముక్తమాల్యద – 7-4

కొంగులో బీదవారు కాసువీసము ముడివేసుకొని అత్యవసరమైనప్పుడు విడువ లేక విడిచి వాడుకొందరు 'పేదవారికి వీసమే మహాకోశము' అని రాశారు[12] వేమనగారు 'విడువ ముడువ' అనే జాతీయాన్ని ఒక పద్యంలో వాడారు

కుడవ కూడులేక కూడబెట్టగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడవ సాగియున్న నడపీనుగందురు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1135

వేమనగారు విడువ ముడువలేని రెడ్లను చూశారు బహుశాతామే ఆ స్థితికి వచ్చారేమో ప్రభు రెడ్లకుటుంబంలో పుడితే కుడవకూడులేని స్థితికి ఎందుకొచ్చారు ? 'ఉన్న యర్థమెల్ల ఉర్విజనులకు' పంచిపెట్టినందువల్లనే కావచ్చును

రెడ్లలో ఓలి యిచ్చిన తర్వాతే పెళ్లి అవుతుందని ఎడ్గార్‌థర్‌స్టన్ రాశాడు వేమనగారు కూడా ఓలియిచ్చే పెళ్లిచేసుకొని ఉంటారు ''ఓజమాలు మగువయోలి మాడచేటు' అని ఒకచోట చెప్పారు (వే సూ ర 820) పెళ్లిలో మొదటినాడు పెళ్లికొడుకుకు భట్రాజులు బాసికం కడతాడు ఆ కట్టిన క్షణం నుంచి ఆ భట్రాజు హామేషా పెళ్లికొడుకుకు తైనాతీగా ఉంటాడు (పెళ్లికూతురు దగ్గర ఒక భోగంబాన తైనాతీగా ఉంటుంది) పెళ్లినాడు బాసికం కట్టిన భట్రాజు సాంగత్యంవల్ల వేమనగారికి చాటు పద్యాలు అలవడి క్రమేణా కవిత్వమల్లే గుణం వచ్చిందా ?

సోషల్ అంత్రపాలజీని సాహిత్య సాక్ష్యాధారాలను సమన్వయం చేస్తే వేమనగారి కాలంనాటి సాంఘిక పరిస్థితులు స్పష్టంగా తెలుస్తాయి రెడ్డిస్త్రీలు 'కుడిపైట లోపల సిస్తురవిక తొడిగేవారని కదిరీపతి వర్ణించాడు[13] అంటే రెడ్లు కుడిచేతి కులాల వర్గానికి సంబంధించిన వాళ్ళన్నమాట వేమనగారి కాలంలో శైవ వైష్ణవ వివాదాలకన్నా కుడిచేత ఎడమచేతికులాలపోట్లాటలు ఉధృతంగా ఉండేవి ఇవి అంతస్తు విషయంలోని జట్టీలని చరిత్రకారులు భావిస్తున్నారు గానీ నిజానికి ఆర్థిక కారణాల వల్లనే అంతస్తులు ఏర్పడుతాయి తత్త్వవేత్తకు అన్నికులాలూ ఒకటె అందుకే వేమనగారు ఇలా జ్ఞానబోధ చేశారు

---

12 సురవరం ప్రతాపరెడ్డి - ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట 256

13 శుక సప్తతి 2-411

కులముహెచ్చు తగ్గు గొడవల పనిలేదు
సానుజాతముల సకల కులము
హెచ్చుతగ్గు మాట లెట్లెరుంగగవచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1144

సకలకులాలు ఒక్కటె అన్న సత్యాన్ని చాటిన వేమనగారి కులం గురించి ఇంతకన్న విపులంగా చర్చించడం భావ్యం కాదేమో అనిపించవచ్చును గాని వారి సమగ్ర చరిత్రను తెలుసుకొందామనుకొంటే సవిస్తరంగా పరిశోధించాలి నేడు దొరుకుతున్న శాస్త్రీయమైన ఆకరాల సాయంతోనాటి సామాజిక స్థితిగతులను ఆకళించుకోవచ్చును

ఆనాటి సంఘంలో వేమనగారు ఏ కులంలో పుట్టి పెరిగారో ఏ మతం అనుసరించారో ఎలాగ జ్ఞానవంతులై ఏటికెదురీదేరో దురాచారాన్నయినా ఎలా ఎద్దేవా చేశారో చారిత్రక సాక్ష్యాలతో తెలుసుకోవచ్చును అందుకే మన వేమన మతం అభిమతం, సంసారం సన్యాసం అనే విషయాలు తెలుసుకొనడానికి నాటి 'సామాజిక జీవనం విశ్లేషణ విధానం' కొరకు ఆకరసేకరణ చేసి ఈ విషయాలు ఆ ఉపన్యాసానికి మీదుకట్లాను నిడివిమీద మనవి చేసుకొంటాను

# సామాజిక జీవనం—విశ్లేషణ విధానం

ఎన్ని శతాబ్దాల కింద రచించినా, కొన్ని రచనలు నేటికీ రేపటికీ ఎల్లుండికీ కూడా నూతనంగా కనబడవచ్చు ఆ సాహిత్యం సార్వజనీనం, సార్వకాలికంగా స్ఫురించవచ్చు ఆ కవితలను అన్ని వర్గాలకూ అన్వయించుకోవచ్చు అయితే ఏకవి రచలలైనా అతడు జీవించిన సామాజిక వ్యవస్థ నుండి వేరుచేసి చూడకూడదు అప్పటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని చూస్తే కొన్ని చారిత్రక సత్యాలు విశదమవుతాయి యుగధర్మాలు తెలిస్తేగాని గతకాలపు పద్ధతులను గ్రంథాల కెక్కించిన మన ఇతిహాస పురాణాలు అవగతం కావు

ఉదాహరణకు మహాభారతం సభా పర్వంలోని ద్రౌపదీ వస్త్రాపహరణం ఘట్టాన్నే తీసుకొంటే కొన్ని యుగధర్మ సూక్ష్మాలు తెలుస్తాయి ధర్మరాజు తనను, తన తమ్ములనూ, తమ భార్యనూ జూదంలో ఓడిపోయాడు జూదంలో ఓడినవాళ్ళు దాసుల కిందలెక్క సుయోధనుడు ద్రౌపదిని తన దాసీజనంలో చేర్చమని ఆజ్ఞాపించాడు ప్రాతికామి ఈ సమాచారాన్ని తెలియచేస్తే ద్రౌపది ధర్మసందేహం వెలిబుచ్చింది "తన్నోడి నన్నోడెనా, నన్నోడి తానోడెనా ?" అని అడిగింది ఈ ప్రశ్నకు సభలో ధర్మరాజే సమాధానం చెప్తాడని ఆమెను సభకు రమ్మన్నారు ఆమె వెళ్ళలేదు దుశ్శాసనుడు వెళ్ళి ద్రౌపదితో ఇలా అన్నాడు

> ద్యూతే జితా చాసి కృతాసిదాసీ
> దాసీషు వాసశ్చ యథోపి జోషం

(సభా - 67-56

"జూదంలో నువ్వు మాకు దక్కావు మా దాసీ సంఘంలో నువ్వు ప్రవేశించాలి" అని దుశ్శాసనుడన్నాడు ద్రౌపది నిరాకరించింది సభకు ఈడ్చుకు వెళ్ళారు తాను ధర్మవిజితో అధర్మవిజితో తేల్చమని సభవారిని అడిగింది చాలా సిద్ధాంత రాద్ధంతాలు జరిగాక వికర్ణుని ప్రతిపాదనను విన్న సభవారు తలవంచుకొని, నోరు మూసుకొని, చేతులు ముడుచుకొన్నాక సుయోధనుడు దుశ్శాసనుని చూసి "నువ్వు ద్రౌపదితోసహా పాండవుల వస్త్రాలు తీసుకో" అని ఆజ్ఞాపించాడు ఆ మాటలు వింటూనే పాండవులు తమ తమ ఉత్తరీయాలు తీసి కింద ఉంచ వేశారు

యజమానుల ముందు దాసులకు పయిబట్టలు ధరించే హక్కు ద్వాపర యుగంలోనే కాదు ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఇటీవల దాకాలేదు పైనున్న తుండుగుడ్డను చంకలో పెట్టుకొని చేతులు కట్టుకొని దొరలముందు దాసులు నిలబడ్డం ఇప్పటికీ మనం చూస్తున్నాం మంచి జూదంలోనో మాయ జూదంలోనో గెలుచుకొన్న దుర్యోధనుడు తన హక్కును అమలు జరపడమే వస్త్రాపహరణ ఘట్టంలో విశదమవుతుంది తాను అధర్మ విజి నని భావించి పాంచాలి ఎదురు తిరిగింది ఈ ప్రతిఘటన తరువాత యుగం వాళ్ళకి నచ్చింది కనుక ద్రౌపదీ వస్త్రాపహరణాన్ని ద్రౌపదీ మాన సంరక్ష ణంగా మార్చుకొనడం జరిగింది దురాచారాలను మార్చడం అవశ్యకమే గాని ఒకనాటి సమాజాన్ని బోధపరుచుకోవాలంటే ఆ యుగధర్మాన్ని విస్మ రించకూడదు

యుగధర్మాలు మారుతున్నా కులధర్మాలు ఒక పట్టాన మారవు కుటుంబాచారాలు మార్చుకొనడం కష్టం మళ్ళా మహాభారతంలోని ఉదా హరణనే చూద్దాం కుంతి పుట్టి పెరిగిన సంఘంవేరు ఒక్క వనితకు సెక్కు భర్తలను అనుమతించే వ్యవస్థలోంచి ఆమె వచ్చింది తనకోడలు కూడా తనను అనుసరించాలని ఆదేశించింది ఈ ప్రాథమిక వాస్తవాన్ని జనామోద కరంగా చేయడానికి ఇతిహాస కర్తలు ఎన్నో సబువులూ, కొన్ని పూర్వ కథలూ సృష్టించవలసి వచ్చింది

మహాభారతంలో వివిధ సామాజక వ్యవస్థల సహజీవనం కనబడు తుంది అప్పటినుంచి ఇప్పటిదాకా హైందవ సమాజంలో వర్ణాశ్రమ ధర్మాలు 'బేసిక్ స్ట్రక్చర్' ఏమాత్రం మారకుండా కుల కట్టుబాట్లు, గ్రామీణ జనాచారాలూ కొద్దికొద్ది సంస్కారమును పొందుతున్నాయి సంస్కారాలవల్ల సమస్యలు పరిష్కారం కావు సమాజాన్ని సమూలంగా మార్చి వేయందే సమత సాధ్యపడదు ఆదిలో వీరశైవులూ ఆ వెనువెంటనే వీరవైష్ణవులూ కులభేదాలను స్వస్తి చెప్పడానికి ప్రయత్నించారేగానీ, మతభేదాలను పాటిం చడం వల్ల ఫలితం పరిమితమైపోయింది వేమనగారు ఒక్కరే సహనంతో, కులమత భేదాలను రూపు మాపడానికి ప్రయత్నించారు ఆయన ఎటువంటి సంఘంలో పుట్టారు, ఏ వాతావరణంలో పెరిగారు, ఏ మార్పు లను ఊహించారు, ఏ ప్రబోధాలు కల్గించారు, అన్న ప్రశ్నకు సమాధా నాలు విశ్లేషణాత్మకంగా తెలుసుకోవాలంటే ఆనాటి సామాజిక జీవనాన్ని ముందుగా అర్థం చేసుకోవాలి

వేమనగారు చాటు కవులు , సందర్భాన్ని బట్టి కవితలు చెప్పినవారు వారి పద్యాల సంకలనం అకారాదిగా లభిస్తోంది భర్తృహరి సుభాషితాల

మాదిరి మూర్ఖపద్ధతి, మోహపద్ధతి వగైరాల వర్గీకరణ చేసి పదహారు పద్ధతులతో కొందరు ప్రచురణ కర్తలు కొన్ని సంకలనాలు ప్రకటించారు ఈ పద్యాల పూర్వాపరాలు, కాలక్రమాలు తెలుసుకోకపోతే వేమనగారిలో వచ్చిన పరిణామాలూ సిద్ధించిన పరిపక్వతా అర్థంకావు వారికాలంలో నాటి సామాజిక స్థితిగతులను ఆకళింపు చేసుకోవాలి

వేమనగారు కలియుగంలో కాపుకులానికి తమ కీర్తిని విక్రయించి నట్టు తామే చెప్పుకొన్నారు వ్యవసాయం వృత్తిగా గల నాలవజాతి వారిని కాపులంటారు. ఆంధ్ర సాహిత్యంలో తిక్కనగారే మొదటిసారి సేద్యగాళ్ళన్నే అర్థంలో కాపులు అనే పద్యాన్ని వాడారు

అవు బేహారము గృషియు
న్నవరణలును బసుల సొంపునన యట్లగుటన్
భువి బసులు గలుగు కావుల
నవనీశుడు గన్న ప్రజలయట్ల దయదగున్

(శాంతి పర్వం – 2 - 388

వార్త అనే పదానికి ఎన్ని అర్థాలున్నాయో అన్నీ ఈ పద్యంలో తిక్కనగారు పేర్కొన్నారు అవన్నీ కాపుల వృత్తి ధర్మాలని విశద పర్చారు తిక్కనగారే ఇంకో పద్యంలో కాపులసంగతి కథనంచేశారు

ప్రారంభములకెల్ల బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ము వినుము వాని
లోన నొక్కటి చేతగానేర దనఘ త
త్ఫలసిద్ధు లెట్లన్న దరచు వాన
కారు పొలంబున గలెనేనియు గొల్చ
గావింప నేర్చునే యేవిధమున
వల నేర్పడగ దున్నబొలములోనైన వ
ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె
కాపులావు వెరపుగల్ల కర్మనము సే
యంగ వృష్టి దగినయట్లుగలుగ
ఫలము గలునట్లు పౌరుషంబునకు దై
వంబు తోడుపాటు వలయు నెందు

[సౌప్తిక పర్వం – 1-31

కాకతీయుల కాలంనుంచీ పాడిపంటల ఉత్పత్తి కాపుల కర్తవ్యాలని ఈ పద్యాలవల్ల తెలుస్తుంది కాపు – రెడ్డి అనేమాటలు పర్యాయపదాలని సామాజిక మానవ శాస్త్రవేత్తలు చెప్తారు క్రీస్తు శకం ఏడెనిమిది శతాబ్దాల నాటినుండి తెలుగుగడ్డమీద 'రట్టగుడి' పేరిట చిన్న గ్రామాధికారులు ఉండేవారు ఈరట్టగుడి శబ్దంనుండే రట్టోడి, రట్ట, రడ్డి, రెడ్డి అనే రూపాలు పుట్టాయి చిన్న చిన్న భూభాగాలకు అధికారులై వాటిని గుత్తగా అను భవిస్తూ వున్నవాళ్ళని రట్టగుట్టులు, రట్టగుడ్లు అనిపించేవారు వీరి ముఖ్య వృత్తి వ్యవసాయం రట్లడులకు నిధి, నిక్షేపము, జలము, పాషాణములు, అక్షిణి, ఆగామి, సిద్ధము సాధ్యము అనే అష్టభోగస్వామ్యములు తమ భూముల పై ఉండేవి ఆ కాలంలో రట్టడములు ఒకరకమైన ఆర్థికవ్యవస్థలు, ఆదిలో వృత్తివాచకమైన 'రడ్డి' పదం తర్వాత జాతివాచకమైంది [1] వేమనగారి జనన కాలందాక 'రట్టడి' అధికార సూచకమైన బిరుదు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రజాతులకు ఉండేది ఉత్తరోత్తరా చతుర్థకులజులకే పరిమితమైంది

వ్యవసాయమే వృత్తిగాగల ఇతరకులాల తెలుగునాటవున్నారు పంట, కమ్మ, తెలగ, వెలమ నాలుగుశాఖలు ప్రధానమైనవి ఈనాలుగూ ఒక్కకుదుటి లోంచే వచ్చాయని కట్టుకథలో గట్టికథలో గాని జాతిపుట్టు కథలు ప్రచారం లోనికి వచ్చాయి కాకతి ప్రతాపరుద్రుని భార్య చెవికమ్మ ఒకసారి కొల్ల బోయిందట దానిని గాలించి పట్టుకొని తీసుకు రావడానికి నలుగురు కొడుకులో, నలుగురు శూరులో బయలుదేరారు ఆ నలుగురే ఈనాలుగు కులాల మూల పురుషులయ్యారట ప్రసిద్ధ కావ్యకర్తలు ఈ కథల్లో ముఖ్య మైన సారాంశాన్ని తమ కృతిభర్తల వంశ వర్ణనలోనికి ఎక్కించారు

శ్రీనాధుడు తన భీమేశ్వర పురాణంలో ఇలా చెప్పాడు విష్ణుమూల పాదపంకజంనుండి ఒకపావన వర్ణం ఉదయించింది ఆ పుణ్యవంశం "నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె అందు బద్మనాయకులన, వెలమలన, గమ్మలన, సరిసర్లన, వంటర్లన బహుప్రకార శాఖోపశాఖ భిన్నంబులైన మార్గంబుల గోత్రంబు లెన్నియేనియు జగత్ప విత్రంబులై పంటదేపటి మహానీయంబు బాకనాటి దేశంబున భద్రపీఠంబు నధివసించి " వుండేది [2] ఈ పంటదేసటి వంశాలనే రెడ్లని పిలుస్తారు

శ్రీనాధునిలాంటి కవులు ఏమనివర్ణించినా వేమనగారు జనశ్రుతిలో వున్న చారిత్రాక విషయాన్ని ఒకపద్యంలో చెప్పారు,

---

1 చూ॥ 'రెడ్డిసంచిక'లో కుందూరి ఈశ్వరదత్తుగారిరెడ్డి పదోత్పత్తి వికాసం అనే వ్యాసం

2 భీమేశ్వర పురాణం - శ్రీనాధుడు, 1-32

పాకనాటి రెడ్డి పరగ మూటారెడ్డి
యెసగు తోట పెద్ద యెఱ్ఱరెడ్డి
మొరకులందరు భువి హరువొప్ప మిన్నంటి
ప్రతిభకెక్కి రట్టె పరగ వేమ[3] [వే సూ ర 2483

శ్రీనాధుని వర్ణనవల్లా, వేమనగారి పద్యంవల్లా పాకనాటిరెడ్లు ప్రభువులై పాలించారన్న విషయం రూఢైయింది ఆంధ్ర దేశచరిత్రలో క్రీ శ 1324 నుండి 1434 దాకా నూటపదేళ్లపాటు రెడ్డిరాజుల రాజ్యం ఒకవెలుగు వెలిగింది కొంటవీటి రాజ్యానికి ఒకవేమయ్య మూలపురుషుడు ఆ వంశంలో

ప్రోలయ వేమ (1325-1349)
అనవేమ (1361-1381)
రాజవేమ (1398-1418),
పెదకోమటివేమ (1363 1415)
కోమటివేమ (1430-10)
కాటయవేమ (1385-1423]
అల్లయవేమ [1434-1437]

అనే ప్రభువులు కనబడతారు మన వేమనగారి పేరులోనూ ఈ రెడ్డిరాజుల పేర్లలోమ ఉన్ననామ సామ్యాన్నిబట్టి వేమనగారికీ కొండవీటి రెడ్డిరాజులకూ సంబంధం కల్పించడానికి కొందరు పరిశోధకులు వ్యర్థప్రయత్నాలు చేశారు

వేమనగారి పద్యాలను కూలంకషంగా పరిశీలించిన పరిశోధకులు మాత్రం ఆయన రాచరెడ్లుకాదని తేల్చారు పల్లెటూరిలో ప్రఒలులైన రెడ్లను ప్రభురెడ్లని పిలుస్తారు ఇప్పటికీ ఈమాట వ్యవహారంలో ఉందట ఇటువంటి పల్లెటూరి ప్రభురెడ్లగుంపుకు చేరి, అన్నవస్త్రాలకు కొరతలేక అపుసప్పుల పాలుకాక భూమికోడి కలిగి ఆవులూ గొర్రెలూ సమృద్ధిగా గల మంచి నెమ్మదైన సంసారంలో మన వేమనగారు జన్మించారని రాళ్ళపల్లివారి అంచనా [4]

వేమనగారి తెగను నిర్ణయించడం కష్టం అని బండారు తమ్మయగారు 'కాపు' పదాన్ని ప్రత్యేక కులసూచకంగా భావించక ప్రకృతి మాత గారపు కొడుకు కుఱ్ఱలగు కర్షక కుమారులకు సూచకంగా భావించారు [5] ఇదే మేల

---

3 ఈ నాలుగు పాదాల ఆటవెలదిలో, పూర్తిమకుటం తేదు వావిళ్ళ వారు 1955 ప్రచురింప ప్రతిలో మూడవపాదాన్ని మొరకులందరు భువి మొన గాండ్లు అయిరయా 'అనేపాదాన్నిముద్రించారు (పద్యం సంఖ్య-2713 )

4 రాళ్ళపల్లి-వేమన (1945 ముద్రణ)పుట 46

5 బండారు వేమన చరిత్ర-పుట-92 అని డాక్టర్ గోపి కోడ్ చేశారు

న్నారు ఈ అభిప్రాయాలతో ఏకీభవించి వేమనగారి పద్యాలలో కనబడే వ్యవసాయిక పరిజ్ఞానాన్ని ఆధారం చేసుకుని డాక్టర్ గోపి వేమనగారు రైతుకుటుంబానికి చెందినవారుగా నిర్ణయించారు[6] నేను సేద్యంచేసే రెడ్ల తెగకు వేమనగారు చెందుతారని ముందు చెప్పిన కొన్ని ఉపయుక్తుల వల్ల తేల్చాను

గ్రామాధికారులుగా, సైనికులుగా, వ్యవసాయదారులుగా జీవనాన్ని గడిపే రెడ్ల గురించి క్రీస్తుశకం పదహారో శతాబ్దం నుంచీ తెలుగు సాహిత్యంలో వివరాలు తెలుస్తున్నాయి సేద్యాన్ని జీవనాధారంగా చేపట్టిన రెడ్ల ఆచారవ్యవహారాలూ అలవాట్లూ కులకట్టుబాట్లూ మొదలైనవాటిని క్రోడీకరించి విశ్లేషణ చేస్తే వేమనగారి సంపూర్ణ సాంసారిక రూపం అవగాహన చేసుకోవచ్చు

సేద్యాన్ని చేపట్టిన రెడ్లలో స్త్రీలూ, పురుషులూ, రోజంతా పాటుపడే శ్రమజీవులు రెడ్లు పగలెల్ల పనిచేసి రేయెల్ల కుంభకర్ణ నిద్రపోతారని పాలవేకరి కదిరిపతి వర్ణించాడు[7] కాపు గుబ్బెతలు కూడా పొద్దువాలేదాకా చేలలోపల తిరిగి మాపునంతకు ఇండ్లకు మరలిపోతారని పామర భామినులవర్ణనలో చిమ్మపూడి అమరేశ్వరుడు చెప్పాడు[8] రెడ్లుతమ చేలవద్ద గుడిసెలు వేసుకుని మంచెలు కట్టుకొని, పిట్టలనుండీ దొంగలనుండీ, పంటను కావలి కాసేవారు వానాకాలంలో కూడా చేలలోనే గుడిసెలలో ఉండేవారు వారి స్త్రీలు ఆ ముసురులో అంబలిగిన్నెను బుట్టలోపెట్టి నెత్తిమీద పెట్టుకొని దానిపై జమ్ముగూడు వేసుకుని కావలిగావున్న తమ పురుషుల దగ్గరకి తీసుకుని వెళ్ళేవారు ఇళ్ళపట్టున ఉండేటప్పుడు రెడ్డిసానులు చేవపీటమీద కూర్చొని లోకాభిరామాయణం చెప్పుకుంటూనే నూలు వడుకుతారు[9] రెడ్లు పత్తిపండించేవారు కనుక ఇంటింటా తప్పకుండా మధ్యాహ్నాలలో స్త్రీలు మాత్రం రాట్నం పట్టి పదారింటి తరము నూలు వడికేవారు రెడ్డిసానులు కూడా జొన్నచేలుకు మంచెవేసి కావలి కాచేవారు ఇప్పపూవు ఏరి వాటితో సారాయి చేసుకొనేవారు[10] రెడ్డిసాని కమ్మసారాకి సంచకరమిచ్చేదని కదిరీపతి శుకసప్తతిలో చెప్పాడు "(2-435)

---

6 డా॥ గోపి ప్రజాకవి వేమన-పుట 107

7 శుకసప్తతి– 2-330

8 విక్రమసేనము - పద్యం - 51 చూ॥ సమగ్ర ఆంధ్ర సాహిత్య మూడవ సంపుటి-పుట 128

9 శుకసప్తతి-2-418 నుండి 424

10 సురవరం ప్రతాపరెడ్డి ఆంధ్రుల సాంఘిక చరిత్ర పుట 333

రెడ్లలో స్త్రీలూ, పురుషులూ ఒళ్లువంచి ఇంటిపనీ పొలంపనీ చేసు కొంటూ పుష్కలంగా పంట పండించేవారు పాడిఉండేది వస్త్రాలకు లోటు లేదు పంటలో దివాణం వారికి ఇవ్వవలసింది ఇచ్చి సుష్ఠుగా తినిబతికే వారు చాలామంది రెడ్లు సేద్యంచేసి జీవిస్తూఉంటే కొందరు రెడ్లు గ్రామాధి కారులై పెత్తనం చెలాయించేవారు దొంగలను పట్టుకొనడం, శిక్షించడం, తగువులు తీర్చడం గ్రామరక్షణ చేయడం వాళ్ళవిధులు సామాన్యరెడ్లు గురుగు, చెంచలి, కుమ్మి, లేత తగిరిసాకు కూరలను చింతచిగురుతో కలిపి నూనెలోపోసి పొడికూరగాచేసి అన్నంలో కలిపితినేవారు మంచంకింద మేకెరువు కుంపటి పెట్టుకొని వానాకాలంలో పడుక్కొనేవారు[11] కొంచెం మోతుబరిరెడ్లు కప్పురభోగివంటకాలూ కమ్మనినేయీ, వడియాలు ఆరగించే వారు ఈ రెడ్లిదొరలకు మేలుదుప్పట్లు తోరపు పచ్చాడాలు ఉండేవి. వేళ్ళకు గుత్తపుటుంగరాలు ఉండేవి[12]

రెడ్ల ఇళ్లు వాసయోగ్యంగానూ, జీవితావసరాలకు సౌకర్యంగానూ ఉండేవి వాకిట రచ్చరాయి వంచతిన్నెలు, గొప్ప ప్రహరీగోడ, కంప తెట్టులు, రాకట్టు ముంగిట మల్లెసాలలు, దేవరచవికె, కోళ్ళగూళ్ల, గొర్రు, గురుగడి, యేడికోలలు, కాడి, పలుపులు ఇవన్ని పెట్టే అటకలు, దూడలు, కోడెలు, గిత్తలీనిన మేటిగొడ్లు, ఇరుకుమాను, పెరటిలో ఎక్కుబావి చోప్పు, పెద్దవాములు, జనుము దుబ్బు, కోలూ, పిడకల కుచ్చెల, దాలి మొదలయి నవి ఇంట్లో ఉండేవి[13] కొందరి ఇళ్ళలో ముంగిట పులిజూదాలు గీచిన రచ్చ బండలు ఉండేవి వాటితోపాటు పత్తిగూటాలూ, మంగలాలూ ఉండేవి[14] రెడ్లు తమ పొలాలలో వడ్లు, కొర్రలూ, రాగులూ, కాయధాన్యలు, కాయ గూరలూ పళ్లు పండించేవారు

దక్షిణాదిని ఉండే రెడ్లందరూ ఒకనాడు మాతృస్వామ్యంగల ద్రావిడ జాతులకు సంబంధించినవారే మేనరికం మాతృస్వామ్యానికి నిదర్శనం. పెళ్లినాడు మేనమామకు ప్రాముఖ్య ముంటుంది ఇల్లరికం ఇంకో నిదర్శనం. మాతృస్వామ్యమున్న సంఘంలో ఆడపిల్ల పుట్టింటనే ఉంటుంది అల్లుడు కూడా అయింటనే ఉండాలి రెడ్లలో మేనరికముంది, ఇల్లరికం కూడా ఉంది.

---

11 ఆముక్తమాల్యద-4-134

12 రఘునాథరామాయణం 2-13

13 శుకసప్తతి 2-408

14 హంస వింశతి – 4-124

మాతృస్వామ్యంతో బాటు ఆర్థిక స్వాతంత్ర్యంగల స్త్రీలకు ఆధిక్యముంటుంది రెడ్లఇళ్ళలో ఆడపెత్తనం ఉంటుందని ఎడ్గార్‌థర్‌స్టన్ వివరించాడు[15] ఈ పెత్తనం ఒక్క వ్యవసాయంలో మాత్రం ఉండదు నెచ్చానికి తగినంతగా కాసు వీసాలుచేతిలో ఆడుతూఉంటే విచ్చలవిడితనం కూడా అబ్బురంకాదు జంకూ గొంకూ లేకుండా ఇతర స్వాతంత్ర్యాలను కూడా రెడ్డిసానులు అనుభవించేవారు

మన జానపద సాహిత్యంలో ఆర్థిక విషయాల గురించి పరిశోధనలు అట్టే జరగలేదు – కృష్ణశ్రీగారు సంకలనంచేసిన 'పల్లె పదాలు'లో కదురు పాట ఒకటి ఉంది[16]

వడుకు వడుకూ కదుర వడకవేకదురా
ఏకుల్ల బుట్టంత ఎల్లుండి సంత
ఏకేకు ఒకబార ఎల్లుండి సంత
నాయేకులై పోయె నాకేటిచింత

యేకుల్ల యెల్లక్క పత్తి పుల్లక్క
రాటాల రామక్క రావె పోదాము
కదురు సల్లం గుంటె కదిలింతుగోల్కొండ
మగడెందుకే తగని మగ డెందుకే

(పల్లె పదాలు - పుట 32.

ఈ పాటకు ముందుమాటగా కృష్ణశ్రీగారు గమనించదగ్గ విషయాలు చెప్పారు "ఈ కదురుపాట పల్లెలవారి ఆర్థిక జీవనానికి చక్కని అద్దము స్త్రీ యొక్క ఆర్థిక పారతంత్ర్యమే మగవాని జులుమునకు మద్దత్తు 'కదురు చల్లగుంటే' తగని మగడెందుకూ ?"

ప్రతిదినమూ మధ్యాహ్నాలలోనూ నూలువడికే రెడ్డి సానులకు వారం తిరిగేసరికి సంత వస్తుంది కనుక చింత ఉండదు తగిన మగడున్నా లేక పోయినా ఆత్మవిశ్వాసం లోపించదు కుటుంబంలోని ఆడపడుచు పాటు పడి ఆర్జించే సభ్యురాలు కనుక అటువంటి వ్యక్తిని ఇంకొక యింటికి కోడలుగా ఇచ్చేటప్పుడు ఓలిమాడలు పుచ్చుకోక తప్పదు కొన్ని శతాబ్దాల క్రిందట రెడ్లలో కన్యాశుల్కమే గాని వరకట్నం లేదు అందుకే కూతురు పుడితే పొంగిపోయేవారు

---

15 Castes and Tribes of Southern India, Vol VI - p 245
16 ఆంధ్ర సారస్వతపరిషత్తు ప్రకాశకులు.

కొడుకు గలిగెనేని గునిసి యాడగ బోరు
కూతురొకతె పుట్ట గునియు చంద్రు
తనకు కొమరుడైన తను వెల్ల దోచునో
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1185)

కట్నం తెచ్చే కొడుకును చూసి ఇవాళ మురిసిపోతున్నట్టు ఆ రోజుల్లో ఓలిమాడలు తెచ్చే కూతురు ఒకర్తె పుడితే చాలు ఆనందంగా చిందులు వేసేవారు ఓలిచ్చి తెచ్చుకొన్న భార్యతో శోభ, కాంతి, వినయం, ఉత్సాహం, పద్ధతీ, రీతి, క్రమం, నేర్పు, వెరపు, విరివి ప్రతిభర్తా కోరు కొంటాడు ఈ గుణాలన్నింటినీ ఓజ అనే మాటలో తెలుగువాళ్లు ఇముడ్చు కొన్నారు అదిలేకపోతే అనర్థమే

ఓజమాలు మగువ యోలి మాడలచేటు
పాటులేని మగడు కూటి చేటు
పనికిమాలు దాసి బత్తెంబు చేటురా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 820)

అందుకే మగవాడుకూడా పాటుపడాలని వేమనగారు నొక్కిచెప్పారు

చమట కారునట్లు చట్టకు పనిచెప్పి
గడన సేసి కూడు కుడున వలము
తల్లి దండ్రి సొత్తు తాదినరాదయా
విశ్వదాభిరామ వినురవేమ[17]

(నేదునూరి– 1717)

సంసారంలో ఆడది కదురూ మగడూ కర్రూ, అవసరమైతే కర్రా కత్తీపట్టుకొంటేనే జీవితం చక్కగా వుంటుంది

కదురు మానమునకు కర్రు హారమునకు
కాపు జగడమునకు ఖడ్గ మట్టె
మూడు మొనలమీద మాజ్జగంబులునన
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 891)

---

17 ఈ పద్యంలో గణభంగాలుంటే ఇలాగ పరిష్కరించాను

పాటుపడితే లోటన్నదే వుండదు శ్రమపడడం ఆదిలో అలవాటు లేకపోయినా ప్రయత్నించగా అలవాటవుతుంది

రాయిరాయి గూర్చి రాయుంగ రాయంగ
నున్నవైన యట్టులన్ని పనులు
పాటు చేసినంత సరిపాటియగునయా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3316

మగవాడు పొలందున్నకపోతే, ఆడది ఏకులువడకకపోతే 'కుడువ కూడులేదు కోకలేదు' అయితే పాటుపడక పరాన్నభుక్కులై తేరగాతినే వాళ్ళకు ఇటువంటి జీవితంలో రసికత కనిపించదు శ్రీనాధుడు భోగాలు మరిగినవాడు శృంగారి శేఖరుడు అతడు చెప్పిన చాటువు చూడండి

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన యేకులెవడుకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడేమెనవున్[18]

ఎవరి బట్టలకు కావలసిన నూలు వాళ్ళు వడుక్కుంటే రసికత కాదు. ఎవరిపొలం వాళ్ళు దున్నుకుంటే రసికతకాదు, తమపొలంలో తాము పండించుకున్నది తింటే రసికత కాదు అని తేలుతున్న దన్నమాట గ్రామీణులకు తెలిసిన రసికత కాయకష్టం చేయనివాళ్ళకు తెలియదు సన్నన్నంకాక జొన్న కూడు తిన్నా దానికే ఆధరవులు కావాలి

నేయిలేని కూడు నీయాన కసువది
కూరలేని కూడు కుక్కతిండి
ప్రియములేని కూడు పిండంపుకూడురా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 2307

పాటుపడే పల్లెటూరివారు లేనిపోని భోగాల జోలికి పోరు విని యోగానికి పనికివచ్చేవే వారికి కావాలి

---

18 వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణి మంజరి (1961 ముద్రణ) పుట 125

లవణ మెంత దానిలాభము గననెంత
కొద్ది దనుచు నెన్న కూడదయ్య
భోగ మేమిటికి నుపయోగంబె లెక్కగు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3358

ఉపయోగంతోబాటు ఉత్తమాభిరుచులు కూడా అనాటి గ్రామీణు లలో చాలామంది వ్యక్తం చేసేవారు ఏబ్రాసులంటే అందరూ ఏవగించు కొంటారు

మైలకోకతోడ మాసినతలతోడ
ఒడలు బడలి జడలనుండెనేని [19]
అధిక కులజునైన నట్టట్టు పొమ్మంద్రు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3183

ఒళ్లులాగే యిల్లు కూడా 'దినదినంబును నూడ్చి, యలికి పూసి మెత్తి అనువు పరచాలి' (2067) ఇల్లు ఇల్లాలూ చక్కగా ఉంటేనే సౌఖ్యం

ఫాలమునకుబొట్టు పడతికి తగ జుట్టు [20]
కాపురమున గుట్టు కలసికట్టు
ఉన్నజోడు లేకయున్నను బాడురా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2867

రెడ్డిసానులు బొట్టూ జుట్లతో సరిపెట్టుకోలేదు అయ్యలరాజు నారాయణ తన హంసవింశతితో ఇలాగ వాళ్ళ అభరణాలను పేర్కొన్నారు

మెరుగంచు కమ్మలు మెడనూలు గెరల ము
 క్కర యడ్డ బోగడలు కట్ల సరులు
తీరైన చింతాకు తీగె యల్లిక నాను
 పల్లేరు బూవులు బన్న సరము

---

19 'బడరిముదికి తోడనుండెనేని' అని వేమనూరి తొలిపద్య సంఖ్య 3722

20 పడతికి తగజుట్టు అనేది సాధు పారం అని నేను భావిస్తున్నాను చాలా ప్రతులలో 'పడతికి జుట్టును' అనే పారం వుంది అంత్య ప్రాస పాటింపు ఈ పాత పారాంవల్ల చెడుతుంది

కుప్పె సౌరము మెచ్చుకొన్న సూసలదండ
యందగించిన జోడు సందిబొండె
నిగరమైన సిరాజి వగడాలచేకట్లు
కాలికడెంబు లుంగరపుజోళ్లు

గిలుకు మెట్టిలుంజుటీల జిలుగు రైక
సన్నమౌ వేయుగన్నుల చలువచీర
పసిమి జల్లెడు ముంజేతి పచ్చలమర
దుడ్డెతనమున తిరుగునా రెడ్డిసాని [హంసవింశతి 4-138

ఈ పద్యంలో 'వేయిగన్నుల చలువచీర' అనే ప్రయోగంవల్ల ఒక రకం గళ్ళచీరను సూచిస్తున్నాడు దీనిని ఊళ్ళో జాతరలకు కట్టుకుంటారు నాలుగు కొలుకులు తొగరు రెండు కొలుకులు తెలుపు పెట్టి నేసిన చీరను రాయలసీమలో 'ఎమ్మనూరిఎయ్యిగండ్లకోక' అంటారు[21] ఈ పద్యం చీరనూ, రవికనూ, పేర్కొన్న కవి పైటను చెప్పలేదు అది చాలా ముఖ్య మని దానిని మరొక కవి చెప్పాడు

తిరునాళ్ళకైపోయి తిరుపతిలోగొన్న
నొక్కుపూసలపేరు టెక్కుచూపె
జిగికుందనము గూర్చి మగడుచేయించిన
మెరుగు కమ్మలు వింతమెరపునెరప
దనుజూడవచ్చుచో దల్లితెచ్చినయట్టి
యల్లికనాను సోయగమొసంగ
మొదటి కోడలిదంచు తుది నత్త యిచ్చిన
చుట్టుమట్టెల జోడుసొంపునింప

గడియంబులు కెంపురవ్వల యుంగరము వెండి
కుప్పెసౌరంబు కురుమాప్రకూసలలమ్మ
చీర కుడిపైటలోపల సిస్తు రవిక
యొసగచరియించునిట్టు లాయమ్మెలాడి [శుకసప్తతి-2-411

పాలవేకరి కదిరీపతి వర్ణించిన ఈ యెమ్మెలాడి కూడా రెడ్డిసానే ఈ పద్యాన్నే ఉదాహరించి సురవరం ప్రతాపరెడ్డిగారు వ్యాఖ్యానించారు కూన

---

21. చూ॥ మాండలిక వృత్తిపదకోశం (ద్వితీయ సంపుటం) చేనేత పదాలు పుట - 357

లమ్మచీరను కూనలిచ్చు దేవతకు నైవేద్యమిచ్చి కట్టుకొంటారట "ఇది రాయలసీమలో యాచారమై యుండెను 'కుడిపైయిటలోపలి సిస్తురవిక' అనుటలో చాలాయర్థమున్నది రెడ్లలో మోటాటిస్త్రీలు కుడిబుజము మీదకి కొంగు వేసుకొందురు పాకనాటి వారుకూడా ఎడమపైట మీద వేసుకొందురు ఇప్పుడు మోటాటివారు కూడా ఎడమ పైట వేసుకుందురు పూర్వము కుడి ఎడమపైట పట్టింపు చాలా యుండెను చాలా యేళ్లక్రిందట కుడి ఎడమల పైటల వారికి పోట్లాటలు జరిగి మద్రాసు హైకోర్టులో తీర్పు చేయించుకొనిరి "[22]

ఈ కుడి యెడమపైటల పట్టింపుల గురించి బోధపరుచుకోవాలంటే ఒకనాటి మన గ్రామీణ వ్యవస్థను తెలుసుకోవాలి ఏ గ్రామంలోనైనా పూర్వం 'పన్నిదరాయగాళ్లు' ఉండేవాళ్ళు గ్రామంలో రైతు దగ్గర మొత్తం సంవత్సరానికి నిర్ణయించుకొన్న ప్రకారం కళ్ళంలోని ధాన్యం తీసుకొనే వివిధ వృత్తులవాళ్ళను అయగాళ్ళంటారు అకారాదిగా అయా వృత్తుల కులాలవాళ్ళ జాబితాను చూడండి

| | | | |
|---|---|---|---|
| 1 | కంసాలి | 7 | నేరడి |
| 2 | కమ్మరి | 8 | పురోహితుడు |
| 3 | కరణం | 9 | మంగలి |
| 4 | కుమ్మరి | 10 | మాదిగ |
| 5 | చాకలి | 11 | రెడ్డి |
| 6 | తలారి | 12 | వడ్ల |

ఈ పన్నెండుమంది గ్రామాధికారుల, గ్రామ సేవకుల కోసమేకాక రైతు ఇనాం అయగాళ్ళకోసం కూడా పంటను పండిస్తాడు దేవమాన్యం, రెడ్డిమాన్యం విడిగా ఉంటాయి మరపతి జంగాలు, తమ్మిళవారూ, మేటి గొల్లలూ, బోయవాళ్లు నేసే గమళ్లు మొదలైనవారు గ్రామంమీద బతకవలసిన వారే

గ్రామాధికారులలో రెడ్డి కరణం అధికులు సాతవాహనుల కాలం నుంచి మనగడ్డపై 'గ్రామణులు' పెద్దలుగా ఉండేవారు హాల సాతవాహనుడు గాథా సప్తతిని సంకలనం చేశాడు దానిలో కొన్ని ప్రాకృత గాథ

22 సురవరం ప్రతాపరెడ్డి ఆంధ్రుల సాంఘిక చరిత్ర (ద్వితీయ ముద్రణ) పుట 334

అను రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అనువదించారు గ్రామణి అనే పదాన్ని రెడ్డి అనే మాటతో అనువదించారు (దీనికి కట్టమంచి రామలింగారెడ్డిగారు అభ్యంతరం చెప్పారు, అంతకంటె మంచిపదము నాకు తోచదు మా సీమలో గ్రామాధికారికి రెడ్డి అనియే వ్యవహారము" అని శర్మగారు చెప్పారు. "ఇది ఇప్పటి రెడ్డిజాతివారికి ప్రత్యేకముగా అన్వయించునది కాదు" అని శర్మగారు హెచ్చరిక చేశారు[23] వేమనగారు ఆనాటి ఊరి పెద్ద అయిన రెడ్డిని గ్రామకర్త అని పేర్కొన్నారు

కల్లలాడువాని గ్రామకర్త యెరుగు[24]
సత్యమాడు వాని సామి యెరుగు
పెక్కుతిండి బోతు బెండ్లా మెరుంగురా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 972

కాపు, కరణం కలిసి ఉంటేనే గ్రామానికి మంచిది ఇద్దరూ కావడి కుండలవంటివారు

కాపులేని వూరు కరణమునకు కీడు
కరణము పగచేత కాపులేడు
కాపు కరణములును కావడి కుండలు
విశ్వదాభి రామ వినురవేమ వేమనూరి - 1300

గ్రామంలోని పన్నెండుమంది ఆయగాళ్ళని బారా బలవంతులని కూడా పిలుస్తాడు వీళ్లలో కొందరు ఎంత కష్టపడ్డా ఫలితాన్ని దోచుకొనే వాళ్లు వేరే వుంటారు

కాపులు కరణాలు గంసాలి భక్తులు
కట్టకడ వరకును గష్టపడగ
బరగి గుఱ్ఱములకు బాపలకును దక్కు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1052

వస్తూత్పత్తి చేసేవాళ్లూ, వ్యాపారాలు చేసేవాళ్లూ వాటికి సంబంధించిన వ్యాపకాలవాళ్లూ స్వలాభాలను సంరక్షించుకోవాలంటే కలసినట్టుగా

---

23 శాలివాహనగారా సపశలిస్వాము (1964) పీఠిక పుట XXV

24 'గ్రామకర్త అన్నదే సాధుపాఠమనుకొంటాను D 1721 ప్రతిలో 2-20 లో ఈ పాఠకం ఉంది బందరు, నేడునూరి పాఠాలు గ్రామభర్తని అనే

ఉండాలి ఆర్థిక కారణాలవల్ల గ్రామాలలోని వివిధ వృత్తులవాళ్లు ఎడమ చేతి కులాలుగా కుడిచేతి కులాలుగా చీలారు నేను యిప్పటిదాకా సేకరించిన ఆకరాలనుబట్టి ఆ కులాల విభజన ఇలా వుంటుంది [25]

**ఎడమచేతికులాలు**

1 కంచరి
2 కంసాలి
3 కమ్మరి
4 కాసే
5 దేవాంగులు
6 బేడర్లు
7 బేరిసెట్లు
8 వడ్రంగులు
9 మాదిగలు

వీళ్లుకాక ఇంకో 89 కులాల వాళ్లు ఈ వర్గంలో ఉన్నారు మొత్తం 98 జాతులవారు ఈ ఎడమచేతి వర్గంగా ఉండడానికి ఒప్పందం చేసుకొన్నారు

**కుడిచేతికులాలు**

1 అద్దకంవారు
2 ఓడ నావికులు
3 ఓడ వడ్రంగులు
4 కుమ్మరులు
5 కోమట్లు
6 గొల్లలు
7 చాకళ్లు
8 జాండ్రవాళ్లు
9 జైనులు
10 పట్టుసాలెలు
11 పద్మసాలెలు
12 పల్లకీ బోయీలు
13 మంగళ్లు
14 యానాదులు
15 రెడ్లు
16 మాలలు

ఈ వృత్తులవాళ్ళే కాక భోగంవారు కూడా కుడిచేతి భోగంవారూ, ఎడమచేతి భోగంవారూ అని రెండు తెగలుగా ఏర్పడ్డారు బ్రాహ్మణులూ, సాతానులూ మొదలైనవారు తటస్థులు అయితే అధికార వర్గాన్నే బల పరుస్తారని భావించటం తప్పులేదు

రెడ్లు కుడిచేతికులాలకు చెందినవాళ్ళయినా వాళ్ళలో కొన్ని తెగల వాళ్ళు ఎడమ పైటలు వేసుకొనేవారని గమనించాలి ఎడమ పైటవేసుకొన్న

---

[25] C S Srinivasachari THE ORIGIN OF THE RIGHT AND LEFT HAND CASTES DIVISIONS' Journal of Andhra Historical Research Society, Vol IV PP 77 - 85

రెడ్డిసానుల వర్ణన ఇప్పటిదాకా మన సాహిత్యంలో నాకంట పడలేదు భావి పరిశోధనవల్ల దొరుకుతుందేమో చూడాలి పైటలు వున్నా రవికలు తొడుక్కోని కులాలు కొన్ని ఉన్నాయి

పెడకంటిరెడ్లలో స్త్రీలకు రవికలుగాని తాళిగాని ఉండవని ఎడ్గార్ థర్‌స్టన్‌రాశాడు ఈరెడ్లు కర్నూలు జిల్లాలో ఉన్నారు పాకనాటి రెడ్లు వితంతు స్త్రీలను మళ్ళీపెళ్ళి చేసుకోనిస్తారు , అయితే తాళిగాని గాజులుగాని ధరించ నివ్వరు తిరునల్వేలి రెడ్లలో పదహారు ఇరవై సంవత్సరాల ఈడున్న ఆడ పిల్లకు అయిదా రేళ్ళవయస్సున్న కుర్రాడినిచ్చి పెళ్ళిచేసేవారు పెళ్లికొడుకుకు యుక్తవయస్సు వచ్చేవరకూ ఆ యువతి కుటుంబంలోని యింకొకరితో, తరుచుగా మేనమామతో, కాపురం చేస్తుందట [26]

బహుశా ఇటువంటి ఆధారాన్నే దృష్టిలో పెట్టుకొని వేమనగారు ఈ కింది పద్యాన్ని చెప్పారేమో

ఈడుగాని దానితోడుకు పాల్పడి
జోడు గూడుటేమి సూటిగాదు
కూడు దప్పెనేని గుణములు కొంచమౌ
విశ్వదభిరామ వినురవేమ

ఈ పద్యానికి ముసిలివాడు పడుచుపిల్లను చేసుకొనడమనే అర్థంతో ఇవాళ సర్వసామాన్యంగా అన్వయించుకోవచ్చు ఇప్పటిదాకా అంతే చేస్తున్నారు అయితే ఆనాటి సాంఘిక పరిస్థితులు తెలిస్తే నూతన విశ్లేషణ సాధ్యమవుతుంది

పై పద్యంలో మగవాడు ఈడుగానిదాని తోడుకు పాల్పడ్డాడు బలవంతాన అయిష్టంగా కట్టపెడితే తప్ప పాల్పడడం అనే పద ప్రయోగానికి అర్థం ఉండదు ఈ సూటిగానిజోడును వదులుకొంటే కూడు తప్పుతుంది అంటే తల్లిదండ్రులు, కులపెద్దలు నిర్ణయించిన సంబంధం ఉత్తరోత్తరా కాదంటే జీవనోపాధికి అంతరాయం రావచ్చు

ఇటువంటి 'వరహీనం' గల కాపురానికి సంబంధించిందో కాదోగాని పూర్వం ఒకపాట ప్రచారంలో ఉండేది అది 1930 ప్రాంతాలలో గ్రామ

---

26 Edgar Thurston 'CASTES AND TRIBES OF SOUTHERN INDIA' Vol III P 240 (1934)

ఘోసుపాటగా కూడా ప్రజలలో వినబడింది దాని 'సాహిత్యాం' కొంత చూడండి[27]

వద్దు వద్దంటే మెడగట్టినావు - పెద్ద
ఎద్దంత పెళ్ళాన్ని నీవు ॥వద్దు॥

అలుగాదది ఎర్రతేలు
అంతకన్నా బావు బాలా మేలు
యేలాగు ? పొమ్మంటే ఏడుస్తుంది – అది
యేడిస్తే దుఃఖ మొస్తాది ॥వద్దు॥

వేమనగారు ఈడుగాని దానిగురించి కాకపోయినా మగని మాటకు అడ్డం వచ్చేదానిని ఆలుకాదు నుదటి వ్రాలుగాని అన్నారు (311) అలుకాదదే మరగాలు గాని అని ఇంకోపద్యంలో అన్నారు (D - 1721 - 2 - 15) కట్టుకొన్నది లేకపోతే కడుపుకు పెట్టేవాళ్ళు ఉండరన్నది సాంసారిక సత్యం

ఆలులేనివాడు నశన మందనివాడు
కాసువీసమేమి గనని జనుడు
వేషములను గట్టు రోషముల్ జేయును
విశ్వధాభిరామ వినురవేమ[28]

(D - 13124 (SKT) - 201

ఇల్లూ ఇల్లాలా లేకపోతే మగవాడు కాసువీసం చేయని ఒకనాటి వ్యవస్థ ఇందువల్ల తెలుస్తుంది ఈడుగాని పెళ్ళిళ్ళే కాక ఇతర విధాలయిన పెళ్ళిళ్ళను కూడా వేమనగారు పేర్కొన్నారు

ఇచ్చి పుచ్చుకొన్న హితమైన మనువులు
అల్లి దామరవలె ననువుమీరి

27 సర్వజనా నందకరంబగు "గ్రామ పోనుపాటలు' హుళక్కి బుక్ డిపో, గుంటూరు పాట నెంబరు 246 పుట 70

28 ఈ పద్యం మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంధాలయంలోని సంస్కృత గ్రంథాల సంకలనంలో వున్న 'వేమన పద్యాలు' భాగంలో ఉంది ఈ ప్రతి ఇతర పరిశోధకుల దృష్టిలో పడనట్టులేదు ఇందులో చాలా అపూర్వమైన పద్యాలు ఉన్నాయి ఇది అకారాదిగా రాసిన ప్రతి - 675 పద్యాలు 'అ' కారంనుండి 'కాళ్ళ ' దాకా ఉన్నాయి దీనికి వేరే పత్రిక బ్రౌను సంకలనాలలో ఉందేమో చూడాలి

కావి, పూచి, పండి కడురమ్యమై యుండు
విశ్వధాభిరామ వినురవేమ

(D 13124 SKT 247

సుగుణవంతురాలు సుదతిగా ఇంటవుంటే సంసారికి ఇంక స్వర్గం వేరే అక్కర లేదన్నారు వేమనగారు దేవియున్న గృహము దేవాలయం అన్నారు

రెడ్లు వివిధ దేవతలను కొలుస్తారు పెళ్లినాడు చాకలివాళ్ల యింటి కెళ్లి గంగ విగ్రహాన్ని తీసుకువస్తారు దాన్ని పందిట్లో పెడతారు పందిరి రాటలు, పసుపుతాళ్ళతోరణాలు చాకలివాళ్ళ యింటికి ఊల్లడంలో వెళ్ళి తెచ్చుకొంటారు గంగ విగ్రహం చాకలివాళ్ళ ఇళ్ళలోనే మిగతావేళల్లో వుంటుంది

ఊల్లడం కిందనే కంసాలుల యింటికెళ్ళి తాళిబొట్లు రెండు తెచ్చుకొం టారు కుమ్మర్ల యింటికెళ్లి పదమూడు అరివేడి కుండలు తెచ్చుకొంటారు బ్రాహ్మణుడు ఒక్క కుండకే దారాలు కడతాడు మిగతా కుండలకు రెడ్లే దారాలు కడతారు

పెళ్లిళ్ళలో గంగమ్మను పూజించినా, రెడ్లు తాళ్ళమ్మ దేశమ్మ, పోతే రమ్మ, పుట్లమ్మ, అంకమ్మ మొదలైన దేవతలకు పొంగళ్ళు పెడతారు ఊరిబయట జరిగే అమ్మవారి జాతరులకు వెళ్ళేటప్పుడు రెడ్డిసానులు ముందు కదలగా వారి వెంటరెడ్లు నడుస్తారు

ఎడ్డెతనపు గయి సేకల
రడ్డులు నడిచిరి పురస్సరద్భార్యముగా
గుడ్డంబు చక్క గట్టం
బడ్డ మహాశక్తి దివ్యభవనంబునకున్

(పాండురంగ 3-75 )

ఈ పద్యంలో 'పురస్సరద్భార్యముగాన్' అనే పదబంధానికి "ముందు నడచునట్టి భార్యలు కలుగునట్టుగా అంటే తమ భార్యలు ముందుగా నడు వగా వారివెంట చనుట" అని అర్థం పదగుంభనానికి వేరు కెక్కిన తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యంలో ఈ పద్యం చెప్పాడు

పంటకాపుల యింటి పెళ్లిళ్లలో గంగ విగ్రహంతోపాటు మేకనూ, కావిడినీ ఊరేగింపులో గుడికిగాని కోనేరుకిగాని తీసుకువెళతారు ఈ

ఊరేగింపులో చాకలివాడు ఆడదానిరాగ వేషం వేసుకొని చిందేస్తూ ముందు సాగాలి [29] ఈ ఆచారాలన్నీ స్త్రీల ఆధిక్యతను సూచిస్తాయి

రెడ్ల ఇళ్లల్లో ఇంటిపనులకు గొల్లలను గమళ్లవారిని పెట్టుకొంటారు. మాలమాదిగలు కూడా ధాన్యం పనులు చేస్తారు ఒక్క వంటగది దేవర చవికె గదిలోనికి తప్ప మాలమాదిగలు అరమరికలు లేకుండా తిరుగుతూ పనిచేస్తారు [30] ఇంట్లో తిరిగే ఇతర కులాలవారితో ఊళ్ళో ఉండే వివిధ కులాలవారితో వేమనగారు సాయిలా పాయిలాగా ఉండేవారిని భావించ వచ్చు

ఏ గ్రామీణ వ్యవస్థలోనైనా విరివిగా కనబడే కులాలవారందరికీ ప్రత్యేకమైన వస్తూత్పత్తి బాధ్యతలు ఉంటాయి కూడు తర్వాత గుడ్డ ముఖ్యం చేనేత వృత్తిగల వాళ్ళలో తొగట, దేవాంగ, పద్మసాలె, పట్టు సాలె, కరిణేభక్త, జాండ్ర, సేనాపతి, మాల కులాలవారు ఉన్నారు దేవాంగులు ఎడమచేతి కులాలకు చెందినవాళ్ళు అందరూ నేతగాళ్ళే అయినా వేమనగారి కులంలో కొంతరే కీర్తి తెచ్చుకొన్నాము తూర్పు ఇండియా కుంపిణీవారు మనదేశంతో వస్త్రాల వ్యాపారం చేస్తున్న తొలి రోజులవి కొన్ని చేనేత కులాలవారినుండే సరుకు కొనేవారు వారే గొప్పవారిగా చెలామణీ అయ్యారు అందుకే వేమనగారు ఇలా చెప్పారు

సాలె, జాండ్ర మాలజాతుల వారలు
నేతగాండ్ర మనుచు నేల మీద
చెప్పుదురిల గాని గొప్ప వహించినా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 3891.

ఈ పద్యం ఏ సందర్భంలో చెప్పారో, అది ఏ చరిత్రాత్సవమైన ఆర్థిక దశలో చెప్పారో విశ్లేషణ చేయాలి – కుంఫిణీ ఏజెంట్లు దుబాసీల ద్వారా నేటివు వర్తకుల దగ్గర్నుంచి రకరకాల వస్త్రాలను కొనేవారు ఈ వర్తకులు కొందరు నేతగాళ్ళనే ఆదరించేవారు కుంఫిణీవారి రికార్డులు పరిశీలిస్తే వేమనగారి కాలంలో గొప్పవహించిన నేతగాళ్ళ భోగట్టాలు తప్పక దొరుకుతాయి

---

29 చాకలివారు పల్లకీ బోయిలుగా, కాగడాలువేసే వాళ్ళగా కూడా పని చేస్తారు రెడ్లూ చాకళ్ళూ కుడిచేతి కులాలకు చెందినవాళ్లే

30 Edgar Thurston C F T O F S vol III p – 245.

పాశ్చాత్య వర్తకులతోబాటు వాళ్ళ మతప్రవక్తులు కూడా తెలుగు గడ్డమీద సంచరించేవారు

1 PIERRE MAUDUIT మాడ్విట్ పాదిరి (1664-1711) రోమాపురి బ్రాహ్మణులము అనేపేరు పెట్టుకొని మతప్రచారం చేసే వాడు తొలిసారిగా పుంగనూరు రెడ్లకు బాప్తిస్మం ఇచ్చాడు తెలుగు నాట క్రైస్తవానికి ఇదేమొదలు ఇతణ్ని బ్రాహ్మణులు విషం పెటి చంపించారు

2 JEAN BAPTIST de la FONTAINE జీ, బాప్టిస్టు డి'లా ఫాటైన్ (మరణం 1718) మాడ్విట్ పాదిరీతో కలసి జ్ఞానబోధ స్వాముల వారనే పేరుతో తెలుగుగడ్డమీద క్రైస్తవ ప్రచారం చేశాడు 1701 నాటికి చిత్తూరుజిల్లా పుంగనూరిలో చర్చి కట్టాడు

ETIENNE LE GAC ఎటియెన్ని లీ గాక్ (1671-1738) సంజీవ నాధస్వామి అనే పేరుపెట్టుకొని ఈపాదిరీ మతప్రచారం చేశాడు. రెడ్లను క్రైస్తవంలో చేర్చాడు

ఇంక కొందరు జెసూటు పాదిరీలు భారతీయుల్లా పేర్లు పెట్టుకొని తెలుగుదేశంలో సంచరించేవారు[32] అయితే పైముగ్గురే వేమనగారి కాలంలో వేమనగారి ప్రదేశాలలో ఉన్నవారు ఈపాదిరీలు తాము రోమాపురి బ్రాహ్మణులమని చాలా నియమనిష్టలతో జీవితాన్ని గడిపేవారు అయినా వీరిగుట్టు బట్టబయలైపోయేది వీరిని బాగా గమనించిన వారికి వీరితో తత్త్వ విషయాలపై చర్చించేవారికి వీరిసంగతి అవగతమై ఉంటుంది బహుశా వీళ్ళని ఉద్దేశించే వేమనగారు ఈకింది పద్యం చెప్పారేమో

కొంకణంబుసేర కుక్కసింహము కాదు
కాశికేగ బంది గజముకాదు
వేరుజాతివాడు విప్రుడు గాడయా
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1172

32. వివరాలకు చూ॥ HISTORY OF TELUGU CHRISTIANS by a Father of the MILL HILL St JOSEPH SOCIETY (Printed a TRICHINOPOLY - 1910)

తెల్లవాళ్లని తెలుగువాళ్లు చాలా కాలందాకా 'జాతుల వాండ్రు' అని పిలిచేవారు వేరు జాతివాడు అనే మాటతో వేమనగారు రోమాపురి బ్రాహ్మణు లను పేర్కొన్నారో లేదో, తేల్చుకోవడానికి ఇంకొన్ని ఆధారాలు కావాలి 'జాతివారలు' మీద వారు ఇంకోపద్యం చెప్పి అందులోనూ బ్రాహ్మణ ప్రసక్తి తెచ్చారు

జాతి వారలెల్ల జాతివిద్యలు నేర్చి
జాణలైరి మీరి జగతి లోన
బ్రాహ్మణులను వారు బ్రహ్మము నెరుగక
విశ్వదాభిరామ వినురవేమ

(వే సూ ర 1590

రోమాపురి బ్రాహ్మణులతో బ్రహ్మము గురించి చర్చించి వారికి ఈ సంగతి తెలియదని తెలుసుకొన్నాక, ఈ పద్యం చెప్పారో లేక హైందవ బ్రాహ్మణుల గురించి చెప్పారో తెలియదు బహుశా గ్రామశిల్పులైన పంచాగం వారిని ఉద్దేశించారో ఏమో వారిమీద చాలా పద్యాలను వేమనగారు చెప్పారు

రాయియగు నహల్య రాము పాదము సోకి
యాడుదయ్యె ననెద రవనిజనులు
శిల్పి పదముసోక శిల లట్లె దేవతల్[33]
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3314

కాశి కేగుదమని కష్ట పడగనేల
సిగ్గెరుగరు సుమ్మి సృష్టివారు
శిల్పిపదము సోక శిల వేల్పుకాదొకో
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1103

పంచాణంవారిలో ఇతరుల గురించి కూడా వేమనగారు వివరించారు ఎడమచేతి కులాలవారైన వీరు స్వలాభాల సంరక్షణకు కొంచెం దుడుకుగానే పోరాడేవారు

కమ్మరీని దుడుకు కార్య వినాశంబు
వడ్లవాని దుడుకు వారపిడుగు

---

[33] శిల్పి పదము సోక శిలలెట్లు దేవతల్? అని అసాధుపాఠం అచ్చు వేశారు భావం చెడుతుంది రెండో పద్యం చూడండి

కాసెవాని దుడుకు కాకున్న బాణంబు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 936

పంచాణం వారిలో ఒకరైన కంసాలులు కుడిచేతి కులాలలోతోనూ వాళ్లవైపు మొగ్గే బ్రాహ్మణులతోనూ వాదం పెట్టుకొనేవారు వేమనగారు ఇత్తడిని పుత్తడి చేయాలనుకునే రోజులలో స్వర్ణకారులతో స్నేహంగా ఉండేవారు వారిలోని మంచిని ఎంచారు

కల్లలాడుదు రిల కంసాలి దొంగని
యతని సొమ్ము కెట్టు లతడు దొంగ
మన్ను బంగరుగను మరిచేసి పెట్టడా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 971

స్వర్ణకారులు వేమనగారిని చాలా అభిమానిస్తారు తమకు బ్రాహ్మణులతో వచ్చిన తగువులలో తమ వాదాన్ని నెగ్గించు కొందికి వేమనగారి పద్యాలలో చాలామట్టుకు చాలా చాలా అనువుగా ఉండబట్టి విశ్వబ్రాహ్మణులు వాటిని ఎంతో చక్కగా వాడుకొన్నారు 1814 లో చిత్తూరు జిల్లాలోని చదుర్పేరిలో మార్గ సహాయావారి అనే విశ్వబ్రాహ్మణునికీ పంచాంగం గుండయ్య అనే పౌరోహిత్యం బ్రాహ్మణునికీ పెళ్ళి పందిరి రాటల విషయంలో తగాదా వచ్చింది ఇద్దరూ వాదులాడారు గ్రామంలో పంచాయితీ జర్గింది చాలా విషయాలను చర్చించారు ఆ పంచాయితీలో మార్గసహాయా వారి కొన్ని వేమనపద్యాలను కొన్ని సందర్భాలలో ఉదహరించాడు

(1) మాలకులమునబుట్టి మాలల దూషింప
ద్విజుల కేల నిట్టి దొంగతనము
అది బుట్టినదాని యరసి తా జూడరా
విశ్వదాభిరామ వినురవేమ

(2) తన్ను తా నెరుగడు తానెవ్వరికి గురుడు
పాలు మాలినట్టి పనస కొడుకు
కాసువీసము కొరకుగట్టునే కర్మంబు
విశ్వధాభిరామ వినురవేమ

ఈ రెండు పద్యాలను మార్గ సహాయావారి తొలి పంచాయితీలో చదివాడు తర్వాత ఇంకో పంచాయితీ జరిగింది అప్పుడు ఇంకోపద్యం ప్రమాణంగా చూపెట్టారు

(3) తల్లి యూర్వశిలంజె తనయాలుమాదిగ
తాను బ్రాహ్మణుడనగ తగునె జగతి
వాసిష్ఠకులమతి వసుధలో నెరుగరా
విశ్వదాభిరామ వినురవేమ

రెండవ పంచాయితీ జరిగాక కొట్లాట కొట్లాటగా ముదిరింది. ఇరు పక్షాలవాళ్ళు కోర్టుకెక్కారు జిల్లా కోర్టులో మార్గ సహాయావారి మళ్ళీ వేమనగారి ప్రద్యాలను పరమ ప్రమాణాలుగా పేర్కొన్నాడు 1814లో కోరుకెక్కితే తర్వాత 1818లో చిత్తూరుజిల్లా అదాలతుకోర్టు జడ్జీ దేకర్ దొర డిసెంబరు 15వ తేదీనాడు తీర్పు చెప్పాడు ఈ వివాదం అంతటినీ మద్రాసులోని సి వి కృష్ణా బుక్ డిపోవారు 'చెన్నపట్టణము విశ్వబ్రహ్మణ సభలో చేరిన పాండూరు కుప్పాచార్యులచేత' తెనుగు చేయించి గ్రంథ రూపంలో ప్రకటించారు ఈ పద్యాలు ఆ పుస్తకంలోని 53 62, 72, 83 పుటలలో ఉన్నాయి ఈ ఉదాహృత పద్యాలలో కించిత్తు చందోభంగం వున్నా ఇవి వేమనగారి పద్యాలుగా సుప్రసిద్ధమైనదే

వేమనగారి పద్యాలను గ్రామీణులు పరమ ప్రామాణికాలుగ భావించి పంచాయితీలలో పబ్లిక్ కోర్టులలో ఉదహరించేవారంటే వారి ప్రభావం ప్రస్ఫుటంగా వెల్లడవుతుంది పరపీడన మీద బతికేవాళ్ళకు అవి కంటిగింపుగా ఉండవచ్చు అయితే సమాజంలోని శ్రమజీవుల పక్షాన వేమనగారు నిలబడ్డారు కనుక ఆ ప్రజలు వారిని గౌరవించారు, పూజించారు ఆయన వాళ్ళ కష్టసుఖాలన్నీ తెలిసినవారు శ్రమములోనే సర్వం పుటాయని, పడ్డ కష్టానికి ఫలితం దక్కనీయకుండా మధ్యలోనే కాజేసే వాళ్లుంటారని తెలుసు తేరగా పనిచేయించుకొని దొరలు కోటికి పడగెత్తుతారు. వెట్టి చాకిరీ ధనికులకు పెట్టుబడి,

పట్టి విడువరాదు పది లక్షలకు నైన
పెట్టి చెప్పరాదు పేదకైన
వెట్టి గొలవరాదు విభుడెంత ఘనుడైన
విశ్వధాభిరామ వినురవేమ (నేదునూరి - 2926

గ్రామ శిల్పులూ, ఇతర చేతిపనుల వాళ్ళు ఎప్పుడూ కూలికే పని చేయాలి

తలపు దలచి కూలి దగసేయ కివ్వడు
యొలపుదీర కివ్వడొక్క రూక

ముక్తినీని గురువు ముచ్చలకొడుకురా
విశ్వదాభిరామ వినురవేమ

(అకాడెమీ ప్రతి – 795

మూడవపాదం ముక్తికి సంబంధించినదైనా మొదటి రెండు పాదాలూ భుక్తికి సంబంధించినవే ఏ జీవన వ్యాపారానికైనా పెట్టుబడి ముఖ్యం ధనానికి ప్రాముఖ్యమున్న ఏ ఆర్థికవ్యవస్థ లోనైనా అప్పు తీసుకొంటేనే గాని పనులు జరగవు వడ్డీ ఇవ్వందే ఎవ్వరూ అప్పు పెట్టరు వడ్డీని వృద్ధి అంటారు అది అప్పిచ్చిన వాడి ధనానికీ, తీసుకొన్నవాడి ఋణానికీ వృద్ధి

అదన భుక్తిచేత మొదటిసొమ్ముకు హాని
కుదువ సొమ్ము కెన్న కొంతహాని
మొదటి పక్షమందు మూలకర్తకుహాని
విశ్వధాభిరామ వినురవేమ

(అకాడమీ ప్రతి – 509

వస్తూత్పత్తికి కారణభూతమైన 'వార్తవిద్యలెల ధూర్తుల పాలు' కావడంవల్ల సామాజిక జీవనంలో సంక్షోభం వస్తుంది ఏ ఆర్థికవ్యవస్థనైనా రూపొందించి నడిపించేది వాణిజ్య వర్గాలే పేరుకు మాత్రమే రాజు శాసకుడు అర్థనీతిని శాసించేది వణిజులే రాజును రాసిరంపాన పెట్టగలరు

రాజసమితి కెల్ల రంపముల్ వైశ్యులు
జూదగాండ్ర కాది జూదగాండ్లు
యోచనను దెలియరు యురక నర్థాపేక్ష
విశ్వదాభిరామ వినురవేమ

(అకాడమీ ప్రతి 405

ఉన్నతస్థాయి ఆర్థిక విధానాలలో రాజధానిని కైవసం చేసుకొన్న వాణిజ్య సంస్థలకు ఇది వర్తిస్తుంది పల్లెటూళ్ళలో "కోమటోని సొమ్ము క్రూరులపాలౌను" అని వేమనగారు గుర్తించారు ఈ క్రూరులను అదుపులో పెట్టేనాధుడెవడూ వుండడు

పుడమి యుప్పరంబు బురికొని జగముల
రక్షసేయగల్గు రాజులెవరు
మహిపతియనుపేరు మనుజున కేడదో
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ. ర 2581

వేమనగారి కాలంలో రాచరికాల రాజసం తేజం తప్పింది విజయ నగర సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది సామంతులు సంస్థానాధీశులైయ్యారు ధర్మార్థాలకన్నా కామానికే ఎక్కువ ప్రాముఖ్య మొచ్చింది తంజావూరు రాజ్య పతనం కావడానికి కారణభూతుడైన విజయరాఘవ నాయకుడు కొలువుకూటంలో తన కాముక చేష్టలను సగర్వంగా చాటుకొన్నాడు

"నములుతున్న తాంబూలాన్ని ఒక పడుచుపిల్ల నోటికి ఇచ్చేవాడు. ఒక శృంగారవతి కీల్జడను లాగేవాడు, పాదాల దగ్గర కూర్చున్న ఒక పిల్ల దాని పోకముడిని బొటనవ్రేలుతో సడలించేవాడు ఇంకో పడుచురొమ్ముపై గోటితో గిల్లేవాడు మరోవెలయాలిని పెదవిపై ముద్దు పెట్టుకొనేవాడు ఒక వన్నెలాడి వక్షోజం పై కస్తూరి పులిమేవాడు మరోపిల్లని కౌగలించే వాడు ఇంకోవిలాసవతిని తొడపై కూర్చో పెట్టుకొనేవారు"[34]

విజయరాఘవ నాయకుడలాగ విభ్రష్ట శృంగారంలో తలమునకలైతే అతని మీదకూడా పదాలు చెప్పిన క్షేత్రయ్య ఎంత రసవంతంగా రచించినా, విచ్చలవిడి శృంగారాన్ని పచ్చిపచ్చిగా పదాలకెక్కించాడు దానికోహద్దూ, పద్దూ, వాలీ, వరసా, వేళాపాళా, చాటూ మాటూ ఏమీలేవు పరకీయ శృంగారమే పరాకాష్టకు చెందింది బేగడ రాగంలోని ఈ పదం చూడండి

> చెరగుమాసి యున్నానని యోచన
> సేయ వద్దుర స్వామి
> దొరయౌ నా మువ్వగోపాల!
> పరసతులకు దోష మెన్నడు లేదుర[35] ॥చెరగు॥

ఈ నాయిక "అరసికుల తప్పుశాస్త్రములు నిజమనుచు నమ్మవద్దు రా" అని హితబోధ చేస్తుంది ఇటువంటి నాయికలే కొత్తమదన శాస్త్రాలురాస్తారు

> లోకములోన కొందరబలుల్ సతులం దనియింపలేక య
> స్తోకమనీష నన్యపురుషుల దమకాంతల నంట కుండ దా
> టాకులలోన వ్రాసిరి పరాంగన నంటుట దోషమంచు న
> య్యాకులపాటు జూచియిపు డాకుల పాటెనయంగ నేటికిన్[36]

---

34 చూ॥ సమగ్ర ఆంధ్ర సాహిత్యం - పదకొండో సంపుటం నాయక రాలలోయుగం II పుట 22

35 క్షేత్రయ్య పదములు - గిడుగుసీతాపతి సంకలనం పరకీయ విభాగం - పుట 105

36 శేషంవెంకటపతి శశాంక విజయం - (3 82)

సమర్తాడి పదిపూటనైన దగర్నుంచీ[37] సంభోగ శృంగారాన్ని ఈయుగం కవులు బజారునపెట్టారు వచ్చీరాని వయసైనా సరే పచ్చియొడలి బాలింతరాలైనాసరే[38] చెరగుమాసినా చెలరేగే కాముకులు 'ఒక్క సారికే యీలాగైతే ఒహెూ ఇది యేటీరతిరా' అని ప్రశ్నించే కామినులూ [39] మనపద సాహిత్యంలో వేసినన్ని వెర్రితలలకు లెక్కలేదు ఒక్క పదసాహిత్యమే కాదు కావ్యాలలో కూడా కట్లుతెంచుకొన్న కామం కనడుతుంది

ఈ యుగంలోనే ఈక్రింది శృంగార కావ్యాలు విచ్చలవిడిగా పెచ్చు రేగాయి

1 అహల్యా సంక్రందనం – సముఖం వెంకటకృష్ణప్ప
2 శశాంక విజయం – శేషం వెంకటపతి
3 సత్యభామా సాంత్వనం – తింనన మఖి లిరుకామయ్య
4 రాధికా సాంత్వనం – ముద్దు పళని
5 రాధ మాధవ సంవాదం – వెలిదండ్ల వెంకటపతి
6 దశావతార చరిత్రంలో – దరణిదేవుల రామయ్య
అహల్యా విలాసం –
రాధమాధవ ప్రణయం
తదితర ఘట్టాలు
7 సమీర కుమార విజయం – పుష్పగిరి తిమ్మన్న

అహల్య ఘట్టం

రాజాస్థానాలలోనూ, రాజధానులలోనూ, రాజాశ్రయంలోనూ రసికత గంగ వెర్రులెత్తి ఈ కావ్యాలలో పొంగిపొరలింది పుర వర్ణనలో వారకాంతలనూ, కథా ఘట్టాలలో సానివాడలను వర్ణించడం ప్రబంధ యుగంలో మొదలైంది సురవరం ప్రతాపరెడ్డిగారు రాయలనాటి నాగ వాసాన్నీ ధనికుల విలాసాన్నీ ఇలాగ క్రోడీకరించారు [40]

---

37 విస్సావారి క్షేత్రయ్య పదాలులో (1963 ముద్రణ) పద సంఖ్య 300
38 అందులోనే పదసంఖ్య 231
39 అందులోనే - పదసంఖ్య 149
40 ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట 268

"విజయనగరములో భాగపుసానుల సంఖ్య అపారముగా నుండెను వారిపై గణాచారి గుత్తాపన్ను వసూలుచేసిరి నగరమున నుండు 12000 రక్షకభటుల జీతాలు బోగము వారి పన్నులతో సరిపోయెడిది రాచవారు ధనికులు ఉంపుడుగత్తెల నుంచుకొనుటయు, ఆ ముచ్చటను ప్రకటించు కొనుటయు మగతనపు లక్షణముగా భావించిరి మంచి మంచి మంత్రులు, పాలెగాండ్రు, రాజులు కవులచేత అట్టి రసికతను వర్ణింపచేసికొనిరి సంపన్నులు తమ యుంపుడుకత్తెలను బోగమువారిని ఉత్సవాలలో వెంట దీసుకొనిపోయి జనులు చూచునట్లుగా వారితో సరసాలాడేవారు"

వేమనగారు పల్లెటూళ్ళలోనే ఎక్కువగా జీవితం గడిపినట్టు వారి పద్యాలవల్ల తెలుస్తున్నా పట్టణాల గురించి వారికి బొత్తిగా తెలియదనుకో కూడదు

పత్తనమ్ములందు బతులకు సతులకు
మోహ మెచ్చు దాని యూహలెచ్చు
ముక్తి మార్గమునకు యుక్తులే తెలియరు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర

పల్లెటూళ్ళలో ప్రబలులైన శ్రీమంతులు పట్నపు సానిని తన ఊరికి తెచ్చుకొని ఉంపుడుగత్తెగా పెట్టుకోలేడు

పత్తనమునగలరు ప్రౌఢాంగనలు వారు
పల్లెలందునిలచి బ్రదుక గలరె
సుఖులు పరముగోరి శోభింపలేరయా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3384

పట్టణాలలో వున్నా, పల్లెటూళ్ళలో ఉన్నా ప్రాయంలో వున్నవాళ్ళకి కామం సహజంగా ఏర్పడే నైజగుణం సంసారికి తప్పనిసరి పురుషార్థం

గ్రామీణ వ్యవస్థలో కామాన్ని ఖాయిదాలో పెట్టడానికి కట్టుదిట్టాలు ఉంటాయి వ్యభిచారాన్ని కూడా ఒక వృత్తిగా చేసి 'సేఫ్టీ వాల్వు'ను అనాది నుంచి అన్ని దేశాల్లోను ఏదో ఒక రూపంలో సాంఘిక యంత్రానికి అమర్చారు. వారకాంత, సంతబసివి, దొమ్మరిసాని ఉంపుడుగత్తెలవంటి వాళ్ళను గ్రామాలలో ఉండనిస్తారు సంసారులలో కూడా జారత్వం ఉంటుంది అవి అదుపుమీరి వికటించి కొంపలు కూల్చకుండా ఉండడానికి మారు మనవులను సంఘం ఒప్పుకొంటుంది

"రాయలసీమలో వెనుకబడిన తెగలలో మారు మనువు మామూలు వరుసగా నలువురు భర్తలకు 'విడాకు' లిచ్చి అయిదవ భర్తను పెండ్లాడిన స్త్రీ చినగౌడసాని ఇట్టి ఏడవభర్తను కట్టుకొనిన స్త్రీ పెదగౌడసాని గౌడసాని మాట ఆ తెగవారికి వేదవాక్యము కులము తగువులకై తీరిన ధర్మాసనమున గౌడసాని తీర్పు తిరుగులేనిది" అని పరిశోధకులు చెప్తున్నారు [41] వేరు వేరు కులాలకు వేరువేరు కట్టుబాట్లు ఉంటాయి

సాని అన్నమాట తెలుగులో గౌరవవాచకంగానే పూర్వం ఉండేది దొరసాని, రెడ్డిసాని, మంత్రసాని, వాపసాని, నాగపసాని మొదలైనవి గౌరవార్ధంలోనే వాడేవారు బమ్మెర పోతరాజుగారు తమ తల్లి పేరు 'లక్కసాని' అని చెప్పుకొన్నారు ఆంధ్ర కవితా పితామహుని ఇంటిపేరు అల్లసానివారు శ్రీనాధుని కాలంనుంచీ భోగమువారిని సాని అని పిలవడం వాడుకలో ఉన్నా ఉత్తరోతరా అది పరువు తగ్గిన పదమైంది వేశ్యకు పర్యాయ పదమైంది

అలంకారంచేత ప్రకాశించే ఆడదాన్ని వేశ్య అంటారు తెలుగులో ఈ శబ్దానికి ఆటవెలది, గడనకత్తె, తొత్తు, పడుపుగత్తె పొత్తుటాలు, భోగముది, ముండ, లంజ, వాడవదిన, వెలయాలు అనే పర్యాయ పదాలు ఉన్నాయి కన్నెరికమైన దానినే సాని అని పిలుస్తారు కాని దానిని పడుచు అంటారు వేమనగారు తమ పద్యాలలో తరచుగా తొత్తు, ముండ, లంజె అనే తెలుగుపదాలనే వారకాంతలకు వాడారు వెలయాలు అంటే కొన్న విటుడు కొంతకాలం, సేపుగాని రేపుగాని, అనుభవించడానికి అమ్ముడు పోయిన వస్తువు

> గంపెడంత తవుడు గంపలో పెట్టక
> చన్ను ముట్టనీదు కొన్నబత్రె
> వారకాంత లెల్ల వలతురో యూరక
> విశ్వదాభిరామ వినురవేమ (D - 1721 - 2 - 354

చేతిలో సొమ్ముంటేనే చెల్లుతుంది విటుని వైభోగం అది లేకపోతే అంతా హుళ్లక్కి

> ముండల తగు గోష్టి మునుగుచు తేలుచు
> విడువలేరు సుమ్మి వెర్రినరులు

---

[41] ఆచార్య తూమాటి దొణప్ప - జానపదకళా సంపద పుట 63

అండబాయు వెనుక యన్నియు బోవురా
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 3122

అంగట్లో సరుకును అంత వెలపెట్టి కొనలేనివాడు చౌక సరుకుల కోసం వెతకడం సహజం

విటుడు డాగుచేసి విడిచిన లంజెను
పేద విటుడు దగిలి ప్రియము సేయు
కుప్పలోని జెప్పు కుక్క గన్నట్లుగా
విశ్వదాభిరామ వినురవేమ[42]

సి వి కృష్ణా బుక్ డిపో ప్రతి – పుట 42

వారకాంతకు తొత్తు అనే పేరుకూడా ఉన్నా ఇంటి దాసిని కూడా తొత్తు అని పిలుస్తారు "తొత్తు తొత్తె కాని దొరసాని కాబోదు" అని వేమన గారు చెప్పారు ఇంట్లో నిత్యం కనబడే పనిమనిషిపై భ్రమ పడడం పరిపాటే

తొత్తు తోటి పొందు తొర్రి పెసల మూట
ముచ్చు తోటి పొందు వచ్చు నింద
తలవరింతి పొందు తలతోటి తీరురా
విశ్వదాభిరామ వినురవేమ (D - 1721 - II - 34

ఈ భావమే కొన్ని ప్రతులలో వేరొక విధంగా ఉంది

తొత్తు తోడ బొందు దోషంబు దోషంబు
లంజె తోడ బొందు లజ్జ చెరుచు
జారతోడబొందు జావునకే యగు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 1977.

ఈ పద్యంలో తొత్తు అంటే ఇంటిదాసి, లంజె అంటె వాడవదిన, జార అంటే పరకీయ అని వేమనగారు ఉద్దేశించినట్లు కనబడుతుంది గతిలేక మరీ దిగజారిన విటుడు దొమ్మరింటికి వెళ్లకతప్పదు

---

24 ఈ పద్యానికి పాఠాంతరం వ్రాత ప్రతులలో ఉంది
విటుడు తగిలిరోసి విడిచిపెటు వెనుక
పిదప నొకడు దగిలి ప్రియము సేయు
కుడిచి వైచు పుల్లె కుక్కలునాకవా (D – 1773 vol II – 87.

దొమ్మరింటి నుండి తొంగి చూచుచురాగ
నెరిగినట్టి వార లెదురు పడిన
జచ్చు నంత కంటె జొచ్చి పోగజూచు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 2090.

ప్రతి భార్యా శయనేషు రంభ అని సూచించారు

లంజె లంజె యంద్రు లౌకికమందును
లంజె కాని దెవతె లా గరయగ
మగని లంజె కాని మగువయు భువినున్నె
విశ్వదాభిరామ వినురవేమ (వే నూ ర 3353

పడుపు గత్తెలను మరిగి పరువుపోయే స్థితికి పాల్పడకుండా ఉండమనే వేమనగారు వ్యంగ్యంగా హితోపదేశం చేశారు

ఇంటియాలి విడిచి యలవారకాంతల
వెంట తిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగె లేరిన యట్టు
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 359.

మగవాడికి చెప్పినట్టే జారగుణంగల గృహిణికి కూడ వేమనగారు హితబోధ చేశారు

పురుషుడెరుగ జంపు భూపతి విన జేటు
అఖిల విందకెల్ల నాలయంబు
పరపురుష గమనమ్ము ప్రత్యక్షనరకమ్ము
విశ్వదాభిరామ వినురవేమ

(D - 1721 - II - 11

వేమనగారు కామాన్ని విడిచిపెట్టమనలేదు 'కామిగాక మోక్షగామి కాడు' అన్నవారి సూక్తి సుప్రసిద్ధమే వారు బోధించినది ఆలుమగల అన్యోన్యం సంసార యోగాన్ని చాటి చెప్పారు

గుణవతియగు యువతి గృహము చక్కగనుండు
చీకటింట దివ్వె వెలగురీతి
దేవియున్నయిల్లు దేవార్చన గృహము
విశ్వదాభిరామ వినురవేమ [D - 1721 - I - 69

'సతికి పతికినైన సంపదే సరిపద' అని వేమనగారి నిర్ణయం దానినే చిలకకు చెప్పినట్టు అందరికీ చెప్పారు 'పెరగ పెరగ సతికి ప్రేమపుట్టు' నన్నారు వేమనగారు సిద్ధిపొందిన రెండు వందల సంవత్సరాలకు వారి వారసులనతగ్గ గురజాడ అప్పారావుగారు మాత్రమే మరులకూ ప్రేమకూ గల తేడాను చెప్పారు

మరులు మరలునును వయసుతోడనె,
మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమనిలుచును43

గురజాడ అప్పారావుగారు 'ప్రేమవిద్దెకు ఓనమాలు' కవులకృపగని భాగ్యవశమున నేర్చుకొన్నానన్నారు ఆ కవులలో వేమనగారు కూడా ఒకరు "ప్రేమ పెన్నిధిగాని, యింటను నేర్పరీకళ ఒజ్జలెవ్వరు లేరు" అని అప్పారావుగారు వాపోయారు

తమకాలంలో తాము నేర్చుకొన్నది తమతోటి వారందరికీ చెవి నిల్లు కట్టుకొని వేమనగారు చేసిన హితబోధనల వెనుక ఎంతో లోకవృత్త పరి శీలన ఉంది ధర్మార్ధ కామాల లోతు తత్త్వాన్ని ఆయన శోధించి ప్రజ లకు ఆ ఫలితాన్ని గోరుముద్దలుగా తినిపించారు సమాజాన్ని సంపూర్ణంగా ఆయన సమీక్షించారు సమతను ఆకాక్షించారు

సముదయంబునందు సర్వయొక్కటియైన
వైర మొదవలేదు వారడేమి
ఎచ్చు తగ్గులందు నేర్పడదే హాని
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 38471

ఆనాడు వేమనగారు ఆశించిన సర్వసమానత్వం ఈనాడు సాధ్యమన డానికి అవకాశాలున్నాయి లోకంలో మూడవవంతు సామ్యవాదదేశాలయి సంఘంలోని సర్వులకూ సౌఖ్యాన్ని సమకూర్చ గలుగుతున్నాయి 'వార్త విద్యలను ధూర్తుల పాలు' కానివ్వకూండా జాతిపరం చేసినప్పుడే సమత సాధించగలం దానికి అభ్యుదయశక్తుల ఐకమత్యం చాలా అవసరం

---

43 గురజాడ రచనలు - కవితల సంపుటం (1984 ముద్రణ) పుట - 10

ఐదువేళ్ల బలిమి హస్తంబు పనిచేయు
నందొకండు విడ్డ బొందిక చెడు
స్వీయుడొకడు నిడిన జెడుగదాపనిబల్మి
విశ్వదాభిరామ వినురవేమ (వే సూ ర 771

అందరినీ కూడగట్టుకొని రాగలిగినప్పుడే ఆశయ సిద్ధి

# దిగంబర చిత్రం వేమనగారిదేనా?!

ప్రస్తుతం ఒక దిగంబరయోగి చిత్రం వేమనగారి రూపచిత్రంగా బహుళ ప్రచారంలో వుంది బొమ్మను చూడగానే ఇది వేమనగారిది అని అందరూ ఇట్టే గుర్తుపట్టేటంతగా ఇది ప్రసిద్ధమైంది అయితే ఈ దిగంబర చిత్రం నిజంగా వేమనగారిదేనా? ఇటీవల కొన్ని పరిశోధనల తర్వాత నాకీ అనుమానం కలిగింది ఈ చిత్రం వేమనగారిది కాదేమో అన్న నమ్మకం కూడా కొద్దిగా కలుగుతోంది

ఇంతకీ వేమనగారు దిగంబరులేనా? అన్నది ముందు తేల్చుకోవలసిన విషయం దిగంబరత్వాన్ని సమర్థిస్తూ కొన్ని పద్యాలు వేమన శతకాలలో కనబడతాయి

తల్లి గర్భమందు దా బుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదను లేదు
నడుమ బట్టగట్ట నగుబాటు కాదొకో
విశ్వదాభిరామ వినురావేమ

ఇది చాలా సుప్రసిద్ధ పద్యం దీనివల్ల వేమనగారు దిగంబరత్వాన్ని ప్రబోధిస్తున్నారని విశదం అవుతుంది దిగంబరత్వానికి ముందు వారికి పుట్టగోచిమాత్రం వుండేదని చెప్పవచ్చు దానిని వారు విసర్జించారేమో

గోచి యూడెననుచు కోతిగనాడించి
వెర్రియోగి నూరు వెడలమంద్రు
తనదు భార్యముందు తాగోచి తీయడా
విశ్వదాభిరామ వినురవేమ

ఇది యోగి దిగంబరుడయినప్పుడు ఊరివాళ్ళు కోపంతో ఊరు వెళ్ళగొట్టిన సందర్భంగా చెప్పిన పద్యంలాగ కనబడుతుంది ఈపద్యంమూడవ పాదంలో 'ఎవరిగోచులూడ వీప్రొద్దు గ్రుంకిన' అనే పాఠాంతరం కూడావుంది

వేమనగారు చూడని దర్శనం లేదు తొక్కని మార్గం లేదు అని గట్టిగా నమ్మడానికి తగినన్ని పద్యాలు ప్రతి విషయం మీదా మనకు లభిస్తాయి ఇందులో ఏ పద్యాలు ఆయన చెప్పినవో ఇప్పటికీ నిర్ణయించడానికి వీలుగా సంశోధిత ప్రతి రాలేదు వేమనగారు ఒకప్పుడు దిగం

చరంగా సంచరించినా ఉత్తరోత్తరా పసుపు బట్టలు కట్టుకొని పాంకోళ్ళు తొడుక్కొని గుర్రమెక్కి ఊరూరా తిరిగేవారని ఊహించడానికి కూడా ఆస్కారముంది

వేమనగారి శిష్యుల పీఠాలు కడపలో నేడు చాలా వున్నాయి ఆ శిష్యులకు పసుపుబట్టలూ, పాంకోళ్ళూ, బక్క గుర్రాలూ నేడు నిధిగా వుంటాయి ఈ శిష్య పరంపరను చూసినవాళ్ళు ఈ విషయాలు చెప్పారు వేమనగారు దిగంబరులైతే వారి శిష్యపరంపర పసుపుబట్టలు ఎందుకు తొడుక్కోవాలి? నేటికీ రాయలసీమలో దిగంబర యోగినులే వున్నారు ఈ మధ్య పత్రికలకు కూడా ఎక్కారు వేమనగారు చివరిలో దిగంబరులు గానే ఉంటే వారి పేరు చెప్పుకొనే శిష్యపరంపర దుస్తులు తొడుక్కోవలసిన అవసరం లేదు ఈ శిష్యులు, తుంగవేమన తాలూకువాళ్ళని కొట్టిపారెయ్యడానికి కొందరు ప్రయత్నించవచ్చు

ప్రస్తుతం ప్రచారంలో వున్న దిగంబర చిత్రానికి ఒక చరిత్రవుంది వాస్తవానికి వేమనగారి పరాలుగా నాలుగైదు చిత్రాలు వివిధ రకాలవి 1907 నుండే ప్రచారంలో వున్నాయి ప్రస్తుతం బహుళ ప్రచారం పొందినది ఎందుకు రూఢమైనదో ఈ చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుంది

వేమన పద్యాలను 1829లో మొట్టమొదటిసారిగా బ్రౌను దొరగారు ముద్రించారు కారణాంతరాలచేత ఈ ముద్రణ విస్తృత ప్రచారాన్ని నోచుకోలేదు మరో పదేళ్ళకి 1839లో బ్రౌను దొరగారే మరో ముద్రణ ప్రచురించారు బ్రౌను దొరగారి సంకలనాన్ని యథాతథంగానో, లేక కొద్ది మార్పులతోనో, కృతజ్ఞతలు చెప్పిగానీ, చెప్పకగానీ అనేకులు తెలుగులోనూ, తమిళంలోనూ కిందటి శతాబ్దంలో 1843 నుండి అచ్చు వేస్తూనే వున్నారు అయితే ఈ శతాబ్దం తొలిరోజుల్లో తప్ప వేమనగారి బొమ్మను ఏ ముద్రణలోనూ ఎవరూ చేర్చలేదు (డాక్టర్ గోపి తన ప్రజాకవి వేమనగ్రంథంలో బ్రౌను దొరగారి కాలం నుంచి వేమన పద్య సంకలనాల ప్రచురణల వివరాలను ఓపికతో సేకరించాడు)

"కొల్లాపురం అగ్రహారం నివాసి" పమ్మి త్యాగరాయశెట్టిగారు తమ శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలలో 1901లో వేమనపద్య సంకలనం ఒకటి ప్రకటిస్తూ దానిలో వేమనగారి బొమ్మను కూడా ప్రచురించారు ఇది 1908 నాటి కూర్పులో కూడా ఉంది ఈ బొమ్మ ఒక సిపాయి ఇంట్లో ఉన్న రంగుల బొమ్మకు నకలు అని ప్రకాశకులు

ప్రకటించారు ఈ బొమ్మ ఇప్పుడు ప్రచారంలో ఉన్న ప్రసిద్ధ చిత్రానికి కొంచెం వేలువిడిచిన బంధువులాగ ఉంది

1913లో రాయవరం పూర్ణయాచారిగారు బందరు నుంచి 'వేమన సూక్తి రత్నాకరం,' అనే అకారాదిసంకలనం ప్రకటించారు ఇందులో ఒక బొమ్మను వేమనగారిదని చెప్తూ అచ్చువేశారు ఇది దిగంబర చిత్రంకాదు

1916లో నెలూరు జిల్లా మైపాడు నివాసి కరూరు బంగారయ్యగారు "వేమనార్యుని పద్య పదశబ్దార్ధము" అనే పుస్తకం వ్రాసి చెన్నపట్నం పాతవాకలిపేటలో ప్రకటించారు ఇందులో అచ్చువేసిన వేమనగారిబొమ్మ కింద 'వెర్రి వేమన' అని రాశారు

1922లో శ్రీ వంగూరు సుబ్బారావుగారు "వేమన (సంపూర్ణ జీవిత చరిత్రము – బోధనలు)" అనే గ్రంధం ప్రచురించారు ఇందులో "తంజావూరు రాచనగరు చిత్రపటము నుంచి తీసినది" అని వివరిస్తూ వేమనగారి పటాన్ని ముద్రించారు ఇదే ఇప్పుడు ప్రచారంలో వున్న బొమ్మకు మాతృక

1925లో వావిళ్ళవారు (తమ పూర్వ ముద్రణలలో దేనిలోనూ వేయకపోయినా) తాము ప్రచురించిన ముద్రణలో వేమనగారి పటాన్ని తంజావూరు రాచనగరుదే అని చెప్పి అప్పటి తంజావూరు మహారాష్ట్ర రాజుల వారసుడు "శ్రీ కృష్ణారావు భాన్స్లే" గారి సౌజన్యంతో ప్రచు రించారు ఈ బొమ్మ నాటినుండీ బహుళ ప్రచారంలోనికి వచ్చింది

1926లో తమిళంలో ప్రచురితమైన "వేమన పద్దియం" అనే గ్రంథంలో ఒక వేమనగారి బొమ్మ వుంది దీనికీ ప్రచారంలో వున్నదానికీ ఏ మాత్రం పోలికలు లేవు ఈ బొమ్మ సన్యాసి బొమ్మ కూడా కాదు జందెం వుంది

ఇదీ కాలక్రమానుగుణంగా వేమనగారి చిత్రాల చరిత్ర వంగూరి వారు, వావిళ్ళవారు తంజావూరు రాచనగరులోని చిత్రానికి నకళ్ళు ప్రచురించారు అయితే ఇంతకీ తంజావూరు రాచనగరులో వేమన గారి చిత్రపటం వుందా? అక్కడ ఒక దిగంబరయోగి చిత్రం మాత్రం వుండేది 1928 కి పూర్వమే కట్టమంచి రామలింగారెడ్డిగారు తంజావూరు రాజమహల్‌లో ఒక దిగంబర సన్యాసి చిత్రాన్ని చూశారు ఇది వేమన గారిదని అక్కడివాళ్ళు చెప్పారు ఇందులో ఎంతవరకు సత్యముందని రెడ్డిగారు అనుమానించారు

నేను 1955లో సరస్వతీమహల్‌పై రేడియో వారికి ఒక ప్రసంగ వ్యాసం రాసే సందర్భంలో తంజావూరు వెళ్ళాను చూడవలసినవన్నీ చూశాను రాచనగరు సందర్శించడమేకాక మహారాష్ట్రరాజుల వృద్ధవార సుణ్ణి కలుసుకొన్నాను నేను చూసిన చిత్రాలలో ఒక దిగంబర సన్యాసిది కూడా ఉన్నట్టు లీలగా మాత్రమే జ్ఞాపకం

మహారాష్ట్ర రాజుల కాలంలో వేమనగారు తంజావూరులో పర్యటించారని చెప్పడానికి వారి పద్యాలలో ఒక ఆధారం లేకపోలేదు కానీ రాచనగరుకూ, వారికీ, వారి బొమ్మను వేయించి పెటుకొనేటంత, ప్రగాఢ సంబంధం ఉన్నట్టు చెప్పడానికి ఏవిధమైన ఆధారాలూ లేవు

నిజానికి తంజావూరు రాచనగరుతో ఇంకో సుప్రసిద్ధ సన్యాసికి సంబంధం వుంది నాయకరాజుల రాజ్యపతనం తర్వాత తంజావూరును మహారాష్ట్ర రాజులు పాలించారు ఏకోజీ 1676 నుంచి 1683 దాకా పాలించాడు ఇతని తర్వాత ఇతని కుమారులు ముగురూ ఒకరి తర్వాత ఒకరు పాలించారు శాహజీ (1684-1710) శరభోజీ (1711-1728) తులజాజీ (1729-1735) అనే ముగ్గురి అన్నదమ్ముల పాలనలో సంస్కృతాంధ్ర మహారాష్ట్ర కవితలు తంజావూరులో వెల్లివిరిశాయి తత్త్వ శాస్త్ర చర్చలు జరిగాయి అద్వైతం మళ్ళీ తల ఎత్తింది శాహాజీకి బిడ్డలు లేరు శరభోజీ బిడ్డలకోసం నోచని నోము లేదు

సంతానం కోసం శరభోజీ వివిధక్షేత్రాలలోని దేవతలకు మొక్కులు మొక్కుకున్నాడు ఆ మొక్కులు చెల్లించడానికి తనతరపున తన ఆస్థాన విద్వాంసుడు మలహారి పండితుణ్ణి ఆయా క్షేత్రాలకు పంపించాడు పుణ్య క్షేత్రాలు దర్శించుకొంటూ మలహారి పండితుడు దాసాంబా పురానికి వచ్చాడు అది శరభోజీ తల్లిపేర నిర్మించిన ఊరు అక్కడి సదాశివ బ్రహ్మేంద్రులు వుంటున్నారు వారిని దర్శించుకొని మూడుభిక్షలు నివేదించుకొని సేవించుకొని పండితుడు తన రాజుగారి పుత్ర వాంఛను విన్నవించుకొన్నాడు సదాశివ బ్రహ్మేంద్రులు అనుగ్రహించి శరభోజీని దీవిస్తూ తమ కృతి "ఆత్మవిద్యావిలాసం" ప్రతినొకదానిని రాజుకు పండితునిద్వారా పంపించారు సదాశివ బ్రహ్మేంద్రుల దీవన పలించి శరభోజీకి అనతి కాలంలోనే పుత్రోదయమైంది

ఈ చారిత్రక వివరాలను ఆచార్యవి రా ఘ వ న్ గారు శ్రీధర వెంకటేశుల శాహేంద్ర విలాస కావ్యానికి ఉపోద్ఘాతంరాస్తూ, సాక్ష్యాధారాలతో విశదపరిచారు (పుట 19) ఈ పుస్తకం తంజావూరు సరస్వతీమహల్

ప్రచురణలలో 54 వ నెంబరుది ఈ వివరాలవల్ల సదాశివ బ్రహ్మేంద్రులకూ తంజావూరు రాచనగరికి ప్రగాఢ సంబంధం కనబడుతుంది పుత్రోదయ మయ్యాక శరభోజీ బ్రహ్మేంద్రుల తైలవర్ణ చిత్రాన్ని రాయించుకొని నగరులో పెట్టుకున్నారా ?

సదాశివ బ్రహ్మేంద్రులు చాలా సుప్రసిద్ధులు ప్రస్తుతం సంగీత రంగంలో ప్రచారం పొందిన "మానస సంచరరే" "సిబరే రామరసం" వంటి కీర్తనలు వీరురాసినవే, దక్షిణాదిని నామ సిద్ధాంత-భజన పద్ధతులను శ్రీధర వెంకటేశులతోపాటు సదాశివ బ్రహ్మేంద్రులూ ప్రచారంచేశారు వీరి గురించి సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామ దీక్షితులవారు ఇలా రాశారు

"అమరానదీ తీర మందుగల కరూరునందును కావేరీ తీరమైన కరూరు కొడుముడి మొదలైన పుణ్యక్షేత్రములందును 163 సంవత్సరములకు మునుపు దిగంబరులై సంచరించుచు జ్ఞానపరులైన సదాశివబ్రహ్మము అను మహాపురుషులు బ్రహ్మానంద పరవశులై యన్నసమయములందు గేయ వాగ్రూపముగా సంస్కృత కీర్తనము లనేకము చేసియున్నారు అవి యిప్పు డును ప్రసిద్ధముగా నున్నవి"

సుబ్బరామ దీక్షితులవారు సంగీత సంప్రదాయ ప్రదర్శిని 1901 లో రాశారు అప్పటికి 163 సంవత్సరాలకిందట అంటే క్రీస్తుశకం 1738 ప్రాంతాలు ఆకాలంలో ఒక దిగంబర సన్యాసి ఉండడం వారికి తంజావూరు రాచనగరుతో సంబంధం ఉండడంచూస్తే వారి చిత్రపరమే గాని వేమనగారి చిత్రపరానికి తంజావూరు రాచనగరితో సంబంధం ఉండడానికి ప్రస్తుతం ఆస్కారం కనబడలేదని చెప్పవచ్చు

భావి పరిశోధనలు నిజం తేల్చవచ్చు